# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

25, ఏప్రిల్- 1, మే, '86

రు. 2-50

పెద్దకథ

బలివాడ కాంతి

* వినియోగ దారుల విద్య-ఉద్యమము
* అరవింద ఆశ్రమంలోని మాత ఎవరు?
* దర్శక ప్రముఖుడు కె. రాఘవేంద్రరావుతో ఇంటర్వ్యూ

# సౌగంధిత సౌరభాలు

## ఓనమ్

తాజా మరియు గొప్ప పరిమళము.
ఓనమ్ పరిమళము మిమ్ములను నెమ్మది
నెమ్మదిగా చేరును. ప్రకృతి సహజమైన
సువాసన అదే మీరు ఎల్లప్పుడూ
కోరునది.




## మొగ్రా

ఇది ఒక చిన్న తెల్లటి మల్లెపూవు.
గొప్ప సువాసన కలిగియున్నది.
మోగ్రా దివ్యమైన సుగంధము మీ
ప్రేమకు మధురమైన చిహ్నము.




## వైశాక్

ఈ సహజమైన సుగంధము ప్రకృతి సిద్ధమైనది.
ఒక అద్భుతమైన కానుక. ప్రకృతి తన
సహజమైన సువాసనలలో ఎట్లు ప్రకృతిని
నింపునో వైశాక్ అదే
సహజమైన రీతిలో
తయారు చేయ
బడినది.




## చైత్ర




ఈ సువాసన చైత్రమాసపు కొత్త
అనుభవము. మరుపురాని దివ్య
పరిమళములను అందించునది. చైత్రా ఒక
అందమైన సంఘటన చైత్రా మాసపు మరపురాని
అనుభూతులను చైత్రా పరిమళములో మీరు
అనుభవించగలరు.

## గుల్‌మొహర్

అతి మధురమైన సువాసన గుల్ మోహర్
ఇచ్చును. ఈ రోజే వాడండి. మీకు
క్రొత్త ప్రపంచమును తెరచి చూపించును.






ఓనం అగర్‌బత్తి
కంపెని
156, 3వ మెయిన్ రోడ్డు, చామరాజపేట
బెంగళూరు 560018

CLARION/OAC/852

ఓనం ఉచిత శాంపిల్ ప్యాకెట్ జతపరచబడినది

రూపురంగులనిచ్చే పసుపు బంగరు
యాత్రలకు కారణం ఆయుర్వేద మూలికలే.

# హిమానీ గోల్డ్

## టర్మరిక్ సబ్బు మరియు క్రీమ్.

ఎవరికి తెలియదు చర్మ సౌందర్యాలకు పసుపు ఎంత సహాయ కారిణి అని. కానీ యీ తొందర రోజులలో శనగపిండితో కలిపి ప్రతి దినం ఎవరు వాడతారు... శనగపిండి లేకుండా కేవలం పసుపు మాత్రం కలసి ఉన్న చర్మ సౌందర్య సాధనాలు ఎలా చర్మాన్ని కాపాడగలవు ?

సంవత్సరాల తరువాత యీ సమస్యకు సమాధానంగా కనిపెట్టారు భారత విఖ్యాత రవీంద్ర పురస్కార విజేత శ్రీ శివకాళీ భట్టాచార్యగారు సౌందర్య సాధనాలలో కలిపేందుకు గాను పసుపుతో సహా తులసీ, గోరింట వట్టి వేళ్ళు, చందనం మరియు పద్మకముతో వనమూలికల గుణములు కలిపినట్లయితే చర్మ సౌందర్యాలకు పసుపు ఇస్తుంది ఒక ప్రత్యేకతను. శనగపిండి లేదే అన్న సమస్య మరి లేదు. సంపూర్ణ బంగరు ఛాయలు అలా నిలుస్తాయి.

ఔను—ఆయుర్వేదపు యీ అమూల్య అన్వేషణా ఫలితం లభిస్తోంది పూర్తిగా హిమానీ గోల్డ్ టర్మరిక్ సబ్బు లేక హిమానీ గోల్డ్ టర్మరిక్ క్రీమ్‌లో సదా. ఇదే భారత దేశంలో ప్రప్రథమం.

ఇప్పుడు మీ చర్మంలో క్రీమ్ మరియు సబ్బుల యొక్క ఆయుర్వేద గుణం అతి సహజ సౌందర్యాలతో మిళితమై శరీరం బంగరు ఛాయలతో మిలమిల్లు గొలుస్తోంది.
ఔను—అందరు అందాలను రెప్ప వేయకుండా చూస్తారు.

శాస్త్రాలలో వర్ణించబడిన వన ఔషధాల శ్రేష్ఠగుణములు :


పసుపు : ముఖానికిస్తుంది అందాల ఆహ్లాదాలను.


గోరింట : రంగురూపాలను అధిక కాంతివంతం చేస్తుంది.


తులసి : చర్మంపైన మరకలను నిర్మూలిస్తుంది.


చందనం : ఆరిన చర్మాలకు అందాల నిస్తుంది.


పద్మకము: చర్మ రోగాలను నిర్మూలించి క్రిములను నాశనం చేస్తుంది.


★కొబ్బరిమానె :చర్మ కోమలత్వాన్నిచ్చి సహజ సౌందర్యాన్నందిస్తుంది.


★వేపమానె: క్రిములను నష్టపరచి చర్మరోగాలను నిర్మూలించేందుకు దోహదాన్నిస్తుంది.
★సబ్బులో మాత్రమే.






## హిమానీ గోల్డ్ సబ్బు మరియు క్రీమ్

బంగరు సుదినాల సౌందర్యాన్ని తిరిగి తీసుకొస్తోంది

9580A/1TEL

# న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# సమస్యలకి కారణం సంపదే!

మనకి తగినటువంటి ప్రభుత్వమే లభిస్తుందన్నది నిజంకాదు. వాస్తవానికి మనకి తగని ప్రభుత్వమే వస్తుంది. ఆ మాటకివస్తే మనకి తగని చాలా విషయాలు, వ్యక్తులు మనకి రావటం కద్దు. ఉదాహరణకి. శివాజీరావ్‌పాటిల్ నీలంగేకర్, ఛార్లెస్ శోభరాజ్ (వీళ్ళిద్దరికీ మధ్య ఎలాంటి సంబంధమూలేదనే అనుకుంటున్నాను.); ఇందిరాగాంధీ, అబ్దుల్ రెహమాన్ అంతూలే; సంజయ్‌గాంధీ, గుండూరావు; స్వరాజ్‌పాల్, ప్రణబ్ ముఖర్జీలు. ఇలాంటివారు మనకి లభించడానికి మనం చేసింది ఏమిటి? అదేమిటో వివరిస్తాను. వాళ్ళ మధ్య ఉన్న బంధం అత్యాశ, డబ్బు.

నన్ను తరచు కొంతమంది వ్యక్తులు, ముఖ్యంగా భారతదేశం అంటే తెలియని విదేశీయులు, అడుగుతుంటారు మనం ఇంత దూర్మార్గంగా ఎందుకు ఉన్నామని. నేను వాళ్ళకి సర్ది చెప్పటానికి ఏవో సిద్ధాంతాలు అల్లి సుదీర్ఘమైన వివరణలు ఇస్తూ ఉంటాను. కానీ అవి వారి అభిప్రాయాలని మార్చలేవని నాకు తెలుసు. అతి సులువైన వివరణ ఏమిటంటే శతాబ్దాలుగా మనం పరాయి పాలనలో మొదట మొగలాయిలు, ఆ తర్వాత బ్రిటిష్‌వారు - ఉండటం వల్ల, మనం మనగలగటానికి ఏదో ఒకటి చెయ్యాలి కాబట్టి ఒప్పుకీ, తప్పుకీ; మంచికీ చెడుకీ మధ్య లేశం గల తేడాని మరచిపోయాము మనుగడ కోసం మనిషి ఏదైనా చేస్తాడు యూదులనే తీసుకోండి.కొత్త దేశం ఒకటి వారికి ఉన్నప్పటికీ, శరణార్థులుగా ఉండవలసిన అవసరం వాళ్ళకిలేకపోయినా కూడా వాళ్ళు తరిమికొట్టబడుతున్నారు మనకీ మనదైన ఒక దేశం ఉన్నది. మొగలాయీలకీ, బ్రిటిష్‌వారికీ ప్రవేశం కల్పింపబడింది. కానీ శతాబ్దాల నుంచి వచ్చిన అలవాట్లు అలాగే ఉంటాయి. అయినా మనుగడని గురించిన చింత మనని యింకా వదిలిపెట్టలేదు - వ్యాపారంలో, రాజకీయాలలో, ఉద్యోగాలలో వాస్తవంగా, జీవితంలో సాధారణంగా ఈ చింత అన్నది మనని వీడటంలేదు ఎలా ఉన్నావని మీరు ఏ భారతీయుడి నైనా అడగండి! ఏదో అలా బతుకుతున్నా అనే అంటాడు అలా అన్న అతనికి నీలంగేకర్ లాగా మీ పట్టణంలోనే ఎకరాలకొద్ది మంచి భూమి ఉంటుంది కుటుంబంలో ముగ్గురు డాక్టర్లు ఉంటారు అయినప్పటికీ ఆయన మోసానికి పాల్పడ్డారు తమ పదవిపోయేదాకా జరిగినటువంటి ప్రహసనంలో ఒక్కసారి కూడా ఆయన పొరపాటు జరిగిందని ఒప్పుకోలేదు

ఈ మనగలగటం అన్న సిద్ధాంతం విదేశీయులకి బాగా నచ్చి ఉండవచ్చు కానీ అది బూటకం అని నా అభిప్రాయం మనం ఇంత చెడ్డవాళ్ళం కావటానికి కారణం మనలో చాలామందికి నడమంత్రపుసిరి లేదా మంచి అధికారం లేదా రెండూ అబ్బేయి. దానికి మనం తట్టుకోలేక పోతున్నాము. ఆర్థికాభివృద్ధి లేదా ఆర్థికపరమైన అధికారం వల్ల ఒక్కసారిగా వచ్చి పడ్డ సంపదే భారతీయులతో వచ్చిన సమస్య కానీ పేదరికం కాదు దానికి సిద్ధంగా ఉన్నప్పుడే అలాంటిసంపదకి మనం తట్టుకోగలగటం సాధ్యమవుతుంది కష్టపడకుండా వచ్చిన డబ్బు నీతి సూత్రాలని కూడా హీన పరుస్తుంది.

హిందూ అభివృద్ధి రేటుని గురించిన ఈ చర్చ అంతా అర్థరహితమైనటువంటిది. ఈ అభివృద్ధి అంకెలు నల్ల డబ్బును చూపించవు అన్న విషయాన్ని మనం తెలుసుకోవాలి. ఎందుకంటేఅది లెక్కకి అందనంతగా ఉన్నది. శ్రీమతి గాంధీ అధికారానికి రాకపూర్వం అంటే 1966కి ముందు నల్లడబ్బు దాదాపుగా లేదనే చెప్పాలి. అలాంటిది ఇప్పుడది ఆర్థిక వ్యవస్థలో రెండింటి మూడు వంతులకు పైగా ఉన్నది. భారతదేశం పేదదే కావచ్చు. కానీ దాని ఉత్పాదన ఏటా రు. 2 లక్షల కోట్లు. దానికితోడు మరో లక్ష కోట్ల రూపాయల నల్లదబ్బు కూడా తయారవుతున్నది ఈ నల్లడబ్బు బాగా సంపన్నులైన వారు, పెద్ద అధికారంలో ఉన్నవారి మధ్యనే చలామణిలో ఉన్నది. రాజకీయాలలో భారీఎత్తున డబ్బుని వినియోగించిన రాజకీయవేత్త శ్రీమతి గాంధీ 1969లో బాంకులని జాతీయం చెయ్యటం ద్వారా ఆమె బహిరంగంగానే దానిని చేశారు. సమానత్వానికి స్టాలిన్ కమ్యూనిజానికి ఎంత సంబంధం ఉన్నదో బాంకుల జాతీయాకరణకి సోషలిజానికి అంతే సంబంధం అన్నది బాంకులంటే డబ్బు ఉండే చోటు. పెద్ద వ్యాపారాన్ని, పెద్ద ఎత్తున డబ్బుని ఒకే దెబ్బతో ఆమె తమ గుప్పిటలోకి తీసుకున్నారు. బాంకుల జాతీయీకరణతోనే భారతదేశంలో నల్ల డబ్బు అభివృద్ధి చెందటం ప్రారంభం అయింది దానితో డబ్బుతో దేనినైనా కొనగలిగే అవినీతి కూడా మొదలైంది.

బాంకులు రాజకీయ నాయకుల అదుపులో ఉండటం వలన వ్యాపారవేత్తలు తమకి కావలసిన డబ్బుని తామే సృష్టించుకోవటం మొదలుపెట్టారు అదే నల్లడబ్బు శ్రీమతి గాంధీకి ఈ విషయం తెలుసు. వ్యాపారవేత్తలు అలా చెయ్యటాన్ని ఆమే ప్రోత్సహించారు. ఆ విధంగా రాజకీయవాదులకీ, వ్యాపారవేత్తలకీ మధ్య అనుబంధానికి అంకురార్పణ జరిగింది. ఆ బంధం ఇప్పుడు ఎంత బలపడిందంటే, అసలు నల్లడబ్బుకీ తెల్ల డబ్బుకీ మధ్య తేడాని వ్యాపారవేత్తలు తెలుసుకోలేని స్థితికి వచ్చారు. ఆర్మ్కోస్‌కి చెందిన కపాల్‌మెహ్రా ఇటీవల మాట్లాడుతూ తమకి సంబంధించినంత వరకూ నల్లడబ్బుకి, తెల్ల డబ్బుకీ మధ్య తేడా ఏమి లేదనీ, వచ్చిన తేడా అంతా రాజకీయవాదుల మనసులలోనేనని అన్నారు ఆయన అన్నది నిజమే వ్యాపారవేత్తలు విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ బృందం మీద అంత కోపంగా ఉండటానికి గల కారణాలలో ఒకటి– అధికార పార్టీవారూ తామూ కలిసి సృష్టించిన దానికి తమని మాత్రమే వాళ్ళు బాధ్యులని చెయ్యటం

భారీయెత్తున ఉన్న ఈ నల్లడబ్బు అంతా అధికార పార్టీ వద్దా, వ్యాపారవేత్తల దగ్గరా, దానిని నిర్వహించే మరికొందరి వద్దా ఉన్నది ఫిలిప్పయిన్స్‌లో మార్కోస్ ఈ విధంగానే చేసాడు పరిస్థితులు ప్రతికూలించినప్పుడు, అవి ఎదురు తిరుగుతాయని ఆయనకి తెలుసు తాను దోచిన సొమ్మంతా భద్రపరిచే ఏర్పాట్లని వ్యాపారవేత్తలైన తన మిత్రుల ద్వారా ముందుగానే చేసుకున్నాడు. కొద్ది దశాబ్దాలకి పూర్వం అనామకులైన వసంత్ దాదాపాటిల్ వంటివారు ఇప్పుడు కోటీశ్వరులుగా, అంతకి పదింతలుగా ఉన్నారు అలాగే గుండూరావు, ప్రణబ్‌ముఖర్జీ తదితరులు కూడా. అలాంటి డబ్బుతో శ్రీమతి గాంధీ చేసినట్లుగా ఎన్ని రకాల ఆటలైనా ఆడవచ్చు. ఆ డబ్బు కొన్ని వేలు కాదు. లక్షలు కాదు. వందలాది కోట్ల రూపాయలు మార్కోస్ కుటుంబం తమ 20 సంవత్సరాల పాలనలో చేసుకున్నటువంటి డబ్బు మార్కోస్ తమ దేశం నించి తీసుకువెళ్ళిన డబ్బు రు. 1500 కోట్ల నించి రు 8000 కోట్ల మధ్య ఎంతైనా ఉండవచ్చు సిట్జర్లాండులోనో, మరెక్కడో దానిని దాచి ఉంటాడాయన. మన పాలకులు దోచుకున్నది కూడా అంతకంటే చాలా ఎక్కువే ఉండి ఉంటుంది. బొంబాయి వార్తాపత్రిక ఒక దానిలో పడిన అంచనాని బట్టి అది రు 25,000 కోట్ల నించి రు 40,000కోట్ల వరకూ ఉండవచ్చు. దానిలో చాలా భాగం యూరోప్‌లో నెంబరు మాత్రమే ఉండే ఖాతాలలో ఉంటుంది ప్రస్తుతం దేశంలోని రాజకీయాలకి ఇటువంటి డబ్బే కారణం. ఈ దేశంలోని ప్రతి వ్యక్తికీ, ప్రతి దానికీ ఒక రేటు ఉన్నది నీలంగేకర్ కేసులో సాక్ష్యాన్ని రూపుమాపటానికి బొంబాయి విశ్వవిద్యాలయంలోని ఒక అధికారికి రు. 25 లక్షలు నగదు ఎరగాచూపారట ఆ ముఖ్యమంత్రి స్నేహితుడైన ఒక వ్యాపారవేత్త ద్వారా ఆ డబ్బు వచ్చిందట.

పంజాబ్‌లో కూడా అక్కడి రాజకీయాలకి తిరిగి డబ్బే మూలకారణం అయింది అకాలీ నాయకులు అందరూ బాగా డబ్బు ఉన్నవాళ్ళు వాళ్ళ ఆదాయం అంతా వ్యవసాయం వల్ల వచ్చింది కాబట్టి దానికి పన్ను ఉండదు మరో వైపు తీవ్రవాదులకి డబ్బు పాకిస్తాన్ నుంచి, అమెరికా, కెనడాల నుంచీ అందుతున్నది భారతదేశంలోని కలతలకి, కల్లోలాలకి మూలకారణం పేదరికం కాదు, సంపదే. మనం జాగ్రత్తగా ఉండకపోతే ఆ సంపదనే ఈ దేశాన్ని ముక్కలు చెయ్యడానికి ఉపయోగించడం జరుగుతుంది □

# బుల్‌వర్కర్ -3 ప్రత్యేక తగ్గింపు ధర!


ఇదిగో కండలుగల భుజాలను పెంచుకునే తీరు


ఈ వ్యాయామం వెనుక కండలను పెంచి 'కార్యసాధకుడు' అనిపించేసే రూపాన్నిస్తుంది


ఇది ముంజేతులకు సరికొత్త బలాన్నిస్తుంది.


ఈ వ్యాయామం లోతైన, కండలుగల బలమైన ఛాతీనిస్తుంది.


ఉబ్బిన పొట్టను కండగల గట్టి దానిగా తీర్చి దిద్దుతుంది.


ఈ వ్యాయామంతో ఉక్కులాంటి గట్టి పిక్కలు రూపొందుతాయి.

## మీరు శరీరదార్ఢ్యం కావాలనుకుంటే, బుల్‌వర్కర్ దాన్ని మీకు సమకూరుస్తుంది- రోజుకు కేవలం 5 నిమిషాల్లో

"శరీర దార్ఢ్యం కోసం తొందరగా, సులభంగా ఫలితాలు సాధించే వ్యాయామ కార్యక్రమం కావాలనుకుంటున్నారా? బుల్‌వర్కర్ ఆ వ్యాయామాలన్నిటినీ రోజుకు కేవలం 5 నిమిషాలకు కుదించి మీ శరీరానికి పూర్తి దార్ఢ్యం చేకూర్చుతుంది: మీ భుజాలు, వీపు, చేతులు, ఛాతీ, కడుపు, కాళ్లు దృఢంగా రూపొందుతాయి" అంటున్నారు శరీర దార్ఢ్య నిపుణులైన బాబ్ బ్రిటన్.

మొట్టమొదటి రోజునుంచే మీ శరీర దార్ఢ్యం పెరుగుతుంది. సాధనంలోనే అమర్చబడిన పవర్ మీటర్ గేజ్‌లో దాన్ని మీరు చూసుకోవచ్చు. రెండు మూడు వారాల శిక్షణ తర్వాత చాలా మంది పురుషుల్లో భుజాలు, ఛాతీ, దండల్లోని కండరాలు 2 నుంచి 5 సెం. మీ. పెరుగుతాయి. నడుము భాగంలో 2 నుంచి 5 సెం.మీ. కొవ్వు తగుతుంది. అది కేవలం ప్రారంభం మాత్రమే! మీ శరీరంలోని ఏ భాగాన్నయినా మీరు పెంచుకోవాలన్నా, తగ్గించుకోవాలన్నా అందుకు ప్రత్యేక వ్యాయామాలు ఉన్నాయి. అంతేకాదు, బుల్‌వర్కర్ శిక్షణ కొనసాగుతున్న కొద్దీ, ప్రతిసారీ మీరు మరింత బాగా చేయగలుగుతారు. ఈ శిక్షణ మీకు ఎప్పుడు సులభంగానే ఉంటుంది. ఎందుకంటే ప్రతిసారికీ మీ శక్తి దాదాపు 1% పెరుగుతూ ఉంటుంది -అంటే మొదటి 3 నెలల్లో 50% వరకు పెరుగుతుందన్న మాట.




అన్ని ప్రముఖ దుకాణాలలో దొరుకుతుంది

**ఇట్టే అయిపోతుంది:** ఒక్కొక్క వ్యాయామానికి కేవలం 7 సెకండ్లే! రోజుకు ఒక్కసారి! ఎంతో సులభం: మామూలుగా ఆరోగ్యంగా వున్న 15 నుంచి 65 ఏళ్ల మధ్య వయస్సు గల మగవారెవరైనా ఈ వ్యాయామాలన్నిటినీ అలసిపోకుండా చెయ్యవచ్చు.

## మామూలు ధర రు. 314/-

## ఇప్పుడు! కేవలం రు. 298/-కే

**ఉచితం**
- క్యారీయింగ్ కేస్ రు. 45/- విలువ చేసేది
- 24 పేజీల పుస్తకం
- బొమ్మలతో కూడిన ఎక్సర్‌సైజ్ ఛార్టు
- న్యూట్రిషన్ అండ్ ట్రెయినింగ్ గైడ్

ప్రపంచస్థాయి ఛాంపియన్లు, ఎథ్లెట్లు, కోచ్‌లు, డాక్టర్లచే సిఫారసు చేయబడినది

వి.పి.పి ద్వారా రూ. 298/-కి | దొరికేచోటు బుల్‌వర్కర్ డిపార్ట్‌మెంట్
263-ఆర్ 85 మెహతా మహల్, 15 మేథ్యూ రోడ్, బొంబాయి-400 004.

## ఈ కూపన్ ఇవాళే పోస్టుచేయండి!

బుల్‌వర్కర్, మెహతా మహల్, 15 మాథ్యూ రోడ్, బొంబాయి 400 004., 263-R-Tel LO

దయచేసి నాకు బుల్‌వర్కర్ -3 వెంటనే పంపండి. ఫలితాలు నాకు 14 రోజుల్లోగా పూర్తి సంతృప్తినివ్వకపోతే, నేను వస్తువులన్నిటినీ తిప్పిపంపి దీని వెల డబ్బును (పోస్టు, పంపకం ఖర్చులు మినహాయించి) వెంటనే వాపసుచేయమని కోరవచ్చునని గ్రహించాను. SW-54

దయచేసి తగిన గడిలో ☑ టిక్కు పెట్టండి.

☐ రిజిష్టర్డ్ పోస్టు పార్సిల్‌లో పంపండి. నేను రూ.298/- డ్రాఫ్టు/ఐ.పి.ఓ./ఎమ్.ఓ. ద్వారా పంపుతున్నాను. దాని నంబరు.............తేదీ................
(బుల్‌వర్కర్ ప్రైవేట్ లిమిటెడ్ వారికి చెల్లించవలసినది)

☐ వి.పి.పి. ద్వారా పంపండి. సరకు అందిన మీదట పోస్టుమన్‌కు నేను రూ. 298/- చెల్లించగలనని మాట ఇస్తున్నాను.

పేరు ..............................................

చిరునామా ..............................................

..............పిన్ కోడ్.......... ..........సంతకం.. ..........

## ఘుమఘుమలాడే మిరపకాయ
## మిసమిసలాడే టమోటాను వరించింది

అప్పుడే అడ్డుకోనలవిగాని ఆశలు పరుగులుదీయ ప్రారంభించాయి.

కిసాన్‌వారి క్రొత్త టమోటా చిల్లీ సాస్ రుచులన్నీ సక్రమంగాకూడి ఆవిర్భవించిన నోరూరించే సరిక్రొత్త సాస్. ఆ రుచి, ఆ పక్వము, ఆ ఘాటు, ఓ•••లొట్టలేయించే ఆ రుచుల మేలు కలయిక•••

చివరి బొట్టువరకు జుర్రుకోవాలనిపించే మీ ప్రయత్నాన్ని ఎవరైతే ఆపగలరు.

### కారకారంగా, రుచి రుచిగా రెంటి కలయికలా

చిదిమితే పగిలేలాయుండే తేనెలొలుకు టమోటాలు, తలుచుకుంటే చాలు గగనానికి ఎగిరించే ఎర్ర గారపు మిరపకాయలతో చేయగలిపాయి పరిపక్వము చెందిన రెండు విభిన్న రుచుల కలయికలో ఉద్భవించిన సరిక్రొత్త నోరూరించే రుచికి, సాస్‌ల తయారీలో అసమాన పేరు ప్రతిష్ఠలు గాంచిన కిసాన్ వారి అనుభవము తోడైంది. మీకు లభించే రుచి

ఇక చెప్పాలా! మీ జివ్హా చాపల్యం తీరదూ!

### మొదటిసారే ఆ రుచికి అంకితం

మొద్దుబారిపోయిన మీ నాలుకకు జీవముట్టిపడేలా చేయండి. మీరు ఇష్టపడే ఎ వంటకాల జతలోనైనా కిసాన్‌వారి టమోటా చిల్లీసాస్‌ను వాడి చూడండి. ఆపైన ఆ పేరు చెబితే చాలు ఆరుచికి బాసైపోగలరు. ఉత్తేజం పరుగులు వేయనివ్వండి. కిసాన్‌వారి చవులూరించే క్రొత్త టమోటా చిల్లీసాస్‌ను పూర్తిగా ఒంపుకోండి. ఎందు కంటే మీరు ఇష్టపడే ప్రతి వంటకముతో బాటుగాని లేక ఇతర ఏ వంట కపు జతకుగాని అలా జీవముట్టిపడే రుచిని మరే ఇతర సాస్ అందించ లేదు. ప్రయత్నించి చూడండి. ఆ రుచికి అంకితమై పోగలరు.






**కిసాన్‌వారి క్రొత్త**
**టమోటా చిల్లీ సాస్**
**మరేది దీనికి సరిరాదు**

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు ·

**దేశోద్ధారక కాశీనాథుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం · 1908

**శివలెంక శంభుప్రసాద్**

సంపాదకుడు (1938-1972)

25 ఏప్రిల్-1 మే 1986

శ్రీ అక్షయ నామ సం. చైత్ర. బ పాడ్యమి

**సంపుటము 78 : సంచిక 33**

సంపాదకుడు .

**శివలెంక రాధాకృష్ణ**

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6నెలల చందా | రు. 71.50 |
| పోస్టులో 12నెలల చందా | రు. 143.00 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**

హిందీ నటి "ఖుష్‌బూ"

(ఫొటో : గాంధీ టిక్స్ సౌజన్యంతో)



# ఉత్తరాలు

## ముఖ చిత్రం

వర్ధమాన నటి రజని ముఖచిత్రంతో వెలువడిన మార్చి 14-20 సంచిక ముగ్ధ మనోహరంగా ఉంది మనసు కిచ్చిన మాట కథ నాకు చాలా నచ్చింది

మా అభిమాన నటుడు చిరంజీవి గారితో ఆంధ్రసచిత్ర వారపత్రికలో సమాధానాలు ఇప్పించండి? దయచేసి వర్ధమాన రచయితలను ప్రోత్సహించండి

–ఏలేటి బుల్లిరాజు చౌదరి, రామచంద్రపురం

* * *

నల్లత్రాచు పడగపైన మల్లెదండ
దాలిచె నన శోభిల్లెడి వాలుజడ
ఉరమున మెఱయగా కౌముదీ రజనిబోలు
రజని ముఖ చిత్రము మహత్తరమ్ము మాకు

–ఆకెళ్ళ సుబ్బారావు, కందికుప్ప

## విచారకరం

శ్రీ జయ్‌దుబాషి కాంగ్రెసు పార్టీ తప్పుడు విధానాలను చీల్చి చెండాడవచ్చును అందులో మాకే విధమైన బేదాభిప్రాయం లేదు కాని ఆయన లేఖలు జాగ్రత్తగా పరిశీలించి చూస్తే నెహ్రూ కుటుంబం మీద కరుడుగట్టిన ఆయన ద్వేషం ప్రకటితమవుతోంది ఇంకా మోతీలాల్ నెహ్రూలోని లోపాలు కూడా ఆయన రిసెర్చి చేసి మీ పత్రికలో ఎందుకు ప్రచురించలేదా అని ఆలోచిస్తున్నాము

"ప్రచురణకు వెళ్ళని ఇంటర్వ్యూ" శ్రీ దుబాషి ఊహాగానాలతో అల్లిన ఇంటర్వ్యూ అని పసిబాలుడు కూడా చెప్పగలడు "అందిన అదృష్టాన్ని నిలబెట్టుకోలేని అధికారపక్షం" శీర్షికతో వ్రాసిన లేఖలో అరుణ్ నెహ్రూను, అరుణ్‌సింగ్‌ను బూట్‌పాలిష్ బృందంగా వ్రాయడంలో ఆయన పైత్యం అర్ధమవుతోంది నిష్పక్షపాతంగా కాంగ్రెసు పార్టీ విధానాలను నిశితంగా విమర్శించే శ్రీకృష్ణ న్యూఢిల్లీలేఖలను ప్రచురించిన మీ పత్రిక శ్రీ జయ్‌దుబాషి వంటి పక్షపాత చక్రవర్తులకు స్థావరంగా మారడం చాలా విచారాన్ని కలిగిస్తున్నది.

-భమిడిపల్లి వెంకట భాస్కర సత్యనారాయణ మూర్తి, మండపేట

సీరియల్

# వసంతగీతం

దేవినేని ఉష

(గత సంచిక తరువాయి)

కృష్ణ మద్రాస్ వెళ్ళివచ్చి రెండురోజులు దాటాయి మూడోరోజు రాత్రి తొమ్మిది అవుతోంది కృష్ణ ఎమ్. కాం స్టడీస్ చూసుకుంటున్నాడు.

కృష్ణ ఉంటున్న ఈ కాంపౌండ్‌లో ఐదు కాపురాలు ఉన్నాయి అందులో ఇంటివాళ్ళు, ఒకటి కృష్ణ ఉంటాడు మిగిలిన మూడు వాటాలు ఉద్యోగస్తులు, సంసారంతో ఉంటున్నారు కృష్ణ ఇంట్లో ఉన్నంతసేపు తలుపులు మూసుకునే ఉంటాడు బైటకు వెళ్తే అందరితో స్నేహంగా మాట్లాడుతాడు అతను ఇంట్లో ఉన్న కాసేపూ ఏదో ఒకటి చదువుకుంటూ ఉంటాడని అతన్ని ఎవరూ డిస్టర్బ్ చేయరు

తలుపు గబగబా బాదుతున్నారు ఎవరో కృష్ణలేచి తలుపు తీసాడు ఎదురుగా ఉన్న వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయాడు

అను నిలబడి ఉంది ఆమె ఒళ్ళు ఎందుకో అదురుతోంది మొహం అంతా చమటలు పట్టేసి ఉన్నాయి. కళ్ళలో గోదారి ఉరకటానికి సిద్ధంగా ఉంది చేతిలో బ్యాగూ, భుజానికి హేండ్‌బాగ్ ఉన్నాయి

"బాబూ! ఈమె ఎవరో నీకోసం వచ్చింది నేను గేట్ తాళం పెట్టేసాను ఈమె వచ్చి పిలిస్తే తీసాను" అను వెనుక ఉన్న ఇంటామె అంటోంది

కృష్ణకు అయోమయంగా ఉంది ఆమెను తను తన ఇంటికి రమ్మని ఎడ్రస్ ఇచ్చినమాట నిజమే కానీ ఇలా వేళగాని వేళలో వస్తుందనుకోలేదు

"ఏంటబ్బా అలా శిల్పాల్లా నిలబడ్డారు?" ఇంటామె కసురుకుంది

కృష్ణ ఈ లోకంలో పడ్డాడు

'ఈమె మా బంధువుల అమ్మాయి అండీ అనూ లోపలకురా!" అంటూ తొట్రుపాటు అణుచుకుంటూ లోపలకు పిలిచాడు

అను మౌనంగా లోపలకు వచ్చేసింది ఇంటామె బాబూ! గేటు తాళం తీసే ఉంచనా?' అడిగింది

వద్దండీ తాళం వేసేయండి అవసరం అయితే నేను పిలుస్తాను" అన్నాడు.

అలాగే వస్తాను' అంటూ వెళ్ళిపోయింది

కృష్ణ తలుపు గెడపెట్టేసాడు

"ఏమిటండీ ఇలా వచ్చారు"? అని కృష్ణ అడుగుతుండగానే అను కళ్ళలో గంగ ఉరికి వచ్చింది బ్యాగ్ కిందపడేసి వెక్కి వెక్కి ఏడవసాగింది. కృష్ణ కంగారు పడిపోయాడు.

"ప్లీజ్ అనూగారు! అసలు సంగతేమిటో చెప్పండి" అసహనంగా అడిగాడు.

"నాకు ... నాకు ఈ ఒక్క రాత్రి ఇక్కడ ఆశ్రయం ఇస్తారా? తెల్లవారి లేచి ఏ నుయ్యో, గొయ్యో చూసుకుంటాను" వెక్కిళ్ళ మధ్య అంది

"ఉండండి నాకేం అభ్యంతరం లేదు కానీ మీబాధ ఏమిటో చెప్పండి"? ఒక ఆడపిల్ల అలా వచ్చి ఏడుస్తుంటే కృష్ణకే కాదు ఎవరికైనా జాలి కలగడం సహజం దానికితోడు కృష్ణది అసలే జాలిగుండె ఎలా కాదనగలడు?

"నన్ను ఏమీ అడగకండీ' అంది

"సరే, మీ ఫ్రెండ్ ఏమయ్యాడు"?

'ఛీ ఆ నీచుడు పేరు ఎత్తకండి" అంత దుఃఖంలోనూ కచ్చిగా తిట్టింది

దాంతో కృష్ణకు సర్వం అర్థం అయింది. ఆతనేదో అమర్యాదగా ఆమె పట్ల ప్రవర్తించి ఉండవచ్చనీ, అందుకే ఈ టైమ్‌లో ఆమె ఇలా కొద్దిపాటి పరిచయం ఉన్న తన ఇంటికి రక్షణకోరి వచ్చిందని అంచనా వేసాడు.

'చూడండి నాఇంట్లో మీరు నిశ్చింతంగా నిద్రపోండి. ఉదయం మీ దుఃఖం తగ్గితే అప్పుడు చెపుదురుగాని" అన్నాడు అసలే బాధగా ఉన్న ఆమెను అవన్నీ అడిగి మరింత కలత పెట్టాలనుకోలేదు. కృష్ణ రూమ్‌లో రెండు మడత మంచాలు ఉంటాయి ఒకటి తను రోజు పడుకుంటాడు. మరొకటి తండ్రిగానీ, ఎవరైనా ఫ్రెండ్స్‌గానీ వస్తే ఉంటుందని స్పేర్‌గా అట్టే పెడతాడు.

రెండో మంచం వాల్చి తలగడా, దుప్పటీ పరిచాడు

"కూర్చోండి" అంటూ అనుకి మంచం చూపించాడు ఏడ్చి ఏడ్చి అను కళ్ళు ఎర్రబడిపోయాయి. మొహాన బొట్టు, కాటుక కరిగిపోయాయి చిన్న ముక్కు ఎర్రబడిపోయింది పెదవులు మాత్రం ఇంకా అదురుతూనే ఉన్నాయి.

సంకోచం లేకుండా వెళ్ళి మడత మంచం మీద కూర్చుంది.

"కృష్ణగారూ! కనీసం నన్ను మీరైనా నమ్మతారా"? తనని తను చూపించుకుంటూ పిచ్చిదానిలా అడిగింది. కృష్ణ తెల్లబోయాడు. "ఎందుకు నేను నమ్మడం"? అడిగాడు.

"నా కేరక్టర్ మంచిది అందరితో ఆడా, మగా బేధం, లేకుండా స్నేహంగా ఉంటాను అంతే! నా కెవరితో ఏ డీలింగూ లేదు.'

'అలా అని ఎవరన్నారు"? కృష్ణ ప్రశ్నించాడు.

"వాడే ఆ దుర్మార్గుడు వాడికి లొంగలేదని నేను చెడిపోయిన దాన్ని అన్నాడు" అను కళ్ళు మళ్ళీ జలజలా వర్షించాయి మరో పావుగంట అలా ఏడుస్తూనే ఉంది.

"చూడండీ, మీరు చాలా మంచివారు మీ మంచితనం మీ మొహంలో కనబడుతూనే ఉంది నేను మిమ్మల్ని నమ్ముతున్నాను ఆమెను స్వాంత పరచటానికి అంటున్నాడే కానీ కృష్ణ మనసులో సందేహాలు ఈగల్లా ముసురుకుంటున్నాయి.

ఈమె చెప్పేదంతా నిజమేనా? లేదా! నటనా? ట్రైన్‌లో ఏర్పడిన పరిచయాన్ని అలుసుగా తీసుకుని ఏదో స్వలాభానికి వచ్చి ఇలా నాటకం ఆడుతోందా అనుకున్నాడు సరే, అదేదో తెల్లారి తేలకపోతుందా? ఎంత నటనతోనైనా తనని ఎవరు పిచ్చివాడ్ని చేయలేరు అని నిశ్చయించుకున్నాడు

మనసులో ఒక పక్క ఆమెను నమ్మాలనిపిస్తోంది. ఆమె కష్టం ఏదో తెలుసుకుని సాయం చేయాలనిపిస్తోంది.

"అనుగారు! మీరు ఈ పూట ఇంకేం మాట్లాడవద్దు. మౌనంగా పడుకోండి" అంటూ బెడ్‌లైట్‌వేసి ట్యూబ్‌లైట్ తీసేసాడు.

అను పడుకుంది తలనిండా ముసుగు పెట్టుకుంది. కానీ రాత్రంతా ఆమె నిద్రపోలేదు ఆ ముసుగులో కదులుతూనే ఉంది. ఎందుకైనా మంచిది అన్న ఆలోచనతో కృష్ణకూడా ఆ రాత్రంతా జాగరూకతోనే మెలకువగా ఉన్నాడు.

ఆమె బహుశ ముందు జరిగిన అనుభవంతో తనని కూడా నమ్మలేకపోవచ్చు అందుకే ధైర్యంగా నిద్రపోలేక పోతోందేమో అనిపించింది.

చాలా మెల్లగా ఎలాగో తెల్లారింది. అను లేచి దుప్పటి మడచి చేతులలో మొహం దాచుకుని మంచంమీదే కూర్చుని ఏదో ఆలోచించసాగింది.

"గుడ్‌మార్నింగ్"! అంటూ కృష్ణ కూడా లేచాడు. కిటికీ తీసాడు. వెలుతురు

**జరిగిన కథ-2:** చిన్నతనంలో తలి దండ్రులను కోల్పోయిన కృష్ణ వరుసకు చిన్నాన్న అయిన సుబ్బారావు దగ్గర పెరుగుతాడు హైదరాబాద్‌లో బ్యాంకులో ఉద్యోగం వచ్చింది మాలతిని చూడటానికి పెళ్ళిచూపులకి మద్రాసు వెళ్ళుతాడు కృష్ణ కృష్ణ, మాలతి ఒకరినొకరు నచ్చారు. హైదరాబాదుకు తిరుగు ప్రయాణంలో అను పరిచయమైంది కృష్ణకి ఒక కోయ వ్యక్తి కృష్ణకి ఇప్పుడనుకుంటున్న అమ్మాయితో పెళ్ళి కాదని వేరే అమ్మాయితో పెళ్ళి అవుతుందని జాతకం చెప్తాడు

లోపలకు వచ్చింది.

అను కళ్ళు పొడారిపోయి ఉన్నాయి. కృష్ణను చూసి ఏదో అనబోయింది. కాని బొంగురుపోయి కంఠంలోనుండి మాట రాలేదు.

"బ్రష్ చేసుకోండి అదుగో బాత్‌రూం"! వంటగది అవతల ఉన్న ఎటాచ్‌డ్ బాత్‌రూం చూపించాడు.

అద్దె ఎక్కువ కావటాన ఆ కాంపౌండ్‌లో ప్రతి ఇంటికీ ఎటాచ్‌డ్ బాత్‌రూం, లెట్రిన్ ఉన్నాయి.

అను మౌనంగా వెళ్ళి మొహం కడుక్కొని వచ్చింది. దొడ్లో కలకలం మొదలయింది. పనిమనిషులు వచ్చినట్టున్నారు. సామాను కడుగుతున్న శబ్దం, నీళ్ళమోత ప్రతి ఇంటిలోనూ వినిపిస్తోంది.

టేబుల్‌మీద ఉన్న దువ్వెన, అద్దంతీసి జడ వేసుకుంది. బ్యాగ్‌తీసి పట్టుకుంది.

"వస్తానండీ" అంటూ కృష్ణను పిలిచింది.

కృష్ణ ముసుగుతీసి చూసాడు

"అరె, ఏమిటిది"? బ్యాగ్ చూస్తూ అడిగాడు.

"నేను వెళ్ళొస్తానండీ" హేండ్‌బ్యాగ్ భుజానికి తగిలించుకుంటూ మరోసారి చెప్పింది.

"ఎక్కడికి వెళతారు? మీ ఇంటికా"?

"ఇంకా ఇంటికి చస్తే వెళ్ళను" దృఢ నిశ్చయంతో చెప్పింది.

"మరైతే ఎక్కడకు వెళతారు?"

"ఏమో చెప్పలేను. బహుశ హుస్సేన్ సాగర్ ఉంది. అందులో దూకి చస్తాను అదే నాకు సరైన అదృష్టం"! ఆమె కళ్ళలో నీళ్ళు చిప్పిల్లాయి

ఆ మనసు చాలా గాయపడిందని, చావే తన సమస్యలకు పరిష్కారం అనుకుంటోంది అని తెలిసింది కృష్ణకు. ఆమెపైన జాలి కలిగింది. ఇటువంటి అమాయకమ్మైన ఆడపిల్లలు ఏ తుంటరివాడి మాటలో నమ్మి ఇల్లు వదలి వచ్చి దీపం వేడికి మసి అయ్యే పురుగుల్లా జీవితాలు కాల్చేసుకుని చివరకు వ్యభిచార వృత్తిలో దిగుతున్నారు. ఎవరి ఆదరణకు నోచుకోక శిథిలమ్మై చివరకు నికృష్ట చావులకు లోను అవుతున్నారు. ఈమె బ్రతుకు కూడా చివరికంతేనేమో! బాధగా కళ్ళు మూసుకున్నాడు.

అందరి సంగతీ తనకు తెలీదు తనకు తెలిసిన కనీసం ఈమె జీవితం అయినా ఒక దారికి మళ్ళించాలి. తనకు చాతనైన సాయం చేయాలి. బి ఏ. చదువుకున్నానంటోంది. ఎక్కడైనా చిన్న జాబ్ ఇప్పించలేడా? ఆలోచించాడు.

"నమస్తే! రాత్రి మీరు చేసిన సాయానికి థాంక్స్! వస్తానండీ" చేతులు జోడిస్తూ మరోసారి అంది.

ఉలిక్కిపడి తేరుకున్నాడు.

"మీరు చావటానికైతే నేను వెళ్ళనివ్వనండీ" అను వేపు చూస్తూ గట్టిగా అన్నాడు.

"మరి"? ఆమె కళ్ళు భయంతో పెద్దవయ్యాయి.

"మీ ఇంటికి వెళ్ళాలనుంటే చెప్పండి. నేను వచ్చి దింపుతాను."

"మా ఇంటికి చచ్చినా నాశవం కూడా వెళ్ళదు" ఆమె కూడా గట్టిగా అంది.

"అలా అయితే మీరు ఎక్కడికి వెళ్ళకండి"

"వెళ్ళక ఇక్కడెలా ఉంటాను"?

"నేను మీ కేదో మార్గం చూపిస్తాను."

"థాంక్స్! నా గురించి మీకు రిస్క్ తీసుకోవద్దు. ఎలా వచ్చానో అలానే నా దారిన నేను పోతాను" అంటూ తలుపు దగ్గరకు వెళ్ళి బోల్ట్ తీసింది.

"ఆగండి. నేను మీకు జాబ్ ఇప్పిస్తాను"

"ఇప్పించి...." వెనక్కి తిరిగింది. కళ్ళలో రోషం ఉబికింది.

"మీరు కూడా ఆ త్రాష్టుడిలా జాబ్ ఆశ చూపెట్టి నన్ను లొంగదీసుకోవాలనుకుంటున్నారా? అదెప్పటికీ జరగదు. చావుకైనా సిద్ధమే కానీ" కచ్చితంగా నొక్కి పలికింది.

కృష్ణ మొహం అవమానంతో ఎర్రబడిపోయింది.

"ఓకే మీరు వెళ్ళండి ప్రస్తుతం మీ మనసు ఎవర్ని నమ్మేస్థితిలో లేదు. నేను కేవలం జాలితో మీకు సాయం చేయాలనుకున్నాను. మీరు ఇలా అర్థాలు తీస్తే



# వసంతగీతం

నేను చాలా ఫీల్ అవుతాను. కానీ నేను మీ ఫ్రెండ్‌లాటి వ్యక్తి_ని కాదు. వెళ్ళండి" శాంతంగా చెప్పాడు.

అది నిజమో, నటనో తేల్చుకోలేక పోయింది ఆమె తను ఇప్పుడు ఇంటికి వెళ్ళే ఉద్దేశ్యంతో లేదు. తనని పిలిచి ఆదరించటానికి ఎవరూ రెడీగా లేరు. ఇక్కడనుండి ఏ బంధువుల దగ్గరకో వెళ్ళిపోయినా వాళ్ళు తన సంగతి ఇంటికి చేరవేస్తారు ఆ తరువాత వాళ్ళు వచ్చి చేసే రగడ ఆపైన జరిగేది తను ఎంతమాత్రం భరించలేదు. కృష్ణ నమ్మదగిన మనిషిలానే ఉన్నాడు. ప్రస్తుతం ఈ పరిస్థితుల్లో తను ఇతని సాయం తీసుకోక తప్పదు. తను చచ్చిపోవాలనుకుంది అది మాత్రం తేలికగా సాధ్యపడుతుందా? ఈలోగా తన జీతం ఎలా మలుపు తిరుగుతుందో ఇతని దగ్గర తెలివిగా తనని తను కాపాడుకుంటూ ఇతని సాయంతో ఏదైనా జాబ్ చూసుకుని అప్పుడు తనదారిన తను బ్రతకొచ్చు.ఒకవేళ ఇతను ఆ ఇడియట్‌లా చేయదల్చుకుంటే అప్పుడే ఇతనికి దూరంగా వెళ్ళిపోవచ్చు అని ఆలోచించింది.

కృష్ణలేచి "విష్‌యుగుడ్‌లక్ ఫ్రెండ్! ఇక్కడే అంటే ఈ వూరిలోనే వుంటే నాకు ఎప్పుడైనా కనబడండి" అంటూ బ్రష్ తీసుకుని బాత్‌రూంలోకి వెళ్ళిపోయాడు. అను తలుపు దగ్గరే నిలబడింది.

అతను తీరిగ్గా అన్నీ ముగించుకుని స్నానం చేసాడు ఆమె వెళ్ళిపోయి ఉంటుంది అనుకున్నాడు.

'పూర్‌గాళ్! ఏదైనా సాయం చేద్దామనుకున్నాడు. ఆమె మనసు ఎవరినీ నమ్మలేకపోతోంది చేసేదేం ఉంది' అనుకున్నాడు

స్నానం పూర్తి చేసి టవల్ కట్టుకుని గదిలోకి వచ్చాడు. తలుపువేపు చూసి ఉలిక్కిపడ్డాడు ఆమె ఇంకా అక్కడే ఉంది ఆమె వెళ్ళిపోయిందనుకుని అతను టవల్‌తో నే వచ్చేసాడు

చొక్కాలేని అతని ఛాతీ, టవల్‌కింద కనిపించే కాళ్ళు చూస్తూ ఆమె సిగ్గుపడిపోయింది. తలుపు తీసుకుని వేగంగా బైటకు వెళ్ళిపోయింది.

కృష్ణ గబగబా లుంగీ తీసి చుట్టుకుని షర్ట్ వేసుకుంటూ బైటకు వచ్చాడు. ఆమె తలుపు పక్కగా నిలబడి ఉంది

"రండి లోపలకు" చుట్టూ చూస్తూ ఆమెను పిలిచాడు. ఉదయం పనివేళ కాబట్టి బైట ఎవరూ లేరు

"థాంక్‌గాడ్!" అంటూ గాలిపిల్చి ఆమె వెనుకే లోపలకు వచ్చి తలుపులు దగ్గరగా వేసాడు

ఆమె బ్యాగు కింద పెట్టేసింది "నాకు ఏదైనా జాబ్ ఇప్పిస్తారా?" దీనంగాఅడిగింది.




"అలాగే నాకు తెలిసిన కంపెనీలు ఉన్నాయి అక్కడ కనుక్కుంటాను కానీ మీరు ఇక్కడ ఉండటం బాగుండదు" సందేహంగా అన్నాడు మంచి మనసుతో సాయం చేయబోయినా అది తన బ్రతుకులో అపార్థాలు రేపుతుందోమో అని అతనికి ఆమెను ఇక్కడ ఉంచుకోవటం ఇష్టంలేదు

బ్రహ్మచారి. తను ఇక్కడ ఉండటం అతనికీ, తనకూ కూడా మంచిదికాదని. అను కూడా గ్రహించింది.

"మరేం చేద్దాం? ఈ వూళ్ళో మాకు బంధువులు కూడా ఎవరూ లేరండీ" నిస్సహాయంగా అంది.

కృష్ణకు ఒక ఐడియా వచ్చింది.

"మిమ్మల్ని వర్కింగ్ ఉమెన్ హాస్టల్‌లో జాయిన్ చేస్తాను" అన్నాడు.

అను మొహం వికసించింది

"అలాగేనండీ" అంగీకరించింది.

కృష్ణ బైటకు వెళ్ళి ఫలహారం, కాఫీ తెచ్చాడు. ఇద్దరు తీసుకున్నారు.

ఆమె కథ వినాలనుంది కృష్ణకు కానీ బెరుకు తగ్గాకాఆమే చెప్పుంది అని పూరుకున్నాడు.

మీరు ఇక్కడే ఉండండి. నేను బ్యాంక్‌కి, వెళ్ళి లీవ్ పెట్టేసి వర్కింగ్ హాస్టల్ గురించి తెలుసుకుని మీ గురించి అడిగి వస్తాను అన్నాడు

అను తలూపింది. తొమ్మిది గంటలకు కృష్ణ బ్యాంక్‌కు వెళ్ళిపోయాడు. అను ఒక్కతే గదిలో ఉండిపోయింది

ఆమె మనసు భీకర సంగ్రామం జరిగినట్టుగా ఉంది. ఆవేశంలో ఎంత తెలివి తక్కువ పని చేసిందితను రాంబాబును నమ్మింది అందుకే ఇంట్లో చెప్పకుండా వచ్చేసింది ఇక్కడికి వస్తే ఇలా చేసాడు. ఇక ఈ కృష్ణ ఎటువంటివాడు ఇతన్నుంచి ఎంత అవమానం రాసి పెట్టాడో ఆ దేవుడు ఇంటి దగ్గర ఉంటే ఆ సుధాకర్ తనని భూతంలా పట్టి పీడుస్తున్నాడు ఆ దర్టీ రాస్కెల్ నుంచి తప్పించుకోవాలనే కదా తనీ నిప్పులగుండంలోకి వచ్చింది

సుధాకర్ గుర్తు రాగానే ఆమె పళ్ళు పటపట లాడాయి

"కృష్ణా!" అంటూ తలుపు బైట ఎవరో స్త్రీ గొంతు వినబడింది అను వెళ్ళి తలుపు తీసి వచ్చింది. ఆమె వెనుక ఇంటావిడ వచ్చింది

"ఏమ్మా! కృష్ణ బ్యాంక్‌కు వెళ్ళాడా?"

"అవునండీ కూర్చోండి" ఆవిడకు కుర్చీ చూపించింది ఆవిడ తీరిగ్గా కుర్చుంది.

టైమ్ పది దాటిపోయింది. మిగిలిన మూడు ఇళ్ళ ఇల్లాళ్ళు కూడా వచ్చేసారు. పిల్లల్ని కాన్వెంట్‌లకు, భర్తలను ఆఫీస్‌లకు పంపేసి వాళ్ళు తీరిగ్గా వచ్చి కూర్చున్నారు. వాళ్ళందరినీ చూసి అను కంగారు పడింది. వాళ్ళ ప్రశ్నలతో తననేం ఇబ్బంది పెట్టేస్తారో అని భయపడింది పైకి అవి కనిపించనివ్వక వారందరినీ నవ్వుతూ మాట్లాడించింది

"కృష్ణకు అత్త_కూతురివట కదమ్మా!" ఇంటామె అడిగింది.

అను తడబడిపోయింది మొహం ఎర్రబడింది.

"కృష్ణ నాకు చెప్పాడమ్మా! మా అత్తగారి అమ్మాయి ఉంది. తను వెళ్ళాకా నీకు కాలక్షేపం చేయమని" ఆవిడ నవ్వింది

"ఎప్పుడు?" ఏమనాలో తెలియక అడిగింది.

"బ్యాంక్‌కు వెళ్తు_ చెప్పాడు "

"అలాగా!" అంది.

పన్నెండు గంటల వరకూ వాళ్ళే ఏవో కబుర్లు చెప్తున్నారు అను కేవలం శ్రోతగా ఉండిపోయింది అను జాబ్ కోసం వచ్చిందనీ, ఆమెను ఇవాళ వర్కింగ్ హాస్టల్‌లో చేర్పిస్తానని కృష్ణ ఇంటావిడకు ఉదయం చెప్పాడు అందుకే వాళ్ళు ఆమెను ప్రశ్నలు వేసి విసిగించలేదు.

పన్నెండు దాటాకా వాళ్ళు లేచి వెళ్ళిపోయారు అను తలుపు బిగించి స్నానం చేసింది బ్యాగ్‌లో నుండి షిఫాన్ చీర తీసి కట్టుకుంది విడిచిన బట్టలు ఉతికేసుకుని ఆరేసింది. తల దువ్వుకుంది బొట్టు లేదు ఎవరినైనా అడుగుదాం అనుకుంది. కానీ వెళ్ళలేకపోయింది. కళ్ళు మూసుకుని మంచం మీద పడుకుంది.

ఆమె ఆలోచనలు ఎటు తిరిగినా చివరకు కృష్ణ మీదకే వస్తున్నాయి

## వసంతగీతం

దాంతో సుధాకర్ గుర్తు వస్తున్నాడు. మనసు పగబట్టిన తాచులా ఎగురుతోంది.

టక్ టక్ తలుపు మోగింది. లేచి బోల్ట్ తీసింది కృష్ణ చిన్న క్యారేజీతో వచ్చాడు.

"మా ఇంటామె బాగా కాలక్షేపం చేసిందా?" నవ్వుతూ అడిగాడు.

చేసిందన్నట్టుగా తలూపింది.

"చిక్కడపల్లిలో వర్కింగ్ ఉమెన్ హాస్టల్ ఉంది. వెళ్ళి అడిగాను. మిమ్మల్ని చేర్చుకుంటారట. అక్కడ ఉంటూ జాబ్‌కు ట్రై చేసుకుందురు గాని ఓ.కే!" అడిగాడు

"అలాగే కానీ మీరు నన్ను మీ ఇంటామెకు అత్త కూతురిని అని చెప్పారట కదా?" తల వంచుకుని అడిగింది.

కృష్ణ నవ్వాడు. "అవును చెప్పాను. నేను టిఫెన్‌కు వెళ్తుంటే మీరు ఎవరో చెప్పమని ఆవిడ నన్ను నిలేసింది. ఆ కంగారులో గభాలున అత్తయ్య గారి అమ్మాయి అని చెప్పాను తప్పా?"

"ఛ, తప్పు అని కాదు. ఊరికే అడిగాను" నొచ్చుకుంటూ అంది

"దట్సాల్, భోంచేయండి."

"మరి .. .. మీరు."

"నేను హోటల్‌లో చేసే వచ్చాను."

అను నిశ్శబ్దంగా తనకు తినాలనిపించినంత తిని మిగిలింది వదిలేసింది.

"నాలుగు గంటలకు వెళదాం. కాసేపు రెస్ట్ తీసుకోండి" అంటూ కృష్ణ రెండో మంచం వాల్చుకుని పడుకున్నాడు. అను మంచం మీద అలాగే కూర్చుంది

"పడుకోండి" అంటూ ఆమెను పరీక్షగా చూసాడు దాదాపు ఐదు అడుగుల ఎత్తుంటుంది. మొహంలో కనిపించే అమాయకత్వం చూసే కృష్ణ మనసు స్పదించింది. పచ్చ జార్జెట్ చీరలో ఆకులా మెరుస్తోంది. చెవులకు బుట్ట లోలాకులు, మెడలో గట్టి చైన్, చేతికి వాచీ, రెండు చేతులకు రెండు ఉంగరాలు, కుడి చేతికి ఆరు గాజులు బంగారపువి ఉన్నాయి.

ఆమె ఒంటి మీద ఉన్న బంగారాన్ని బట్టి చూస్తే కలిగిన ఇంటి వారి అమ్మాయిలానే ఉంది. వీలు కుదిరితే ఆమె యవ్వనాన్ని చిదిమి వేసి ఆ బంగారం తస్కరించి ఆమె బ్రతుకు నాశనం చేసే వాళ్ళు ఎంతో మంది ఉన్నారు ఈ లోకంలో ఆడపిల్లలు ఎంత చెడిపోతున్నారు తమ తెగింపులో అవతల మగవాడే లాభం పొందుతాడని ఏ మాత్రం గ్రహించలేక పోతున్నారు ఎన్ని కథలు చదివినా, ఎన్ని సినిమాలు చూసినా ఆడపిల్లలలో ఏమాత్రం పరివర్తన కలగటం లేదే అనుకుని బరువుగా నిట్టూర్చాడు

"నాకు పడుకోవాలనిపించటం లేదు" అను బరువుగా అంది.

"అలా అయితే మీ విషయాలు చెప్పండి" అంటూ లాలనగా అడిగాడు.

"నా విషయాలు దయచేసి ఏమీ అడగవద్దు" ఆమె మొహం నల్లబడి పోయింది.

"ఏం? మీ గతం మంచిది కాదా?" ఆమెను రెచ్చగొట్టి నిజం చెప్పించాలని అడిగాడు.

ఆమె మొహం చేతులతో కప్పుకుంది.

"చెప్పండి" అసహనంగా రెట్టించాడు.

"నా గతం చాలా ఘనమయింది కానీ అందులో నేను చేసిన చిన్న చిన్న పొరపాట్లే కాలసర్పాల్లా మారి నన్నీ స్థితికి తెచ్చాయి. నా క్యారెక్టర్ చాలా మంచిదండి కానీ అదే ఎవరూ నమ్మలేదు. నన్ను చూస్తే మీకు అలానే కనిపిస్తున్నానా? చెప్పండి. నేను ఏ తప్పు చేయలేదు. చివరకు రాంబాబు చేతిలో నుండి కూడా ప్రాణాలకు తెగించి పారిపోయి వచ్చాను." అనూకు మళ్లీ దుఃఖం ముంచుకు వచ్చింది.

"ప్లీజ్ అనూ! ఊరుకోండి" అన్నాడు. ఆమె శీలం విషయమై ఇంట్లో వాళ్ళు నమ్మలేదని అర్థం అయింది విచ్చివిచ్చని మొగ్గలా ఉన్న ఈమెను అందరు మాటల బాణాలతో హింసించారని, దానికి తట్టుకోలేక పోతోంది అని గ్రహించాడు.

"కృష్ణగారూ! కనీసం మీరైనా నన్ను నమ్మండి." ఏడుస్తూనే చిన్నపిల్లలా అర్థించింది

ఆ క్షణంలో కృష్ణకు స్వప్న గుర్తు వచ్చింది.

"అలాగే అనూ! నేను నమ్ముతాను" స్థిరంగా అన్నాడు

కాసేపటికి అను దుఃఖం ఉపశమించింది. నాలుగు గంటలు వరకూ ఆమె తన విషయాలు ఏమీ చెప్పలేదు ఇక ఆమెను ఏమీ ప్రశ్నించకూడదని, ఎప్పటికైనా ఆమే చెప్తుందని ఇక ఆ టాపిక్ వదిలేసాడు నాలుగు తరువాత ఆమెను వెంట బెట్టుకుని చిక్కడపల్లిలోని వర్కింగ్ హాస్టల్‌కు తీసుకు వెళ్ళాడు.

సుమిత్రాదేవి ఆ హాస్టల్ ప్రిన్స్‌పాల్. ఆమె సాదరంగా వీళ్ళని ఆహ్వానించింది ఆమె వదనం శాంతంగా, చూడగానే చేతులు జోడించేట్టు ఉంది ఆమె భర్త అక్కడ ఆర్గనైజర్. అక్కడ ఉండాలనుకునే జాబ్ చేసుకునే ఉమెన్స్‌కు చాలా రూల్స్ ఉంటాయి. సాయంత్రం ఆరు దాటే లోపునే లోపలకు వచ్చేయాలి ఈవెనింగ్ ఎక్కడికైనా వెళ్ళినా సుమిత్రాదేవి పర్మిషన్ తీసుకోవాలి మగవాళ్ళకి హాస్టల్

రూమ్స్‌లో ప్రవేశంలేదు విజిటింగ్ రూమ్‌లోనే మాట్లాడాలి.

ఆమె చిరునవ్వుతోనే కృష్ణకు, అనుకూ తమ రూల్సు అన్నీ చెప్పింది. నెలకు కట్టాల్సిన ఫీజు మాట చెప్పింది.

కృష్ణ అను పరిస్థితి ఆమెకు చెప్పాడు. ఆవిడ అనును చేర్చుకోవటానికి అంగీకరించింది.

అను హేండ్ బ్యాగ్ తీసింది.

ఆమె దగ్గర డబ్బు ఎంత ఉందో ఏమో, మిగిలిన దంతా తాను కట్టాలేమో! ఈ నెల ఇంటికి పంపటానికి తన దగ్గర సొమ్ము మిగలదేమో! అని కృష్ణ మనసులోనే లెక్కలు కట్టసాగాడు.

అను వందరూపాయల నోట్లకట్ట బ్యాగ్‌నుండి బైటకు తీసింది. కృష్ణ ఆశ్చర్య పోయాడు.

'మైగాడ్!' అనుకుంటూ.

"కృష్ణగారు! ఇవి వెయ్యిరూపాయలు. మీరే ఉంచండి" అంటూ అవి కృష్ణ చేతికి ఇచ్చింది.

కృష్ణ అవి తీసుకుని రెండు నెలలకు ఆమెకు బిల్‌కట్టాడు. మిగిలిన డబ్బు జాగ్రత్త చేసుకోమని ఆమెకే ఇచ్చేసాడు.

సుమిత్రాదేవికి అనును జాగ్రత్తగా చూస్తుండవల్సిందిగా మరీ మరీ చెప్పాడు.

"నేను రేపు వస్తానండీ. వెళ్ళొస్తాను" అనుతో చెప్పి లేచాడు. అను కృష్ణతో గేట్ వరకూ వచ్చింది చీకటి ముసురుకుంటోంది. బైటకు వెళ్ళిన ఉద్యోగినులంతా హాస్టల్‌కు చేరసాగారు

"మీరు త్వరపడి ఎటువంటి పిచ్చిపనీ చేయకండి. నేను రేపు ఈవెనింగ్ వస్తాను. మీ జాబ్ గురించి కూడా గట్టిగా ప్రయత్నం చేస్తాను" అనుతో చెప్పాడు.

"నాకు రక్షగా ఆ దేవుడు మిమ్మల్ని చూపించాడు. ఇంక ఎటువంటి ఆవేశం తెచ్చుకోను" నవ్వుతూ అంది

"గుడ్! మరి నేను వస్తాను" అంటూ వెళ్ళిపోయాడు

అతను ఉన్నంత సేపూ అతనిపై రకరకాలుగా అనుమానం కలిగినా అతను వెళ్ళిపోతుంటే చెప్పలేని ఒంటరితనంతో ఫీల్ అయింది

కృష్ణ ఆదుకోకపోతే ఆమె గతి అధోగతి అయ్యేదే కృష్ణలో ఉన్న జాలిగుణం, నిజాయితీ ఆమె గ్రహించుకుంది.

—

(ఇంకా ఉంది)

## పెద్ద కథ ప్రారంభం!

**గోపాలం యిలా చెయ్యడం ఇది తొలిసారి కాదు.**

**మాటాడకుండా యిదివరకు రెండుసార్లు మాయమైపోయాడు కదా!**

ఒకసారి పెళ్లాం పాండ్సు వేనిషింగ్ క్రీమ్ తెమ్మంటే కోల్డు క్రీమ్ తెచ్చాడని విసవిసలాడి విసిరికొట్టిందని ఆ సాయంత్రం యింటినించి వెళ్లిపోయినవాడు, మరుచటి రోజు సాయంత్రం వరకు తిరిగి యింటికి రాలేదు.



# బానిస బ్రతుకులు

బలివాడ కాంతారావు

**ఇంకోసారి యే సినిమాకెళ్లావని మామగారు అడిగితే ఒక మళయాళం సినిమాకని నిజం చెప్పేసాడు.**

ఇద్దరి యెదిగిన బిడ్డల తండ్రి! అలాంటి కామలీలల సినిమా చూడ్డానికి సిగ్గులేదూ! ఈ సుత్తి మామగారితో పాటు పెళ్లాం నెత్తిమీద వెయ్యగానే రెండు రోజులు యింట్లో గైరు హాజరు.

ఈ మూడో సారి అలాగే వస్తాడనుకుంటే మూడు రోజులైనా ముఖం కనపడలేదు. తండ్రి మీద కూతురు, కూతురు మీద తండ్రి రెండు రోజులు మౌనంగా యేవేవో అనుకున్నా మూడో రోజు కూతురు బైటకు ఒక మాట అనేసింది.

"అడుక్కు తినేవాడి అలి అయ్యేకన్నా, భాగ్యవంతుని బానిస అయితే మేలంటారు."

ఈ మాటలో అంతరార్థం గ్రహించిన తండ్రి "ఉత్తముడని కట్టిపెట్టాను గానీ ఉచితంగా వచ్చాడని కట్టపెట్టలేదు."

మూడో సారి పారిపోయే ముందు జరిగిన సంఘటన యేమిటంటే ఆఫీసు నుంచి యింటికి రాగానే మామ సదాశివరావు గోపాలంను నిలదీసి అడిగేడు.

"నీవు ప్రావిడెంట్ ఫండు నించి మూడువేలు అప్పు తియ్యడం నిజమా?"

"నిజం"

"ఎందుకు తీశావ్?"

"పెళ్లాం జబ్బు కుదర్చటానికని మిష పెట్టి తీసాను "

"నాకా జబ్బు? మికా జబ్బు?" పెళ్లాం ఖనేల్మంది.

"కళ్లు సరిగ్గా విప్పి చూడవోయ్. అది జబ్బు మనిషిగా వుందా?" అని మామగారంటే

"ఒకసారి అద్దం యెదరగా నిల్చొని అఘోరించండి. ఎవరి ముఖాన రోగం మూలుగుతోందో తెలుస్తుంది". అంది భార్య పావని తన బంగారు రంగు బుగ్గలను పొంగిస్తూ.

గోపాలం సహజంగా వెలిగించే చిరునవ్వును వొలగబోసాడు. ఆ నవ్వుతో ఆమెకు తేలు కుట్టినట్టయి గెంతి

"ఆ డబ్బు ఎక్కడ దాచారో వేగం తెచ్చి యివ్వకపోతే ..."

ఈ జడిపింపుకూ నవ్వేసాడు.

"నవ్వితే వూరుకుంటాననా? అందులో నా పెర్మిషన్ లేకుండా ఒక్క రూపాయి ఖర్చుపెట్టారంటే చూడండి మీకూ నాకూ ఈసారి గట్టిగా వస్తుంది"

మళ్లీ అదే నవ్వు.

"తిక్క తిగులుగాని వచ్చిందా?" పావని అనగానే

"అమ్మాయ్ అదేదో వచ్చినట్టుందే! నా యింట్లో వుండి నా దగ్గిరే యింత దాపరికం చేస్తాడని కలలో కూడా అనుకోలేదు. ఎన్నాళ్లనించి, యిలాంటి దాపరికాలు చేస్తున్నాడో?"

"వీధిలో వారాలు చేస్తూ చదువుకుంటున్న వాడిని యింట్లో పెట్టుకున్నారు! పెట్టుకుని నేను చెల్లనట్టు నన్ను కట్టిపెట్టి యిల్లరికం తెచ్చుకున్నారు. మా అమ్మే వుంటే నా ఒక్కగాని ఒక్క కూతుర్ని ఒక జమీందారింట్లో వేస్తారా లేదా అని పోరు పెట్టేదే? పడండి ... పడండి" అంటూ పావని యేడుస్తుంటే

"డబ్బు గురించి కాదు - ఇది తిరుగుబాటు. నేను భరించలేను. నా రెవిన్యూ సార్వీసులో నామీద ఇలాఎవ్వడూ తిరుగుబాటు చెయ్యలేదు. ఈనాటికి యింట్లో నావల్ల చదివి నా వల్లనే ఉద్యోగం సంపాదించి నామీదే తిరుగుబాటు చేసాడు. ఈ అవమానం భరించలేను."

అల్లుడు మళ్లీ చిరు నగవే

"చెప్పు ఆ డబ్బు ఏం చేసావో చెప్పు!" అని నిలదీసి కొట్టడానికి వచ్చినట్టు మామగారూ, ఏడుపు నాపి రేసుగుర్రంలా మీదికి వచ్చిన పెళ్లాం ఇద్దరి వేపు ఒకసారి చూసి

"లెఖ్ఖలు తరవాత చెప్తాను" అని మారుమాటాడకండా వూరుకున్నాడు ఈలోగా తండ్రీ కూతుళ్లిద్దరు కిర్రెత్తి యేవేవో మాటలు గోపాలాన్ని అనేసారు తల్లిని అనుసరించాడు పదిహేనేళ్లకొడుకు. అన్న, అమ్మ అంటున్నారని పదేళ్ల కూతురు గొంతు కలిపింది ఈ తిట్టుల కత్తితో తల గొరిగినా, తలపులు బోడి కాకపోవడంతో తాడు తెంచుకున్న గుఱ్ఱంలా తెల్లారేసరికి యింట్లో కనపడలేదు. మిల్కు బూతుకు వెళ్లి తేవలసినపాల పాకెట్టు రాలేదు.

ఉదయం లేచి యింట్లో అందరికీ 'టీ' కప్పులు అందిచ్చే గోపాలం లేకపోగానే అసలు వున్న మిగతా నలుగురూ నిత్రాణంగా కేకలు వేసేసారు ఏ కేకలకి జబాబు లేకపోవటంతో యేమైందని మామగారు



లేస్తే, మరెక్కడ గోపాలం? మూడో సారి అలక యిది అని అనుకుని మూడు రోజులు చూస్తే మనిషి కనపడడే! ఊర్లో వుంటే కనిపించేవాడే ఊరు వదలి యెక్కడకు వెళ్తాడు? ఆఫీసుకు ఫోను చేస్తే ఆఫీసుకు రాలేదట! ఎక్కడకు వెళ్లాడో?

ఈ మూడు రోజుల్లో యింట్లో కూరగాయలకు వాచిపోయారు. బజారుకి వెళ్లి బేరమాడటం గోపాలంకి తప్పించి యెవరికి తెలుసు? అంత పెద్ద యింట్లో ప్రతి ఆదివారం ఉదయం పట్టు దులిపి నీటుగా యింటిని వుంచిన వాళ్లింకెవరున్నారు? ఒక వారం చెయ్యకపోతే విసవిసలాడిన పెళ్లాం యీ ఆదివారం మొగుడు మీద కాదు యింట్లో వున్న తమ్ముడుమీద మాటలతో విరుచుకుపడింది అలా విరుచుకుపడడానికి కారణం ఆమె తండ్రే!

"కిందటిసారి వాసుండేవాడు. వెతికాడు " తండ్రి అనగానే "వాసు! వాడే ఇతగాడికి కొమ్ములిచ్చాడు అసలు యింటికి మేష్టారు మేష్టారు అని తెచ్చిందెవరు?

"వాడే .." అంది పావని.

"నా ఒక్కగాని ఒక్క కొడుకు ఒంటరిగా దూరాన వున్నాడు. వాడి మీద నిష్ఠూరం వెయ్యకు "

"గట్టిగా రాస్తాను"

"ఎంతమాత్రం రాయకు "

"ఎవరిళ్లలోనో అడుక్కుతిని వీధి లైట్ల కింద చదువుతూ పేవ్‌మెంట్ల మీద పడుకున్నవాడిని తెచ్చి

# బానిస బ్రతుకులు

నాన్నగారూ - మా స్కూల్లో మాష్టరు మూడుసార్లు చెప్పిన అర్థంకాని ఇంగ్లీషు పాఠం యీ గోపాలం గారు నడుస్తూనే సులువుగా బోధపర్చేసారు అబ్బో ఎంత బాగా పాడ్తారనుకున్నావని ఈ పై పై మెరుగులకి చిన్నవాడు వాడు లొంగిపోతే మీరేమో సమ్మోహనం అయిపోయి యింట్లో పెట్టుకుని ."

'అబ్బబ్బ ఎన్నిసార్లు దెప్పుతావులెద్దూ? నెత్తిన నోరుపెట్టుకుని యిప్పుడరిస్తే పిల్లలనెక్కడ దాచేస్తావ్? గోపాలం నవ్వులో నిప్పుందని నేనెప్పుడైనా అనుకున్నానా? మనం కోపంతో విసిరితే నిప్పు రాజుకుంటుంది మంచి మాటలతో ఆ నిప్పుమీద మంచినీరు పొయ్యి

పావని తండ్రి యిలా అంటాడనుకోలేదు కొడుక్కి సమర్థించాడంటే ఒప్పుకుంది ఇందులో అల్లుడ్ని సమర్థిస్తున్నాడన్న అనుమానం వచ్చి, యీ చెడుకాలాన్ని చెరిగి వదలిపెట్టానని భీష్మించుకుంది చెడు కాలాన్ని తెచ్చినవాడు మొగుడు చెరిగితే వాడ్నే చెరగాలి అంచేత పొరుగు యింట్లో ఫోనుంది కదా! మొగుడు పనిచేసే ఆఫీసు పెద్దకే ఫోను చేసింది

"గోపాలం డ్యూటీకి వచ్చాడా?"

'ఏ గోపాలం? ఇక్కడ వెయ్యిమంది పనిచేస్తున్నారు? మీకేమైనా తెలుసుకోవాలంటే మా ఆఫీసుకు వచ్చి పెరస్‌నల్ మేనేజర్ని కలవండి" అంటూ ఫోను పడేసాడు

"ఛీఛో తిక్క వెధవలా వున్నాడు ఆ తిక్కో గోపాలంకి అంటింది కామోసు ఇద్దరికి తిక్క కుదురుస్తాను" అని యింకో రోజు ఆగింది గోపాలం రాలేదు ఊరి మధ్యలో యిల్లేమో? రణగణ ధ్వనులకు రెస్టు లేదు. పగలైతే యెండ. రాత్రయితే మెర్క్యురీ వేపర్ లైట్లు పోకస్ ఇంట్లో బెడ్‌రూమ్‌లో పడ్డ వెలుగుతో అర్ధరాత్రి మీద తెలివొస్తే తెల్లారిపోయిందనిపిస్తుంది. ఇన్నాళ్ళు ఉదయం లేచేసరికి బాత్‌రూమ్ నించి గోపాలం కమ్మని గొంతుకతో ఆలాపించే గీతాలు వినపడేవి. ఇప్పుడు సిటీ బస్సుల గోల. ఇంటి ముందున్న చిన్న జాగాలోనే పూలకుండీలు అమర్చి, సాయంత్రం ఆఫీసు నించి రాగానే వాటి సేవ చేసేవాడు. ఇప్పుడు నాలుగు రోజులు ఆ సేవ కరువై ఆ పూలమొక్కలు ముఖాలు తేలవేశాయి

ఆఫీసుకు వెళ్లే ముందు యెందుకైనా మంచిదని ఆ పెర్సనల్ మేనేజరుకే ఫోను చేసింది.

'పది రోజులకు సిక్ లీవ్ పెట్టాడు " అని జవాబు రాగానే "అంతా అబద్ధం . "

"అబద్ధం అని ఎలా చెప్పగలరు?"

"ఎక్కడికో వెళ్లిపోయాడు. కనిపించలేదు "

"అయితే పోలీసు రిపోర్టు యివ్వండి " అని ఫోను దించేసాడు హలో హలో అంటే



# గడుసులోకం

—బాపు







పలుకుతాడా?మూడుసార్లు మళ్లీ ప్రయత్నిస్తే నెంబరు యెంగేజిడ్.

"కావాలని రిసీవరు బయటపెట్టేసి వుంటాడు. సరే నేనే వెళ్తాను" అని బయలుదేరింది. ఆరు కిలోమిటర్లు ఆటో మీద వెళ్లి మొగుడు జీతం తెచ్చేస్తానని వెళ్తే.

"అప్పుడే శలవులో వుండగానే జీతం తీసుకుపోయాడు."

"శలవుల్లో వుండగా జీతం యివ్వచ్చా?"

"మీ స్పెషల్ ఆర్డరు లేకపోవటం వల్ల ఆపలేదు." అని నవ్వుతూ ఆ మేనేజరంటే కాస్త వేళాకోళం చేస్తున్నాడని స్ఫురించి "అది కాదండి. ఆ డబ్బు దగ్గిరుంటే యిల్లు చేరరని ..."

"ఇక్కడ ఆఫీసులో అతని మీద మాకేం కంప్లయింట్లు లేవు. నమ్మకంగా పని చేస్తున్నవాడు. సాధారణంగా శలవు తీసుకోని వుద్యోగి. అతనిని మేం ఏ విధంగా దండించలేం. ఇదేదో కుటుంబ కలహంలా వుంది. మీలో మీరు రాజీపడ లేకపోతే కోర్టుకు వెళ్లిపోండి" అని తన పనిలో నిమగ్నుడైపోయాడా మేనేజరు.

ఒక సాంప్రదాయ కుటుంబంనించి వచ్చిన స్త్రీపట్ల యింత వుదాసీనంగా ప్రవర్తించడం చూసి ఒళ్లు మండింది. కోపం కంట్రోల్ చేసుకోడానికి అలా కొరివిలాంటి కళ్లుపెట్టి అతని వేపు చూసింది. అతనొకసారి యీామె అందంవేపు చూసి ఆ కళ్లప్పచెప్పి చూసిన చూపుకు తలదించి తన పనిలో తను పడ్డాడు.

"ఆడదాన్ని చూస్తే రిమ్మతెగులు తెచ్చుకునే మగాళ్లకి ఆడవాళ్ల గోడు యేం అర్థం అవుతుంది? జీతానికి వచ్చి నా మీద యేదో చెడ్డ కబుర్లు చెప్పి వుంటాడు. లేకపోతే వీళ్ల ప్రవర్తన యిలా మారడానికి కారణమేమిటి? ఈ వారం కాకపోతే యింకో వారం రాడా? వస్తే వీధిలో కూర్చోబెట్టి యింటిని కాపలా కాయమంటాను. వీధిలో తిండి పెడతాను.... తక్కువ వాడికి తిక్క తెగులొస్తే తగిన వైద్యం ఛెయ్యలేనా?"

ఇలా తిరిగి వస్తూ అనుకుని యింటికి వచ్చేసరికి ఒక వార్త కొడుకు తీసుక వచ్చాడు.

"నాన్న బార్‌లో తాగటం చూసాడట!"

"ఎవరు చూసారురా?"

"మా క్లాసు అబ్బాయి నాన్నగారు."

"మీ క్లాసు అబ్బాయి నాన్నగారు తాగుతారా?"

"నాకు తెలీదు."

"ఏ బార్‌లో చూసారో అడిగావా?"

"లేదు."

"ఆ మొద్దు ముఖమే నీదనీ" కాస్సేపాగి "మీ క్లాసు అబ్బాయి యిల్లు తెలుసా?"

"తెలీదు."

"ఉష్! తెలీదని నా ప్రాణం తీసేస్తున్నావురా!"

"రేపు కనుక్కుంటానులే....."

"వాడు యెల్లుండిక్కానీ కబురు తేలేడు ఈలోగా అంతా వెచ్చబెట్టి యే కాలవలోనో దొర్లుతుంటాడు. రేపు స్కూలు నించి వాళ్ల యింటికి వెళ్లి యే బార్‌లో యెప్పుడు చూసాడో యెన్నిసార్లు చూసాడో అంతా వివరంగా కనుక్కురా."

"నివ్వొ రాకూడదూ?"

"ఏ ముఖం పెట్టుకుని వెళ్లమంటావురా?"

"ఏం? నివ్వు తాగలేదుగా!"

"మీ నాన్న యిలాంటి తగువులు పెట్టి తంతూ వుంటే... అతగాడ్ని కొలువున పెట్టి కొలచడం నాకు చాతగాదు. ఈ పంతం యేమిటో నేనూ చూస్తాను. నేను చెప్పినట్లు చెయ్యి." అని చివరకు కసిరేసింది

మరుచటి రోజు యింట్లో మరింత మురికి చేరింది తను యిలా కొట్టాడుతోందే గానీ, యితన్ని యింట్లో పెట్టుకుని యింత వరకూ తెచ్చిన తండ్రి వుదాసీనంగా వుండటం సహించలేక.

"ఒకసారి వూర్లో తిరిగి అతని చెవి పట్టుకుని యీడ్చి రావాలని అనిపించలేదా?"

"ఈ యెండలో నేనెక్కడ తిరగ్గలను? పోలీసు రిపోర్టు యిచ్చేస్తాను ఇంట్లో యేదైనా ఫోటో వుందా?"

"పోలీసు రిపోర్టు-పేపర్లో వెయ్యడం. ఫలానవాడి కొడుకు అనడానికి వాళ్లకు వూరాపేరా? ఉన్నారా చచ్చారా? ఫలాన వారి అల్లుడే అంటారు అంచేత మీరు వెతక లేకపోతే మనవాళ్ల నెవరికైనా బెత్తాయించండి "

"ఊర్లోనే వుంటే వెతకడం దేనికి?"

'అయితే మీరే యీ నాటకం ఆడిస్తున్నారా?"

"నివ్వేమిటి మాటాడుతున్నావో ఆలోచించే మాటాడుతున్నావా? ఊరంతా తెలిసిపోయింది ఇంట్లో నించి అల్లుడు పారిపోయాడని. చుట్టాలు మనిషోలా అనుకుంటున్నారు ఈ సిగ్గుతో నేను ఇల్లు కదలలేను. ఏం చెయ్యాలని తోస్తే అదే చెయ్యి. తాళాలన్నీ నీ దగ్గిరే వున్నాయ్ " అని అక్కడి నించి యింకో గదిలోనికి సదాశివరావు వెళ్లిపోయాడు

ఇన్నాళ్లూ ఆ గొంతు ధాటితో మొగుడి మీద దాడి చేసేది అతను లేకపోవటంతో ఆ ఆపలేని ధాటి యింకెవరి మీద ప్రయోగించలేక తండ్రి మీద ప్రయోగించగానే యింత పెద్ద సమాధానం వచ్చింది నోరు కట్టుకోడానికి ప్రయత్నిస్తుంటే ఆ కోపాగ్ని మనసును దహించి వేస్తోంది. తన అపురూపమైన అందానికి యీ సంఘటన ఒక మహమ్మారిలా వచ్చి మచ్చలను వదిలి వెళ్లినట్లనిపిస్తోంది. శాసించడమే అలవాటుపడ్డ జీవితంలో ఒక్కసారి ఒడుదుడుకులు వచ్చి శాసనాన్ని శిరసావహించి తల ఒగ్గినట్లు అనిపిస్తోంది

రెండో రోజు కొడుకు వార్త తీసుక వచ్చాడు. ఫలాన చోట నున్న బార్‌లో పదిహేను రోజుల క్రితం చూసాడట

"హమ్మయ్య – పదిహేను రోజుల క్రితమా? మొన్న కాదు కదా!"

"మొన్న కాదట!"

"అయితే డబ్బు అతని దగ్గరే వుంటుంది."

"అప్పులు చేసి తాగకూడదా?"

అసలు యితను యీ త్రాగుడు యెప్పుడు నేర్చాడు? ఇతగాడికి డబ్బెక్కడిది? ఇంతే జీతమని అంతా నా చేతపెట్టేవాడు, ఎవడో ఆ రోజుకే పట్టించి వుంటాడు ఒకసారి వెళ్ళి ఆ షాపు వాడిని కనుక్కుంటావా?"

"నివ్వూ రా ..."

"సరే! పద అసలు సంగతి తెలుస్తుంది "

ఇద్దరూ కలిసి ఆటో లో అంత దూరం వెళ్ళారు. ఆ బార్‌లో దూరుతుంటే యెదరగా నున్న బస్సు స్టాపులో వాళ్ళు వింతగా వాళ్ళ వేపే చూస్తున్నారు అందులో వాళ్ళ చుట్టాలిద్దరున్నారు వాళ్ళను చూసినా చూడనట్టు ముఖం త్రిప్పి లోపలకు వెళ్ళింది పావని

"గోపాలం యిక్కడ తాగేవాడా?"

"ఎవరు మీరు?"

"వాళ్ళ అబ్బాయిని" అన్నాడు కొడుకు

"అవును తాగేవారు తాగి అచ్చంగా ఘంటసాలలా 'జగమేమాయ' పాడేవాడు '

"మీ కెంత డబ్బు బాకీ పడ్డాడు?" అడిగింది ఆమె

"అతను పెద్దమనిషి డబ్బు ముందుగా యిచ్చి మరీ తాగేవాడు."

"హెచ్చు తాగేవాడా? తక్కువ?

"మోతాదుగానే తాగేవాడు కానీ ఆ మధ్య ఒక రోజు తెగ తాగేసి తూలుతూ వెళ్ళిపోయాడు "

"నాలుగు రోజుల క్రితమా?"

"కాదు రెండు వారాల క్రితం

"అయితే యీ నాలుగు రోజుల్లో వచ్చి తాగలేదా?"

"ఆ వేళ నించి మరి రాలేదు అతను రాకపోవడం మాకెంతో వెలితిగా వుంది అతను పాడగా మళ్ళీ వినాలని వుంది ఎక్కడున్నారో కాస్త చెప్తారా?"

"వెతకండి ఎక్కడో పాడుతూ దొర్లుతూంటాడు

# బానిస బ్రతుకులు

అని ఖస్సుమని పావని బయటకు వచ్చేసింది ఆటో లో తిరిగి వస్తుండగా "నాన్నకు తాగుడు అలవాటు యిదివరకే వుందన్న మాట! నివ్వు

పోల్చుకోలేదా అమ్మా?' అని కొడుకు అడిగితే – "తాగిన కబుర్లు నా యెదరగా యెప్పుడైనా ఆడితే కదా పోల్చుకోడానికి! ఆ నవ్వులో అంత విషం – ఆ గుండెలో అంత దాపరికం వుందని యెన్నడూ అనుకోలేదు " అని ముఖం తిప్పేసింది

* * * * *

కూతురు ఉమ ఒక కబురు తెచ్చింది "అదే గిరల షర్టు ఆ నీలి పేంటుతో కనిపిస్తే నాన్న అనుకుని ముందుకు వెళ్ళాను అతని ముఖం చూస్తే కళ్ళద్దాలున్నాయి గానీ నాన్న కాదు "

"మరెవరు?" అంది తల్లి

"నాన్నకు సర్దార్జీలా గెడ్డం యెక్కడుంది?"

"మారువేషాలతో కూడా తిరుగుతున్నాడన్న మాట! తిరగనీ యెన్నాళ్ళు తిరుగుతాడో? ఈ పనులన్నీ చెయ్యడానికి యెవడినో ఒకడ్ని పెట్టుకుంటాలే!'

నీకేనా పౌరుషం? నేను పౌరుషంతో నే పుట్టాను పౌరుషంతో నే బతుకుతాను అన్నట్టు పావని యింట్లో గోపాలంని పిల్లలు తలచుకోకుండా చేస్తోంది

ఇంతలో ఒక విశేషం జరిగింది పావని మేటనీ సినిమాకు వెళ్ళింది. ఆట పూర్తి కాక ముందు ఒకసారి తల త్రిప్పి చూస్తే పైన బాల్కనీలో చూచాయగా మొగుడి ముఖం కనిపించింది వెంటనే బాల్కనీకి పరుగెత్తేదే ఇంతలో మంచి ప్రేమఘట్టం తెర మీద కుప్పిగంతులతో కూనిరాగాలతో ఆడుతుంటే అటువేపే ధ్యానం మళ్ళింది ఆట పూర్తయిన వెంటనే నలుగురి మధ్య చెప్పు తీసి కొట్టినట్టు అడుగుతాను పెద్ద కబుర్లాడితే చెప్పే విసిరేస్తాను. ప్రేమ ఘట్టం ముద్దుల మినహా అన్నిరకాల ఆవేశాలతో వుషారెక్కించి కొందరిచే విజిల్సు కొట్టించేసాయి. తిరిగి మళ్ళీ చూస్తే ఆ జాగాలో యెవరో ఆడది గోపాలం లేడు రూపురేఖలు గుర్తు పట్టలేని వెలుగులో చీర కట్టుకున్న విగ్రహం కనపడింది ఇంకో రసవత్తర ఘట్టం గుబాళింపు తెరపై పడగానే మళ్ళీ అటువైపు కళ్ళు మళ్ళినా మనసు మళ్ళలేదు వెనుతిరిగి చూస్తే పైన గోపాలం లేడూ ఆ ఆడదీ లేదు బయటకు చప్పున వచ్చేసరికి ఆటో కదిలిపోతోంది గోపాలం ప్రక్కన ఒక ఆడది కూర్చుంది. ఆమె తన అసూయ నిండిన కళ్ళకు కూడా వెగటుగా కనపడలేదు అమె పయ్యెద మీద వంగి పవ్వళించిన సామిలా మొగుడు ఆమెను పట్టుకుని కూర్చున్నాడు. పావనికి రెప్ప పడలేదు కాళ్ళు కదల్లేదు అయ్యోయ్యో అనలేదు కుయ్యో మొర్రో మనలేదు ఇంటి కొచ్చాక అంతవరకు రాజుకున్న కోపంతో

'మా చేతనైనట్టు – ఆడదాన్ని కిరాయికి తీసుకున్నాడు అది వీడి నరాల సత్తువ చూసి పకపక నవ్వి తలుపు ధడాలున వెయ్యదా? ఆ గుమ్మంలో పాడుతూ కూర్చుంటే దానికి ధమ పుట్టుందా? ఇతగాడి యెదరగా యింకొకడి ఒడిలో వాలుతుంది. అప్పుడు పీక పిసు క్కుంటాడా? కట్టుకున్న పెళ్ళాం కాదు ఓర్చడానికి? లో కానికి జడిసి భరించడానికి!"

ఇన్ని మాటల్లో కొన్నే బయటకు అనగలిగింది మరికొన్ని లో లో నే అనుకుంది ఇందులో ఒకటో ఆరో యింట్లో వున్న తండ్రికి వినిపించాయి కానీ అతనికేమీ అర్థం కాలేదు అవసరమైతేనే మాట్లాడే ధోరణిలో యీమధ్య అతను పడ్డాడు అడిగితే అవమానంగా కూతురు మాటాడుతుందేమోనన్న భయంతో వూరుకున్నాడు

(ఇంకా ఉంది)






సీరియల్

# జీవితం చేజారిందా?

కాకాని కమల




(గత సంచిక తరువాయి),

ఆ రాత్రి మళ్ళీ సీతకి కాళ రాత్రే అయ్యింది పడుకుంటే నిద్రపట్టలేదు

వుడికిపోయిన వంకాయలా నల్లగా కాలి వికృతంగా మారిపోయిన స్నేహితురాలి రూపమే కళ్ళ ముందు కదులుతూంది.

నిజంగా ఆ శివప్రసాదు ఎంత శాడిస్ట్? కాకపోతే కేవలం వెధవ డబ్బు కోసం తనని అమాయకంగా నమ్మి వచ్చిన భార్యని అంత క్రూరంగా హింసిస్తాడా?

ఛ ఏం మగాళ్ళు?

పొరపాట్న వేడి గిన్నె చురికితేనే వ్రేళ్ళు క్షణాల్లో బుస బుసా వుబ్బి భరించలేనంత మంట పుడుతుందే అలాంటిది ఒళ్ళంతా కిరసనాయిల్ మంటల్తో తగలబడిపోతుంటే ఎంత నరకం? ఆ బాధ భరించటం ఎంత కష్టం?

ఆ శివప్రసాద్‌లాంటి మగవాళ్ళతో పోల్చుకుంటే తనని చేసుకోబోయే ఈ ప్రభాకర్ కాస్త నయంగానే అనిపిస్తున్నాడు

తననుంచి వరకట్నంగా డబ్బు ఆశించటంలేదు

మనసులో ఒకటి పెట్టుకుని పైకి ఒకటి నటించటంలేదు

నిజాయితీగా తన అభిప్రాయం చెప్పాడు అలాంటి వ్యక్తిని తిరస్కరించడం తన అవివేకమే అవుతుందేమో

పైగా తనపుట్టింటి వారికి ఎంతో క్షోభ ఇతన్ని కాదన్నంత మాత్రాన తనకి ఒరిగేదిలేదు వేలకి వేలు కట్నం ఇచ్చి తన తండ్రి పెళ్ళి చెయ్యలేడు

అలాగని తను జీవితాంతం పెళ్ళి కాకుండా వుండిపోతానన్నా తన వాళ్ళు వూరుకుంటారా? లోకం వూరుకుంటుందా?

తల తాకట్టు పెట్టి అయినా ఎవర్నో ఒకర్ని చూసి ముడిపెడతారు.

అది మాత్రం ఏం లాభం? సమస్యలు రావని నమ్మకం ఏమిటి? ఇప్పటికే విశాలక్కని తల్చుకుని అమ్మ నిత్యం కుమిలిపోతూంది. దానికితోడు తను ఈ పెళ్ళి తిరస్కరిస్తే ఆవిడ పూర్తిగా మంచం పడుతుంది. అయినా తను మాత్రం కన్నవాళ్ళకి ఇంకా ఎంత కాలం అని భారంగా వుండగలదు? భగవంతుడు ఏదో ఒక మార్గం చూపుతున్నాడు. ఆ మార్గం వెంట పోవడం ఉత్తమం కదా? ఆ తల్లి లేని పసివాళ్ళకి తను మాతృ ప్రేమ చూపిస్తే, వాళ్ళు తనని అనురాగంతో అల్లుకుంటే కొంతైనా తన జీవితం సార్థకత కాదా?" అనుకుంది స్థిరంగా.

ఆంధ్రదేశంలోని మధ్యతరగతి ఆడపిల్ల సీత

సర్దుకుపోవటం స్త్రీకి వెన్నతో పెట్టిన విద్య!

నాటి నుంచి నేటి దాకా నూటికి తొంభై శాతం స్త్రీలు ఏదో ఒక విషయంలో సర్దుకు పోతూనే బ్రతుకుతున్నారంటే అతిశయోక్తి కాదు "స్త్రీ" సర్దుకుపోక పోతే, సంసారం నరకప్రాయం అవుతుంది.!

* * * * *

... ఈ ఆధునిక యుగంలో కూడా .. అసలు ఆడపిల్ల ఎంత అందంగా వున్నా. ఎంత చదివి ఉద్యోగం చేసినా "పెళ్ళి" దగ్గరకి వచ్చేసరికి ఆమె అనర్హత బయటపడటం ఏమిటి? "వరకట్నం" సమస్య కావటం ఏమిటి? -

స్త్రీ పురుషులు సమానులేనని, వారి మధ్య ఎట్టి వివక్షత పాటించరాదని భారత రాజ్యాంగ చట్టం పదిహేనవ (15) నిబంధన నిర్దేశిస్తూంది. సమాన న్యాయం, సమాన అవకాశాలు, సమాన రక్షణ కల్పించాలని పధ్నాల్గవ (14) నిబంధనలో వుంది మరి ...

రాజ్యాంగ చట్టంలో వున్న ఈ స్త్రీపురుష సమాన హక్కులు వాస్తవ జీవితంలో వున్నవా?

లేవు.

అంటే-

ప్రభుత్వం చేసే అనేక చట్టాలు కాగితంపై వున్నట్టే ఈ సమానత్వం కూడా కాగితం మీదే వున్నదని చెప్పక తప్పదు.

అసలు ...

ఈ చట్టాలన్నీ మగవాళ్ళు చేశారు. అందుకే ఇలా ఏడుస్తున్నాయి. ఆడవాళ్ళు చేస్తే ఇలా ఉండేవి కాదు. పైగా రాజ్యాంగ యంత్రంలో పురుషాధిపత్యమే ఎక్కువ!

"స్త్రీ" పురోభివృద్ధిని మనసా వాచా కాంక్షించకుండా కేవలం "ఐ - వాష్" కోసం చేసిన ఈ చట్టాలన్నీ "పేపర్ టైగర్స్".

అందుకే రాజ్యాంగ చట్టంలో వున్న నిబంధనలు ఏవి నిజ జీవితంలో స్త్రీకి వుపయోగపడటంలేదు.

ఒక నిస్సహాయురాలు, అబల అయిన స్త్రీకి న్యాయం చెయ్యలేని చట్టం, స్త్రీకి రక్షణ కల్పించలేని సంఘం .. ఎందుకు?

**జరిగిన కథ-4:** ఆ రోజు సీతను చూసుకోవడానికి పెళ్ళివారు వస్తున్నారని విశ్వేశ్వరయ్య ఆఫీసుకి మధ్యాహ్నం శెలవు పెట్టి వచ్చి సుభద్రమ్మతో చెపుతాడు. వరుడు ప్రభాకర్ మొదటి భార్యకి ఇద్దరు పిల్లలు ఉన్నారు సీత అందరికి నచ్చింది ప్రభాకర్ తను తన పిల్లల కోసమే ఈ పెళ్ళి చేసుకుంటున్నానని, భర్తగా సీతకు న్యాయం చేకూర్చలేనేమోనని సీతతో చెపుతాడు. సీత ఏమైనా సరే ఈ పెళ్ళి చేసుకోనని ఇంట్లో చెప్పాలని నిర్ణయించుకుంటుంది. రాధిక 'మరణంతో అందరి' మనసులు పాడైపోయ్యాయి సీతకి మనసంతా కెలికినట్లయింది.



పుట్టింది ఆడపిల్లా - మగపిల్లవాడా? అని అడగటానికి బదులు -

"ప్లస్సా, మైనస్సా" అని అడుగుతున్నారు.

"మైనస్" అంటే ఆడపిల్ల (కుటుంబ ఆస్తిని మైనస్ చేసి వేరే ఇంటికి పట్టుకుని పొయ్యేది.)

"ప్లస్" అంటే మగపిల్లవాడు (కుటుంబ ఆస్తిని పెంచేవాడు.)

అంటే -

స్త్రీకి ఇంకా సమానత్వం దొరకలేదని, ఆమె (పురుషుడు కంటే తక్కువగా) హీనంగా చూడబడుతూందని అనటానికి పునాదిరాయి ఇక్కడే (ప్లస్ మైనస్‌ల దగ్గరే) మొదలవుతుంది.

వరకట్నాలను నిషేదిస్తూ 1955 లో నే రాష్ట్రప్రభుత్వం చట్టం చేసింది.

కాని ఈ చట్టం నిరర్థకంగా మిగిలిపోయింది.

దీనికి ముఖ్య కారణం ప్రస్తుతం వున్న వరకట్న నిషేధ చట్టంలో, ముఖ్యమైన లోపం వరకట్నం తీసుకోవటం "శిక్షార్హమైన నేరం"కాదు. (కాగ్నయిజిబుల్ అఫెన్స్.).

వరకట్నం ఇవ్వచ్చు. తీసుకోవచ్చు.

కాని -

ఎవరైనా కట్నం తీసుకుంటున్నట్టు ఫిర్యాదు చేస్తేనే దానిని కోర్టు విచారిస్తుంది

చట్టంలో ఈ లోపం కారణంగానే సంతలో పశువుల్లా వరులు వేలమీద లక్షల మీద అమ్ముడుపోతున్నారు

కాబట్టి -

అసలు వరకట్నం తీసుకోడం నేరం కింద చట్టం సవరించాలి.

"వేశ్యలకి పైకమే పతి. చాలామంది యువకులకి కట్నమే భార్య. "వెల" నిర్ణయించి తీసుకోవడం వల్ల వేశ్యని వెలయాలన్నప్పుడు, కట్నాలు తీసుకునే వారు "వెల మగలు" ఎందుకు కారు?" అంటాడు "కాళ్ళకూరి"

ఆడపిల్ల బాధ్యత పెళ్ళి పేరుతో అవతల వ్యక్తి (అల్లుడు) జీవితాంతం భరిస్తున్నందుకు అచ్చటకో - ముచ్చటకో వరకట్నం ఇవ్వచ్చు.

కాని -

ఆ కట్నం తక్కువైందని, లాంఛనాలు చాలలేదని, కొత్త కోడల్ని హత్య చేసి, ఆత్మహత్యగా నిరూపించడం అమానుషం.

మనసు - మానవత్వం అన్న పదాలకే కళంకం.

నేటి ఈ ఇరయ్యవ శతాబ్దంలో స్త్రీ ముఖ్యమైన సమస్య డౌరీ డెత్ - బ్రైడ్ బర్నింగ్స్ -!

ఉన్నత విద్యావంతులు, పెద్ద పెద్ద నగరాల్లో కూడా ఈ బ్రైడ్ బర్నింగ్స్ ఎక్కువ అయిపొయ్యాయి

తమ కోడలు వంట చేస్తూ కిరసనాయిల్ స్టవ్ అంటుకునో, గ్యాస్ అంటుకొనో చనిపోయినట్టు అత్తలు స్టేట్‌మెంట్లు ఇస్తున్నారు. ఈ స్టేట్‌మెంట్లలో కూడా గొప్ప" లిటిగేషన్" ఉంది.

ఇటీవల పంజాబ్ ప్రభుత్వం రాష్ట్రంలో - కోడళ్ళే కిరసనాయిల్ స్టవ్‌లు, వంట పొయ్యిలు అంటుకుని ఎందుకు చనిపోతున్నారు?, అటువంటి ప్రమాదాల్లో అత్తగార్లు ఎందుకు చనిపోవటంలేదో విచారించాలని, ఇటువంటి ప్రమాదాల్లో మరణించినట్లు చెప్పబడ్డ యువతి ఉదంతం ఆమూలాగ్రం విచారణ జరిపి తీరాలని ఉత్తర్వులు జారీచేసింది.

కోడళ్ళని హత్యచేసి ఆత్మహత్యగా నిరూపించటంతో పంజాబ్ ప్రభుత్వం ఈ విధంగా ఉత్తర్వు చేసింది.

ఈ ఉత్తర్వు ఎంతో సమంజసం అయినది.

పోనీ - కోడళ్ళు ఇంటి వంట పని చేస్తారని అందుకని వాళ్ళే చనిపోతున్నారని చెప్పినా నేరమే.

ఎందుకంటే -

... అత్త పొరపాట్న కూడా వంట గదిలోకి రాకుండా ఇంటి చాకిరి అంతా కోడలు మీద రుద్దటం కూడా తప్పు. (ఇది ఒక రకంగా వెట్టిచాకిరి, కట్టు బానిసత్వం కిందకి వస్తుంది.).

# జీవితం చేజారిందా

కాబట్టి ఏ విధంగా చూసినా అత్తని అరెస్ట్ చెయ్యాలి.

గుజరాత్‌లో కూడా ఇలాంటి అత్యాచారాలు ఎక్కువే!

వీటన్నింటి దృష్ట్యా లెక్కలు తీస్తే తేలే విషయం ఏమిటంటే -

ముందు స్త్రీలకి సాంఘిక భద్రత కావాలి. (అంటే ఈ రేపింగ్స్, కిడ్నాపింగ్స్, షౌరి డెత్‌లు పోవాలి.)

ఆ తరువాత సమానత్వం అదే వస్తుంది.

"చట్టం" చేయగానే సరికాదు.

అవన్ని అమలు జరిగేలా చూడటం ప్రజలది, ప్రభుత్వానిది బాధ్యత లేకపోతే ఈ చట్టాలన్ని "కాగితం పులులు" (పేపర్ టైగర్స్) గానే మిగిలిపోతాయి.

ఆ పులులకి ఆహారంగా ఎందరో అబలలు "బలి" అవుతూనే వుంటారు

కాబట్టి -

చట్టాలు ఎలా అమలు జరుగుతున్నాయి? రాష్ట్ర వ్యాప్తంగా స్త్రీల సాంఘికాభివృద్ధికి భద్రతకి తేబడిన చట్టాలు, ఇంకా అవసరమైన సవరణలు చేయడం, ఖచ్చితంగా అమలు జరపటం ప్రభుత్వం బాధ్యత.

చట్టాన్ని ఉల్లంఘించిన వారిని నిర్దాక్షిణ్యంగా శిక్షించటం ప్రభుత్వం కర్తవ్యం.

అందుకే –

"ఆలిని చూలాలు చేయ
పోతు కట్న మివ్వాలని
మూడు ముళ్ళ జాతరలో
ఆడది అమ్ముడు పోయిన
తోడేళ్ళను రోడ్డు కీడ్చి
మాడు పగుల కొట్టలేని
ఈ కులాలు ఎందుకు?
ఈ మతాలు ఎందుకు?
ఈ సమాజ మెందుకు?" అంటున్నాడు ఓ కవి!

సహనానికి, త్యాగానికి, ఓర్పుకి స్త్రీ మారు రూపం సముద్రం చెలియలి కట్ట దాటి రాదు. వస్తే ప్రమాదం. కాని దానిలో ఆటు పోటు ఎక్కువయిన నాడు చెలియలి కట్టల్ని ఛేదించుకొని వెల్లువలా విరుచుకు పడుతుంది.

"నా దేశంలో స్త్రీ వుడుకెత్తని అగ్నిపర్వతం
పెదాలు బిగపట్టినా పిడికిళ్ళెత్తని మహాశక్తి" అని హెచ్చరిస్తున్నాడు మరో కవి.




స్త్రీలపై ఈ అరాచకం ఇలాగే పెచ్చు పెరిగితే ఏదో ఒకనాడు ఆ అగ్ని పర్వతం పగులుతుంది. ఆ మహాశక్తి పిడికిళ్ళు తెరుస్తుంది.

ఆ రోజు రాకముందే "ఆడపడచుల" కన్నీళ్ళు తుడవటానికి "అన్న"లు నడుం కట్టాలి.

* * * *

ఎవరు ఎలా వున్నా– ఏది ఎటు పోయినా కాలం ఆగదు.

గాయాలని మాన్పేమందులా దాని మానాన అది నిశ్శబ్దంగా సాగిపోతూనే వుంటుంది.

కన్నుమూసి తెరిచినట్టు నెల రోజులు గిర్రున తిరిగి పొయ్యాయి. ఆ వీధిలో "రాధిక" మరణం క్రమంగా మరుగున పడింది.

సీత పెళ్ళి దగ్గరకి వచ్చింది.

ఈ మధ్యలో ఒక రోజు వరలక్ష్మి, రఘునాధయ్య వచ్చి లాంఛనంగా సీతకి పూలు– పళ్ళు పెట్టి ప్రధానం జరిపించారు.

ఆ రోజు అక్కడే భోజనం చేసి ఓ పూట గడిపి వాళ్ళు వెళ్ళి పొయ్యారు.

ఆ కాస్సేపు వరలక్ష్మమ్మ సీతని చాలా ఆదరించింది ఆమె దగ్గిర్నుంచి కదల లేదు.

సీతకి ఒక మంచి పట్టు చీర, రాళ్ళ నెక్‌లెస్, కాళ్ళకి వెండి మువ్వల పట్టీలు బహూకరించింది

"ఒదినగారూ! మేం పేదవాళ్ళం. మీ వంటి వారికి ఘనంగా మర్యాదలు చెయ్యలేని అసమర్ధులం. మన్నించండి." అంది కన్నులు చెమరుస్తుంటే సుభద్రమ్మ వియ్యపురాలి రెండు చేతులు పట్టుకుని.

"మీరు ఒక్కనాటికి అలా అనుకోకండి. సీత నా కోడలు కావటమే నాకు లక్షల విలువ మాకు కావల్సింది డబ్బు కాదు. మా ఇంటిని వెలిగించ వలసిన రాగమయి" అంది తృప్తిగా చిరునవ్వుతో వరలక్ష్మమ్మ.

కంటికి నిండుగా నిర్మలంగా అణకువగా వున్న సీతని చూస్తుంటే ఆవిడకి ఎంతో ముచ్చటగా వుంది. కొడుకు కస్సు బుస్సు మన్నా ఓర్పుగా సర్దుకుపోయి చక్కగా సంసారం చేసుకో గలదు అన్న నమ్మకం కుదిరింది.

. .. సీత పేద యింటి అమ్మాయి కష్ట సుఖాలు తెల్సిన పిల్ల సౌమ్యంగా వుంది. కాబట్టి సవతి పిల్లలు అన్న బేధ భావం లేకుండా తల్లిలేని ఆ పసి పిల్లల్ని చేరదీసి లాలించగల మంచి మనసు ఆ అమ్మాయిదని మొదటి చూపులో నే గ్రహించుకుంది ఆవిడ.

అంత ధనం వున్నా కొంచెం కూడా గర్వం లేకుండా ఆ వున్న కాస్సేపు ఆ ఇంట్లో అందరితో కల్సిపోయింది వరలక్ష్మమ్మ.

ఆ రోజంత అక్కడే గడిపి భోజనాలు చేసి భార్య భర్త కారులో వెళ్ళిపొయ్యారు.

ఇంటిల్లిపాది వుత్సాహంతో ఎంతో ఆనందంగా వున్నారు.

కాని సీత మనస్ఫూర్తిగా ఆ ఆనందంలో పాలు పంచుకోలేక పోయింది.

"తన కాబోయే భర్తకి తనపై ప్రేమ లేదు. అసలు అతడు తనని ప్రేమించ లేదు." ఈ ఆలోచన సీతని స్తబ్ధురాల్ని చేస్తూంది.

అయినా తన అదృష్టాన్ని పరీక్షకి పెట్టటానికే నిశ్చయించుకుంది.

సుభద్రమ్మ ఒక మంచి రోజు చూసి "విఘ్నేశ్వరుడికి" బియ్యం పోసింది.

* * * *

ప్రభాకర్ వయసు ఇరవై ఎనిమిది సంవత్సరాలు. అతడు చదువుకొనే రోజుల్లోనే "సంధ్య" అనే అమ్మాయిని గాఢంగా ప్రేమించాడు.

ఆ వ్యామోహంలో తెలిసి తెలియని వయసు తొందరలో తప్పు చేశాడు.

తత్ఫలితంగా సంధ్యకి నెల జరిగింది.

ఆ పరిస్థితిల్లో చదువు పూర్తి కాకుండానే వారి పెళ్ళి జరిగింది.

సంధ్య కూడా ధనవంతుల అమ్మాయి.

అన్నింటిని మించి ప్రభాకర్ హృదయాన్ని అమితంగా చూరగొన్న ముద్దరాలు.

పిండితే పాలు కారేలాంటి ఆమె అందం, గులాబీ రేకుల వంటి మెత్తని రాగసు, ఇప్పటికీ అతడ్ని తలపు మాత్రానికే అతడ్ని ఉన్మత్తుడ్ని చేస్తాయి.

కాలేజి ఎగ్గొట్టి ఆమెతో సినిమాలు, షికార్లు, పిక్‌నిక్‌లు ఎంజాయ్ చేసే

# నెస్టమ్ బేబి సిరియల్
# ప్రారంభించేందుకు ఆదర్శప్రాయమైనది
# పెరుగుదలకు ఆదర్శప్రాయమైనది

**నెస్టమ్, పాలు-పూర్తి పోషక విలువలున్న ఆహారం.**

మీ బాబు, సుమారు 4 నెల్లవాడయేసరికి, కావాలి పాలతోపాటు ఘనఆహారం. పాపాయికి తేలిగ్గా జీర్ణమయేటు, ప్రత్యేక శ్రద్ధతో తయారయిన-నెస్టమ్ బేబి సిరియల్ ని పెట్టడం ప్రారంభించండి. ముందుగా మరిగించిపెట్టిన గోరువెచ్చటి పాలతో కలపండి. ఇక, పూర్తి పోషక విలువలున్న ఆహారం సిద్ధమవుతుంది.

పాపాయి ఆరోగ్యంగా, చలాకీగా పెరిగేందుకు తోడ్పడుతుంది.

**నెస్టమ్‌తో వివిధవంటలు-పాపా ఆహారంలో బోలెడన్ని రకాలు**

మీపాపాయి ఎదుగుతున్న కొద్దీ కొత్త రకాల రుచి చూపించండి.

ఉడికించిన కూరముక్కలూ, పండ ముక్కలు పప్పు-వీటిని నెస్టమ్‌తో కలిపి పెట్టండి. బా కుటుంబంలో నివారు తినే ఆహారాన్ని తీసుక నేర్చుకునేందుకు ఇది తోడ్పడుతుంది.

**నెస్టమ్®**
**రైస్**

**ఇనుము-విటమిన్లతో కూడి పాలలో కలపండి.**




**ఉచితం**
మీ బాబు, తన ఆహారంలో, కొత్త రుచులను కోరుతాడు అందుకని-మీ ఉచిత నెస్టమ్ వంటల పుస్తకం కోసం రాయండి.
నెస్టమ్
పోస్ట్ బాక్స్ నెం. 6016, న్యూ ఢిల్లీ-110008.



# జీవితం చేజారిందా

వాడు

గెస్ట్‌హవుస్‌లో రూమ్‌లు బుక్ చేసుకునే వారు

ఆమె ఒడిలో తల పెట్టుకుని పడుకొని గారాలు పొయ్యేవాడు

రెండు చేతుల మధ్య ఆమెని బంధించి గాఢంగా ఆమె చెక్కిళ్ళపై పెదవులు అద్దేవాడు.

"సంధ్యా! నీకేం కావాలి చెప్పు?"

"ఏమీ ఒద్దు!"

"అలా కాదు ఏదైనా సరే అడుగు సంధ్యా!"

"నీ మనసు– తనువు అన్ని నావేకదా? ఇంకేం అడగను చెప్పు? నీ హృదయం నాది కాదంటే చెప్పు అడుగుతాను "

'నువ్వు అడిగినా ఇవ్వటానికి నా హృదయం నా దగ్గ రెక్కడుంది? ఎప్పుడో నీకు ఇచ్చేశాను కదా? అందుకే హృదయం లేని పిచ్చివాడిలా అనుక్షణం నీ వెంట పడి తిరుగు తున్నాను! .."

వెన్నెల విరిసినట్టు తియ్యగా నవ్వింది సంధ్య

అతని బుగ్గమీద వ్రేలితో రాస్తూ అంది –

'మనం ఇద్దరం పిచ్చి వాళ్ళం ప్రేమ పిచ్చి వాళ్ళం. నా మనసు నీ దగ్గర, నీ మనసు నా దగ్గర అందుకే ఒకరి వెంట ఒకరు పడుతూ కాలేజి అంతా లవ్‌బర్డ్స్ అనిపించుకుంటున్నాం కదా?"

ప్రభాకర్ అందంగా నవ్వాడు

ఆమె సుకుమారమైన చేతిని అందుకుని పెదాలకి అన్చుకున్నాడు.

"ప్రభా! ఏదైనా అడగమన్నావుగా? అడగనా?"

అడుగు!"

'నీ ప్రేమ . నాకు ఎప్పటికి ఇలాగే కావాలి మనం జీవితాంతం ఇలాగే వుండాలి మన ప్రేమ అమర ప్రేమ కావాలి. ఈ సంధ్య నీ నుంచి కోరేది ఎప్పుడూ అదే చెప్పు ఈ వరం నువ్వు నాకు ఇవ్వగలవా? . '

ప్రభాకర్ చప్పున ఆమెని గాఢాలింగనం చేసుకుని ఆమె గులాబి పెదాల మీద ముద్దు పెట్టుకున్నాడు.

"సంధ్యా! నీ మనసుని నువ్వు మాటల్లో చెప్పావ్ అంతే స్టిల్ మై డెత్ . . ఐ లవ్ యు . ఐ యామ్ మాడ్ ఆఫ్టర్ యూ ... ఒ కె?"

"ఐ టూ .. ఐటూ '

సంధ్య అతడి ఒడిలో గువ్వలా ఒదిగి పోయింది.

* * * *

అలాంటి ప్రేమ మైకంలో వాళ్ళకి కాలమె తెలిసేది కాదు

పెళ్ళి కాకుండానే తల్లి అయ్యింది సంధ్య.

ఆ పరిస్థితిలో పెళ్ళి జరిగింది.

వరలక్ష్మమ్మకి, రఘునాథ్ రావుకి సంధ్య కోడలుగా రావటం అంత నచ్చ లేదు

అయినా కొడుకు మీది ప్రేమాతిశయంతో ఆ అమ్మాయిని కోడలుగ ఆహ్వానించారు

ఆ తరువాత ఆరు నెల్లకి ప్రభాకర్ తండ్రి అయ్యాడు.

పాప "మంజుల" పుట్టిన రెండు సంవత్సరాల తరువాత "బాబు" పుట్టాడు.

ప్రభాకర్ చదువు పూర్తి చేసుకుని భాగస్వాములతో కల్సి పెద్ద "ఐరన్ ఇండస్ట్రీ" స్థాపించాడు

ఇప్పుడు అది మూడు పువ్వులు ఆరు కాయలుగ విలసిల్లి వ్యాపారం లక్షల మీద నడుస్తూంది ఏటా మంచి లాభాలని సంపాదించి పెడుతూంది

ప్రభాకర్ అగర్భ శ్రీమంతుడు

తండ్రి పెద్ద భూస్వామి

అతనికి ఏనాడు డబ్బుకి లోటు లేదు పైగా ఒక్కగా నొక్క కొడుకు కావటంతో తల్లి తండ్రి కూడా ఎంతో అపురూపంగా పెంచారు ప్రభాకర్‌ని.

అతనికి తీరని కోరిక లేదు.

ఈ లోకంలో డబ్బున్న మనిషి స్వేచ్ఛా విహంగం.

డబ్బు లేనివాడు రెక్కలు తెగిన పక్షి

ఎగరాలని వున్నా ఎగర లేడు

ప్రభాకర్‌కి అదృష్టాలన్ని కల్సి వచ్చి డబ్బుతో పాటు మంచి తెలివితేటలు, వ్యవహార జ్ఞానం కూడా అబ్బాయి అందుకే బంగారానికి పరిమళం అద్దినట్లు వుండేది అతని జీవితం

ఒక్కగా నొక్క కొడుకని తల్లితండ్రులు కూడా అల్లారు ముద్దుగా పెంచారు

కోరుకున్న అమ్మాయితో ఘనంగా పెండ్లి చేశారు.

కాని. ..

పౌర్ణమి చంద్రుడ్ని మబ్బు క్రమ్మినట్లు దురదృష్టం అతడ్ని వెక్కిరించింది.

ముద్దులు ఒలికించే పిల్లలతో పచ్చగా సాగిపోవల్సిన అతని జీవితం, యౌవ్వనం దాటక ముందే ఎడారి అయ్యింది.

భార్య సంధ్యకి రెండవ కాన్పు సమయంలో ఆరోగ్యం బాగా దెబ్బతిని బాబు పుట్టిన కొన్ని రోజులకే హఠాత్తుగా చనిపోయింది.

పూతపిందెతో నిండుగా వున్న పచ్చటి చెట్టుకి గొడ్డలి దెబ్బ తగిలినట్లు అయ్యింది.

ఎంతగానో ప్రేమించిన సంధ్య మరణం ప్రభాకర్‌ని నిలువునా కృంగదీసింది

నడి సముద్రంలో నావకి చిల్లు పడినట్లు అతనికి బ్రతుకే భారం అయ్యింది.

ఇంటికి దీపంలా వెలిగే ఇల్లాలు పోయాక మనసులేని మరబొమ్మలాగ మారి పొయ్యాడు

ఆ బాధని మర్చి పోవటానికి క్రమంగా మద్యానికి అలవాటు పడ్డాడు

అంతకు ముందు అటువంటి వ్యసనాలని భర్త దరిదాపులకి కూడా రానిచ్చేది కాదు సంధ్య

గట్టిగా శాసించేది.

కాని ఇప్పుడు అతడ్ని అదుపు చెయ్యగల శక్తి ఎవరికి వుందని?

"సంధ్య" లేదు అన్న నిజాన్ని భరించాలి అంటే అతనికి ఒక విధమైన మైకం కావాలి

"విధి" పరిహసిస్తే ఎంతటి వారూ తల వంచవలసినదే!

సంధ్యని అతడు వెర్రిగా ప్రేమించాడు.

పిచ్చిగా ఆరాధించాడు.

ఆమె మరణం అతడ్ని విచలితుడ్ని చేసింది.

బ్రతుకంత శూన్యం అనిపించింది.

కాని–

పసి మొగ్గలు లాంటి పిల్లలు కాళ్ళకి బంధనాలు అయ్యారు

ప్రభాకర్ దిక్కు తోచని వాడు అయ్యాడు.



తల్లి తండ్రి స్వగ్రామంలో దూరంగా వుంటారు. అక్కడ వాళ్ళది స్వంత వ్యవసాయం వాళ్ళు ఎట్టి పరిస్థితుల్లోనూ గ్రామం వదిలి రారు.

ప్రభాకర్ వ్యాపార రీత్యా పట్టణవాసి

కోడలు పోయాక కొద్ది కాలం మనమల్ని కనిపెట్టుకుని పట్నంలో నే వుండి పోయింది వరలక్ష్మమ్మ.

కాని, పల్లెలో భర్తని ఒక్కడ్ని ఒదిలి ఎంతకాలం అని వుండ గలదు?

అందుకే ఆరునెల్ల తరువాత అక్కడికి తిరిగి ప్రయాణం అయ్యింది

"అమ్మా! కొద్ది కాలం ... నా పిల్లలు కాస్త పెద్ద వాళ్ళు అయ్యేదాకా ఇక్కడే వుండమ్మా?" అన్నాడు దీనంగా.

కాని–

ఆవిడ ఒప్పుకోలేదు.

"అబ్బాయ్' నన్ను పదే పదే అడక్కు నాయనా నా చివరి రోజుల్లో నా జీవితం మీ నాన్న దగ్గరే గడిచి పోవాలి. మీ నాన్న ఆరోగ్యం కూడా అంత మంచిదికాదు. నీకు తెలియం దేముంది? ఎంతకాలం అని ఆయన్ని ఒదిలి వుండను? కావాలంటే మీ నాన్నని ఒప్పించు ఇద్దరం ఇక్కడే వుంటాం" అంది

కాని తండ్రిని పట్నం రప్పించటం ఎంత అసాధ్యమో అతనికి తెలియంది కాదు

తండ్రికి సెంటిమెంట్సు ఎక్కువ.

స్వంత ఊరు– ఇల్లు ఒదిలి వచ్చినా వాతావరణం గాలి మార్పు ఆయనకి అస్సలు సరిపడదు. రోగాలు తిరగబెట్టి మంచం పడతాడు

పైగా అక్కడ స్వంత వ్యవసాయం మంచి ఫలసాయం అయిన భూములు మంచి పాడి పంట

పుట్టింది మొదలు నేటిదాకా అయన జీవితం ఆ పల్లెలో ఆ గెడ్డ మీదే గడిచి పోతూంది. ఆ పంట పైరులు– ఆ నీరు, ఆ గాలి అన్ని ఆయన శరీరంలో భాగాలు అయిపొయ్యాయి. ఊరు ఊరంతా ఆయన బంధువులే

ఈ పరిస్థితుల్లో అక్కడి కొండల్ని అయినా తరలించ వచ్చేమో గాని ఆయన్ని కదల్చటం మాత్రం అసాధ్యం

ముఖ్యంగా ఆయన ఆరోగ్యం దెబ్బ తింటుంది..

ఈ పరిస్థితిల్లో తండ్రిని ఒదిలి తన స్వార్థం కోసం తల్లిని రమ్మనటానికి అతని మనసంగీకరించలేదు.

తండ్రి ఒంటరి వాడు అయిపోతాడు

ఈ వయసులో ఆయన చెయ్యి కాల్చుకోవాల్సి వస్తుంది

జీవిత చరమాంకంలోకి వచ్చాక భార్య తోడు వుంటే అదొక సంతృప్తి.

తనకి ఎలాగూ ఆ అదృష్టం లేదు. వాళ్ళని కూడా ఎందుకు విడదియ్యటం?

దిగాలు పడిపోయిన కొడుకుని చూసి వరలక్ష్మమ్మ ప్రాణం గిజగిజ మంది

"ఒరేయ్ ప్రభా! పోనీ పిల్ల లిద్దర్ని నా దగ్గర వుంచు అప్పుడప్పుడూ నువ్వు వచ్చి చూసి వెళ్ళు" అంది.

కాని ప్రభాకర్ ఒప్పుకోలేదు.

"పిల్లల్ని విడిచి నేనుండ లేనమ్మా!" అన్నాడు

ఆ మాట నిజమే.

ఒక్క రోజు వాళ్ళని చూడక పోయినా– నీటిని విడిచిన చేపలా– అతని మనసు గిజగిజ తన్నుకుంటుంది.

పిల్లల్ని విడిచి వుండగలిగితే కొంతవరకు అతని సమస్య పరిష్కారం అవుతుంది.

కాని ప్రభాకర్ ఆలోచన్లు వేరు.

"ఇక సంధ్య తనకి ఎలాగూ లేదు ఆమె ప్రతిరూపాలు అయిన పిల్లల్ని కూడా దూరం చేసుకుంటే ఇంక బ్రతుకు ఎందుకు? ఇప్పుడు పిల్లల కోసం అయినా ఇంటికి వస్తున్నాడు. కాని సంధ్య, పిల్లలు లేని ఇల్లు తనకి ఇల్లుకాదు. శ్మశానంతో సమానం.

ఊహుఁ....

అలా జరగ కూడదు.

తన పాప మంజు. బంగారు తల్లి. సంధ్యకి మారు రూపంగ అది అనుక్షణం ఈ ఇంట్లో కళ్ళ ముందే తిరగాలి హరిబాబు మరీ పసివాడు.

నడక కూడా సరిగా రాదు

తల్లి ప్రేమ వాడికి ఎలాగూ లేదు

కన్న తండ్రి తను బ్రతికి వుండి, ఇంత డబ్బు వుండి వాడ్ని అనాథని చేసి దూరం చేసుకోలేడు తన పిల్లలు ఎలాగైనా తన కళ్ళముందు వుండాలి "

ఇది అతని ఆలోచన

చివరికి ప్రభాకర్ పిల్లల పెంపకం కోసం ఆయాని పెట్టాడు

కాని ఆ విధంగా పిల్లల్ని పెంచటం ఎంత అసాధ్యమో ప్రభాకర్‌కి ఆరు నెల్లు తిరక్కుండానే తెల్సి వచ్చింది

పిల్లలు కోలుకో లేదు

సరికదా వారు తన తల్లి కోసం బెంగపడ్డారు

చిక్కి శల్యం అయిపొయ్యారు

ఎప్పుడూ పడిశం, దగ్గు, జ్వరం

పైగా తరచు ఇంట్లో విలువైన వస్తువులు పోయేవి

ఏమాత్రం అశ్రద్ధగా వున్నా ఇంట్లో ఎక్కడి వస్తువులు అక్కడ మాయం అయ్యేవి.

పిల్లల కోసం అని తెప్పించిన పాలు, పళ్ళు, బిస్కట్లు అన్నీ ఆయా ఇంటికి చేరి ఆయా పిల్లల పరం అయ్యేవి

"ఇక్కడ గడియారం వుండాలి ఏమైంది?"

". ... . ."

"అరె! నా ఉంగరం ఇప్పుడేగా ఇక్కడ పెట్టాను. ఇంతలోనే ఏమై పోయింది?" అని ప్రభాకర్ అడిగేవాడు

'ఏమో బాబయ్య! నాకేం తెల్సు. నా మీద నమ్మకం లేకపోతే చెప్పండి. పని మానేస్తాను. అంతేగాని దొంగతనం అంటగడితే మాత్రం పడం మీ అంత గొప్ప వాళ్ళం కాకపోవచ్చు గాని మేం దొంగలం, ఖూనీ కోరులం కూడా కాదు బాబుగారు! కాయకష్టం చేసుకు చెమటోడ్చి నీతిగా బ్రతికే వాళ్ళం...." అనే వారు ఆ యమ్మలు దెబ్బ లాటకి దిగుతున్నట్లు.

ప్రభాకర్‌కి తల గిర్రున తిరిగి నట్లయ్యేది

ఏం చెయ్యాలో అర్థం కాని పరిస్థితి.

అక్కడికి అయమ్మలని మార్చినా ప్రయోజనం కనిపించ లేదు.

తన సమస్యల గురించి ఎవరికి చెప్పినా వాళ్ళు పెళ్ళి చేసుకోమని సలహా చెప్పేవారే. తల్లి తండ్రి కూడా అదేపాట.

(ఇంకాఉంది)

# మూడు దశలు

చెట్లు పరచిన వెలుగునీడల్లో
రాలే ఆకుల తుంపరలో
పరుగు పెడుతున్న బాల్యం!

జీవితం తెచ్చి ఇచ్చే అవకాశాల్లో
పడి లేస్తూ పగిలే మోకాళ్లతో
వెనక్కి చూడకుండా వెళ్లే యౌవ్వనం!

కాలం కర్కశంగా మిగిలే దశలో
కాటేసే కోరికల నీడల్లో
చచ్చేదాకా మోసే బతుకు వృద్ధాప్యం!!

-నిఖిల్

# పంజాబ్‌కి తగిన వ్యక్తి రిబెయిరో

పంజాబ్‌లో తీవ్రవాదుల ఆట కట్టించటానికి జూలియో ఎఫ్. రిబెయిరోని ఆ రాష్ట్రం పోలీసు డైరెక్టర్ జనరల్‌గా నియమించారు. ఇంత వరకూ ఈయన దేశీయాంగ శాఖలో ప్రత్యేక కార్యదర్శిగా ఉన్నారు. ఢిల్లీలో నేరాలని అదుపు చెయ్యాలన్నా, గుజరాత్‌లో మతకల్లోలాలని అణచాలన్నా, పంజాబ్‌లోని తీవ్రవాదుల ఆట కట్టించాలన్నా ప్రధానమంత్రి, ఆయన సలహాదారులకి ఇప్పుడు కనిపిస్తున్న మొట్టమొదటి వ్యక్తి గతంలో బొంబాయి పోలీసు ప్రధానాధికారిగా పని చేసిన రిబెయిరో.

నేరస్తులకి, వారికి రక్షణ కల్పించే వాళ్ళకి సింహస్వప్నం రిబెయిరో. గత ఏడాది ఈయన ఢిల్లీ పోలీసు కమీషనర్‌గా వస్తున్నారనగానే రాజధానిలోని మాఫియా వర్గాలలో కలవరం బయలుదేరింది. నగరంలోని పెద్ద తలలు పోలీసు వ్యవహారాలలో జోక్యం చేసుకోవటం రిబెయిరో సహించరని వాళ్ళకి తెలుసు. ఆయన ఖ్యాతి ఆయన కన్నా ముందే ఢిల్లీ చేరుకున్నది.

ఆ రోజులలో బొంబాయిలో అనధికార నిర్మాణాలు జోరుగా సాగుతుండేవి. వాటికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆ నగరంలోని పెద్ద వారి ఆశీస్సులు ఉండేవి. రిబెయిరో వాటిని అరికట్టటానికి ప్రయత్నించినప్పుడు అది పూర్తిగా నగరపాలక సంఘానికి సంబంధించినదనీ, ఆ విషయంలో జోక్యం చేసుకోవద్దని సలహా వంటి బెదిరింపులు అందాయి. కానీ వాటిని ఆయన లక్ష్య పెట్టలేదు. ఆ నిర్మాణాలు చట్ట వ్యతిరేక కార్యకలాపాలకి ఉపయోగపడుతున్నప్పుడు తాను చర్య తీసుకోక తప్పదని గట్టిగా చెప్పారు.



పంజాబ్ పోలీసు డైరెక్టర్ జనరల్ రిబెయిరో

అదే విధంగా ఆయన ఢిల్లీలో కూడా అనధికార నిర్మాణాల పని పడతారని ఆ నగరంలోని పెద్దమనుషులు కలవరపాటు చెంది పోలీసు కమీషనర్ పదవినే రద్దు చెయ్యాలని పెద్దఎత్తున ప్రచారం లేవదీసారు. ఆ పదవి లేకపోతే రిబెయిరో ఉండరు కదా! కమీషనర్ పదవిని రద్దు చేయించటంలో వాళ్ళు విఫలమైనా ఆయనని ఆ పదవిలోకి రాకుండా చెయ్యటంలో కృతకృత్యులైనారు. కానీ అప్పటికే ఢిల్లీ చేరుకున్న ఆయనకి ఆఖరు నిమిషంలో అధికారంలో ఉన్న వారు మరో పదవిని చూపించాల్సి వచ్చింది.

దానిని గురించి ఆయన పెద్దగా పట్టించుకోలేదు. ఢిల్లీ పోలీస్ కమీషనర్ పదవే కావాలన్న పట్టుదల ఏమీ లేదు ఆయనకి. నిజానికి దానిని ఆయన అయిష్టంగానే అంగీకరించారు. "ఏం చేస్తాం? నేను ఒక సైనికుడిని. వాళ్ళెక్కడికి వెళ్ళమంటే అక్కడికి వెళ్తాను" అన్నారాయన ఒక బొంబాయి పత్రికా రచయితతో.

పోలీసు అధికారిగా అత్యంత ఉన్నత స్థానానికి చేరుకున్న ఆయన పదవీ కాలం ఇంకా ఒక సంవత్సరం మాత్రమే ఉన్నది. రిబెయిరో దైవభక్తి గల రోమన్ కాథలిక్, స్నేహపాత్రుడైన గోవన్. మంచు వంటి మెత్తని, రాయి లాంటి కఠినమైన వ్యక్తి. బొంబాయి పౌరులు ఎంతో మంది ఈయనని సమర్థుడైన, నిజాయితీ గల అధికారిగా చెప్పుకుంటారు. "ఆయన మొండి మనిషి, లౌక్యం తెలియని వ్యక్తి" అనేవారు కొద్దిమంది లేకపోలేదు. వారంతా తాము తప్పు దారిన నడుస్తూ తమ మార్గమే సరైనదని సర్దిచెప్పుకునేవాళ్ళు. చీకటి ప్రపంచానికి చక్రవర్తులైన మస్తాన్‌లు, కరీంలు, వరదాలు వంటి వారి జోక్యం వల్లనే రిబెయిరోని బొంబాయి నుంచి బయటికి పంపారని కొన్ని వర్గాలలో అనుకున్నారు. అందులో కొంత నిజం ఉండవచ్చు కానీ అంతకన్నా సరైన కారణం మరొకటి ఉన్నది. అదేమిటంటే శాంతిభద్రతలు ఎక్కడ అదుపు తప్పి పరిస్థితి చేజారి పోయేలా ఉన్నదో అక్కడికి పంపించడానికి సమర్థుడైన గట్టి పోలీసు అధికారి కోసం ప్రధానమంత్రి, ఆయన సలహాదారులు చూస్తూ ఉండటం వల్లనే రిబెయిరోని





ఏప్రిల్ 5వ తేదీన పంజాబ్‌లోని జలంధర్ జిల్లా కోర్టు ఆవరణలో తీవ్రవాదులు కాల్పులు జరిపి తప్పించిన గురిందర్‌సింగ్, సుఖ్‌దేవ్‌సింగ్, ఏప్రిల్ 3వ తేదీన అహమ్మదాబాద్‌లో పోలీసు నిర్బంధంనించి తప్పించుకున్న తీవ్రవాది హర్జిందర్‌సింగ్ (జిందా) లని పైన బొమ్మలలో చూడవచ్చు.

# వ్యక్తిగతం



మార్చి 16 న తిహార్ జైలు నించి తప్పించుకుని పారిపోయిన అంతర్జాతీయ నేరస్తుడు ఛార్లెస్ శోభరాజ్ ఏప్రిల్ 6వ తేది రాత్రి గోవాలోని ఒక రెస్టారెంట్‌లో బొంబాయి పోలీసులకి దొరికపోయాడు. శోభరాజ్‌తో పాటు ఉన్న అతని సహచరుడు, బ్రిటిష్ పౌరుడు డెవిడ్ రిచర్డ్ హాల్ కూడా పట్టుబడ్డాడు. పనాజికి సమీపంలో గల ఒక రెస్టారెంటులో శోభరాజ్, అతని మిత్రుడు పానీయాలు సేవిస్తూ ఉండగా అక్కడే వెయిటర్ల వేషాలలో ఉన్న బొంబాయి పోలీసులు వారిద్దరినీ అరెస్టు చేసారు. బొంబాయి పోలీసులు టూరిస్టులుగా గోవా వచ్చి అక్కడి ప్రభుత్వ టూరిస్టు హాస్టల్‌లో స్థానిక పోలీసులకి కూడా తెలియని విధంగా బస చేసి నాటక ఫక్కిలో ఈ అంతర్జాతీయ నేరస్తుడిని పట్టుకున్నారు. విదేశాలలోని ఎవరికో శోభరాజ్ ఫోన్ చెయ్యపోతూ ఉండగా అతన్ని అరెస్టు చేసారు. అప్పుడు అతని వద్ద ఒక పిస్తోలు ఉన్నది కానీ అతను ప్రతిఘటించకుండానే లొంగిపోయాడు. తిహార్ జైలు నించి తప్పించుకున్న తర్వాత శోభరాజ్ రాజస్థాన్, బొంబాయిల మీదుగా గోవా చేరాడు. పోలీసులని గురించి తెలుసుకునే అత్యాధునికమైన ఎలక్ట్రానిక్ పరికరాలని సేకరించాడు. ఇలా ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా చివరికి అతను పట్టుబడక తప్పలేదు. దేశ వ్యాప్తంగా పోలీసులు, గూఢచారి విభాగం వారు పన్నిన వలలో ముందు అతని సహచరులు, తద్వారా శోభరాజ్ చిక్కుకున్నారు. .. □



శోభరాజ్ ఆధ్యాత్మిక ప్రియురాలు శ్రీమతి వైశాలీ రెడ్డి ఇప్పటికీ తాము లాయర్‌తో జరిపిన సంప్రదింపులకి కట్టుబడి ఉంటామన్నారు. చేసిన తప్పుకి క్షమాపణ కోరుతూ, పశ్చాత్తాపాన్ని వ్యక్తం చేస్తూ తమకి ఉత్తరం రాస్తే ఇప్పటికైనా తాము శోభరాజ్‌ని పెళ్ళాడటానికి సిద్ధమేనని ఆమె చెప్పారు. ఛార్లెస్ పట్టుబడతాడని తమకి ముందే తెలుసని అదే జరిగిందని ఆమె అన్నారు. చట్టాన్ని, నిజాయితీని గౌరవించే తమ వ్యక్తిత్వాన్ని శోభరాజ్ అర్థం చేసుకుని క్షమాపణ చెప్పుకుంటేనే అతన్ని వివాహం చేసుకుంటామని లేకపోతే ఈ ఏడాది లోగా మరో వ్యక్తిని పెళ్ళాడి విదేశాలలో స్థిరపడదామనుకుంటున్నామని అన్నారు ఆమె. మేలో ఢిల్లీ వెళ్ళి వీలైతే శోభరాజ్‌ని కలిసి మాట్లాడాలనుకుంటున్నట్లు చెప్పారామె.... □



ఇరవై అయిదేళ్ళ స్నేహ సెంగార్ అంతర్జాతీయ నేరస్తుడు ఛార్లెస్ శోభరాజ్‌కి అత్యంత ప్రియమైన స్నేహితురాలు. ఈమె ఢిల్లీలో ఎల్. ఎల్. ఎం. మొదటి సంవత్సరం చదువుతున్నది. 1985 డిసెంబరు 31 వ తేదీ నించి శోభరాజ్ తప్పించుకునేంత వరకూ ఈమె తిహార్ జైలుని 32 సార్లు దర్శించింది. తిహార్ జైలుకి ఈమె ద్వారానే భారీ ఎత్తున డబ్బు చేరిందని పోలీసులు అన్నారు. ఈమెని మార్చి 28న అరెస్టు చేసారు. మార్చి 31 వ తేదీన ఆమె బెయిలుపై విడుదల అయింది. విదేశీ మారకద్రవ్య నిబంధనలని ఉల్లంఘించిన నేరానికి ఏప్రిల్ 3న తిరిగి అరెస్టు అయి మళ్ళీ బెయిలు మీద విడుదల చేయబడింది. శోభరాజ్ పారిపోయిన తర్వాత ఈమె కోసం కొన్న ప్రేమకానుక బంగారు చెవి రింగులు "స్నేహకు ప్రగాఢ ప్రేమతో" అన్న చీటితో సహా పోలీసుల చేతికి దొరికిపోయాయి. వాటిని పోలీసులే ఆమెకి అందజేస్తారట!.... □

బొంబాయి నుంచి బయటకి రప్పించడం జరిగింది.

రిబెయిరోని బొంబాయి నించి బయటికి రప్పించటం అన్నది మొదటిసారి కాదిది. గతంలో ఢిల్లీ సి. ఆర్. పి. డైరెక్టరేట్‌లో (1976-78) ఆయన పని చేసారు. తమకి అప్పగించిన బాధ్యతలు ఎంత కష్టతరమైనవి అయినా, సవాలు వంటివి అయినా వాటిని స్వీకరించటానికి వెనుకాడని వ్యక్తి ఆయన.

సుదీర్ఘమైన తమ విధి నిర్వహణా కాలంలో రిబెయిరో అన్నిరకాల నేరాలనీ చూసారు. దొంగ రవాణా, మట్కా, నౌకాశ్రయంలో దొంగతనాలు, దోపిడీలు, హత్యలు, దొమ్మీలు వంటి వాటిని ఎదుర్కొన్నారు. ఎప్పుడూ ఆయన కేవలం ఒక పోలీసు అధికారిగా కాకుండా అంతకు మించి ఆలోచించే వారు. నేరం ఎందుకు, ఎలా జరిగిందన్న విషయంలో లోతుకి వెళ్ళి పరిశీలించేవారు. ఆయన దాదాపు దోస్టొవిస్కీ యొక్క "క్రయిమ్ అండ్ పనిష్‌మెంట్" లోని పరిశోధకుడిలా వ్యవహరించే వారు.

రిబెయిరో నేరస్తులని లోతుగా పరిశీలిస్తారు. అలాంటివి చెయ్యటానికి వారిపై గల వొత్తిడుల ప్రభావం ఏమిటన్న దానికి ఆయన ప్రాముఖ్యాన్ని ఇస్తారు. "అన్నిటి కన్నా ఆయనకి అత్యంత విలువైనవి తమపై ప్రజలకున్న విశ్వాసం, నమ్మకం. "ప్రజలకి ఏదో ఒక చర్య తీసుకోవటమే ఇష్టంగా ఉంటుంది. విజయం సాధించినా, సాధించక పోయినా ప్రయత్న లోపం జరగటం లేదన్న విషయం వారికి తెలియాలి" అంటారాయన.

రిబెయిరో చేతల మనిషి. పంజాబ్‌కి ఇలాంటి వ్యక్తుల అవసరం ఎంతైనా ఉంది. ఆయన పంజాబ్‌కి సరి అయిన వ్యక్తి అని ఎంతో మంది అనుకుంటున్నారు. అక్కడి పరిస్థితిని ఆయన ఎలా అదుపు చెయ్యగలరన్నది వేచి చూడవలసి ఉన్నది...

(ఒ.వి)



# వినియోగదారుల విద్య - ఉద్యమము

విజ్ఞతను ఇచ్చేది విద్య. వ్యక్తి ఓటుహక్కు కలిగి ఉన్నంతమాత్రాన సమాజం ముందంజ వేయడం జరగదు. పౌరులకు రాజ్యాంగం హక్కులను ఖచ్చితంగా ఇస్తున్నప్పటికీ వాటి సాధనకు వ్యక్తి తన విజ్ఞతను ఉపయోగించుకోవాలి. విచక్షణాజ్ఞానాన్ని పెంపొందించుకోడానికి విద్య, శిక్షణ – రెండూ కావాలి. పౌరుల చైతన్యం వల్లనే– నిరంతర జాగరూకతవల్లనే ప్రజాస్వామ్య వ్యవస్థ పర్ఢిల్లుతుంది. ప్రభుత్వ విధానాలను అమలు చెయ్యడంలో ప్రజల సహకారం కావాలి.

సమాజంలోని ప్రతి ఒక్కరూ– వయోభేదం లేకుండా– వినియోగదారులే. అబాలగోపాలమూ వినియోగదారులే.

ప్రతి వినియోగదారుడు ఓటు హక్కు ఉన్న మనిషి కాకపోయినా– మౌలికంగా వినియోగదారుల సమస్యలను ఎదుర్కొంటున్నమాట నిజం. వినియోగదారులు తమ తమ హక్కులనూ, బాధ్యతలనూ ఎరిగి వాటికోసం నిర్విరామంగా పని చెయ్యాలి. వినియోగదారుల జాగరూకత ఆర్థిక సుస్థిరతకీ, వారి వారి సంక్షేమానికి ఎలా దోహదం చేస్తుందో, వీరు ఎలా సంఘటితం కావాలో వారి హక్కులేమిటో– వాటిని వారు ఎలా పరిరక్షించుకోవాలో సూత్రప్రాయంగా ఈ వ్యాసంలో మనవి చేస్తాను.

మన దేశ ఆర్థిక ప్రణాళికలో ప్రజా సంక్షేమం కోసం వినియోగదారుల ఉద్యమానికి వారిలో చైతన్యం తీసుకుని వచ్చే కార్యక్రమాలకి ఒక ప్రాముఖ్యత ఇవ్వడం జరిగింది. వినియోగదారుల హక్కులు మానవ హక్కులలో భాగంగా అంతర్జాతీయమైన ఐక్యరాజ్య సమితి సైతం గుర్తించింది. వినియోగదారులుగా మనకి కొన్ని మౌలికమైన హక్కులు ఉన్నాయి. సరియైన కొలత, మానిక, నాణ్యత– వీటికి సంబంధించిన సమాచారం– వినియోగదారుల వాడకపు వస్తువులలో క్షేమం– ఇవన్నీ వాడకపుదారుల హక్కులే. వెల చెల్లించే ప్రతి వస్తువు ఎడలా, సరియైన కిమ్మత్తు గలిగిన సరుకు దొరుకుతోందో– తను మోసగింపబడుతున్నాడా అన్న విషయం వినియోగదారుడే ఖచ్చితంగా తెలుసుకోవాలి. వ్యాపారస్థుల దుశ్చర్యలకు పాల్పడకుండా జాగరూకత వహించాలి. పాల్పడినప్పుడు అట్టి చర్యలను నిరోధించే ప్రభుత్వ యంత్రాంగాన్ని పౌరులు ఉపయోగించుకోవాలి. తూనికలూ, కొలతలకి సంబంధించిన ప్రత్యేక ప్రభుత్వ యంత్రాంగం ఉంది. నాణ్యతను ధృవీకరించే సంస్థలూ ఉన్నాయి.

ప్రభుత్వ శాఖలు అప్రమత్తంగా ఉన్నప్పుడు వారిని జాగరూకలుగా చేసే బాధ్యత పౌరుల మీదనే ఉంటుంది. అధికార యంత్రాంగానికి ప్రజల అండదండలూ, సౌజన్య సహకారాలూ కావాలి. కొన్ని కోట్ల వినియోగదారుల హక్కులను రక్షించడానికి ప్రభుత్వ యంత్రాంగం సరిపోకపోవచ్చు. వినియోగదారులు వారి వారి హక్కుల కోసం సంఘటితం కావడం వినియోగదారు విద్య లక్ష్యం. విద్యావంతులైనవారు ఇతర వినియోగదారులకు ఈ విషయాలు తెలిసేటట్టు చెయ్యాలి.

అంతర్జాతీయంగా వినియోగదారుల వ్యవస్థలున్నాయి. జాతీయంగా– రాష్ట్ర స్థాయిలలో కూడా ఈ సంస్థలు పని చేస్తున్నాయి. నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కన్స్యూమర్ స్టడీస్– కన్స్యూమర్ గైడెన్స్ సొసైటీ ఆఫ్ ఇండియా జాతీయ, రాష్ట్రీయ సంస్థలు. ఇంటర్నేషనల్ ఆర్గనైజేషన్ ఆఫ్ కన్స్యూమర్ యూనియన్ అంతర్జాతీయ స్థాయిలోని సంస్థ. యు. ఎన్. కమిషన్ మానవహక్కులలో ప్రజలు వినియోగదారులుగా తమ హక్కులను తెలుసుకోవాలి– వాటికోసం పోరాడాలి సంఘటితం కావాలి అని పేర్కొంది.

మనం తినే ప్రతి వస్తువూ, కట్టే బట్ట– ఉపయోగించే ఉపకరణాలూ, పొందే సేవలూ, రవాణా సౌకర్యాలూ వినోదాలూ అన్నీ బహిరంగ వ్యాపార స్థలిలోకి తీసుకుని రాబడాలి. పలు రకాల నుంచి వినియోగదారుడు తనకి నచ్చిన వాటిని ఎన్నుకోడానికి వీలుగా రకరకాల వస్తువులు అందుబాటులో ఉండాలి.

వినియోగదారుల సంఘాలు సభ్యులకూ, సమాజానికి లాభసాటియైన క్షేమ పద్ధతులను వివరించి చెబుతాయి. వినియోగదారుల విద్యా వ్యాప్తి ద్వారా తమ తమ హక్కులను పరిరక్షించుకోడానికి అవలంబించవలసిన మార్గాలను తెలుపుతాయి. స్వేచ్ఛా విపణిలో లభ్యమయ్యే సరుకుల, సేవల– సౌకర్యాల నాణ్యతను, కొలతలను, స్థిరీకరించి వినియోగదారులు నష్టపోకుండా చూడడానికి సంఘటనోద్యమం అవసరం.

ప్రజల సమస్యలను గుర్తించి వాడకపుదారులుగా వారు ఎదుర్కొంటున్న కష్టాలను గమనించి ప్రభుత్వశాఖలతో సంప్రదించి వారి సమస్యలను అధికారుల దృష్టికి తెచ్చి ప్రభుత్వానికీ, వినియోగదారులకు మధ్య ఈ సంఘాలు సమన్వయకర్తగా పని చేయడానికి ఎంతో అవకాశం ఉంది. వినియోగదారుల సంక్షేమం కోసం ఇంకా అవసరమైన చట్టాలని తయారు చెయ్యడానికయితేనేం– ఉన్నవాటిని అమలు చెయ్యడంలో నైతేనేం ప్రజల నుండి సహకారాన్ని అందచెయ్యడానికే ఈ సంస్థలు బహుధా ఉపయోగపడతాయి.

ముంబాయ్ గ్రాహక్ పంచాయత్ బొంబాయిలోనూ, కన్స్యూమర్ ఎడ్యుకేషన్ అండ్



రీసెర్చి సెంటర్ అహమ్మదాబాదులోనూ, ఓయక్ అనే సంస్థగా ఢిల్లీలోనూ, కన్స్యూమర్ గైడెన్స్ సొసైటీగా హైదరాబాదు – బొంబాయిల్లోనూ అనేక రాష్ట్రస్థాయి– జాతీయస్థాయి సంస్థలున్నాయి.

విశాఖపట్నం, గుంటూరు, విజయనగరం పట్టణాల్లోనూ ఈ తరహా సంస్థలు ప్రాంతీయస్థాయిలో పని చేస్తున్నాయి. ఇవి కేవలం కొన్ని మాత్రమే ఇక్కడ ఉదాహరణ పూర్వకంగా ఇవ్వడం జరిగింది. బరోడా నగరంలో ఒక సంస్థ నడిబజారులో ఒక ధర్మ కాటాను ఏర్పాటు చేసింది. ఇదేవిధంగా ప్రతి పట్టణంలోనూ, మండల కేంద్రంలోనూ వినియోగదారుల వ్యవస్థలూ, సంఘాలూ ఏర్పడాలి. మీ దగ్గరలో ఒక సంఘం లేకపోతే మీరే ఒక సంఘాన్ని ఏర్పరచుకోడానికి కృషి చెయ్యండి.




వినియోగదారులుగా మనలో ప్రతి ఒక్కరూ చేయదగిన పనులు– జ్ఞాపకం ఉంచుకోవాల్సిన విషయాలు:

వినియోగదారులుగా మీ హక్కులు తెలుసుకోండి. వాటి సాధన కోసం సంఘటితం కండి.

ప్యాకెట్లమీద ఉండే ధరలనూ, ఉత్పత్తి తేదీని గమనించండి.

మనం చెల్లించే డబ్బుకు సరియైన విలువ గల నాణ్యతగల వస్తువులు దొరుకుతున్నాయో లేదో చూడండి.

ధరల నిలకడ దేశ ఆర్థిక సుస్థిరతకి అవసరం.

వినియోగదారుల సంఘాలు రాజకీయాలకు అతీతంగా ఉంటాయి. ఇందులో కుల మత తత్వాలు రాజకీయ పక్షాలతో ప్రమేయం ఉండదు.

స్వచ్ఛమైన ఆర్థిక ప్రజాస్వామ్యం వెల్లి విరియడానికి ప్రజలలో విద్యావికాసాలను ఉత్సాహభరితం చేసే ఉద్యమం వినియోగదారుల ఉద్యమం. మనల్ని చైతన్యవంతులని చేసేది వినియోగదారుల విద్య.

ఈ రెండింటికీ ప్రతి ఒక్కరి సహకారమూ అవసరమే.

వివిధ సంస్థల గురించి, వారు చేస్తున్న కృషిని గురించి మరొకసారి మనవి చేస్తాను.

—డా. వి. వి. బి. రామారావు

# సీక్రెట్ ఏజెంట్ విక్రమ్

15

లండన్ విమానాశ్రయంలో ...
విక్రమ్, మార్టిన్‌లు మీరేనా? నేను స్కాట్‌లాండ్‌యార్డ్‌కు చెందిన సూపరింటెండెంట్ జంకిన్స్‌ని. మీ చీఫ్ పంపిన సందేశం అందింది.

29/15

మాల్కమ్‌వైట్ ఇంట్లో మెయిక్రోట్రాన్స్‌మిటర్‌ని పెట్టాము. మనం అక్కడికి వెళ్లి బయట వేచి ఉండి - ఏమి జరుగుతుందో చూద్దాం
మంచి ఆలోచన!

మాల్కమ్‌వైట్ ఇంటి వద్ద.
విక్రమ్! ఆ కార్లోనించి దిగుతున్నది ఎవరు?
వాళ్లే, ఛగన్‌లాల్, మనోహర్‌లు. మూడవ వ్యక్తి నాకు తెలీదు.

జాక్! రేడియో రిసీవర్ని ఆన్ చెయ్
అలాగే సర్!

మాదకద్రవ్యాలకి సంబంధించిన మన సరుకంతా భారతప్రభుత్వానికి పట్టుబడింది. ఇప్పుడు మనం ఏమి చెయ్యాలి మిస్టర్ వైట్?
అది ఛగన్‌లాల్ గొంతు!

ఓ అరగంట తర్వాత
సరే, మనమంతా కలిసే వెళ్దాం
వాళ్లు బయటికి వస్తున్నట్లున్నది.
పదండి వాళ్లని పట్టుకుందాం

పోలీసులం! ప్రశ్నించే నిమిత్తం మిమ్మల్ని తీసుకు వెళ్తున్నాము.

నేను మా లాయర్ని సంప్రదించాలి.
అలాగే, అయితే పోలీస్ స్టేషన్‌కి వెళ్లిన తర్వాత

© RANG REKHA FEATURES PVT. LTD 1985

అసలు మీ ఉద్దేశం ఏమిటి? మమ్మల్ని అరెస్టు చేస్తున్నారా?
దన్ని మీరు అలాగ భావించవచ్చు.

(ఇంకా ఉంది)



# అద్వితీయం

కె. గోదావరి శర్మ

నెల్లాళ్ల నుంచి ఏకధాటిగా వచ్చే చుట్టాలూ వెళ్లే చుట్టాలూను. ఊపిరి సలపలేదు విజయకి ఆఖరి బేచ్ ఇదిగో నిన్న రాత్రి వెళ్లేరు. ఇల్లంతా ఎలా ఉండాలో అలా ఉంది. గాలివాన వెలిశాక పూలతోట ఎలా ఉంటుందో అలా ఉంది. ఉదయం మొగుణ్ణి ఆఫీసుకి పంపించి ఇల్లు సర్దే కార్యక్రమం ప్రారంభించింది విజయ. నెల్లాళ్ల పాటు బంధువుల తాకిడిని భరించిన ఇంటిని ఓ కొలిక్కి తేవాలంటే మాటలా? అసలే ఆమెకి నీటూ గోటూ ఎక్కువ. పిల్లలుగల ఇల్లయితే అడివిలా సహజసుందరంగా ఉంటుంది గాని పిల్లలులేని ఇల్లు జాగ్రత్తగా పెంచుకునే - పూలతోటలా ఉండుకోవచ్చు- ఇల్లాలికి ఒళ్ళు వంగాలే గాని. విజయకి ఒళ్ళు బాగానే వంగుతుంది. ఇంకా పిల్లాజెల్లా లేరు కాబట్టి ఇల్లు చక్కబెట్టుకోవడానికి బోలెడు కోరికా తీరికా ఓపికా కూడా ఉన్నాయి ఆమెకి. కాని ఇదిగో ఈ నెల్లాళ్ల నుంచి ఇంట్లో పిల్లలు లేరన్న లోటు తీర్చేశారు చుట్టాల పిల్లలు. అద్దంలాంటి ఇల్లు అడివిలా చేసేశారు. వాళ్లంతా కిష్కింధాపుర అగ్రహారికులు వాళ్ల ఇళ్ళల్లో అయితే తల్లీతండ్రికి భయపడతారు గాని కొత్తచోట. కొత్త వాళ్ల ఎదుట ఏమీ అనరని వాళ్లకి ధైర్యం ఆవిధంగా పెద్దవాళ్ళు ఇల్లు గుల్లచేసి వెళితే పిల్లలు ఇల్లు తీసి పందిరేసి వెళ్లేరు

ఎక్కడి సామాన్లు అక్కడ సర్ది గదులన్నీ తుడుచుకొచ్చే సరికి నడ్డి విరిగిపోయింది విజయకి కళ్ల మీదకి నిద్రకూడా కూరుకొచ్చింది కాని ఈ ఇంతపనీ వెనకపెట్టడం ఎందుకని, భర్త టేబులూ పుస్తకాలూ కాగితాలూ కూడా సర్దేసి ఏకంగా పడుకోవచ్చుని ఆ పని మొదలెట్టింది టేబులు సొరుగులో కాగితాలు పైకి తీసి సర్దుతూండగా ఒక నోట్‌బుక్ ఆమె కంట పడింది తీసి చూస్తే అది పద్మనాభరావు జాతక పుస్తకం మొదటి పేజీల్లో రా

చక్రం, అంశచక్రం, లగ్న పత్రిక, తరవాత పేజీల్లో దశాభుక్తి శేషాలు, గ్రహచారమూ, జీవితాంతం శుభాశుభ ఫలితాలూ అన్నీ క్రమంగా రాసి పెట్టి ఉన్నాయి. విజయకి ఆశ్చర్యం కలిగించిన విషయం ఏమిటంటే పెళ్ళయిన ఈ మూడున్నర ఏళ్ళలో నూ భర్త ఎప్పుడూ దీన్ని తనకి చూపించలేదు దీని సంగతి తనకి చెప్పనైనా లేదు పోనీ అతడికి ఈ జ్యోతిష ఫలితాల్లో ఆసక్తి నమ్మకమూ లేవా అంటే, ఆ ప్రసంగం ఏదైనా వస్తే ఎంతో భక్తి శ్రద్ధలతో మాట్లాడతాడు, జాతక ఫలితాలు, గ్రహబలాలు, ముహూర్త బలాలూను జాతకాలంటే చాల గురి ఉంది. మరి?

నిద్ర ఎక్కడి దక్కడ ఎగిరి పోయింది కనక, చేతిలో పని పక్కన పెట్టి ఫ్యాను వేసుకుని ముందు ఆ పుస్తకమంతా చదివింది విజయ

పద్మనాభరావు మహజ్జాతకుడేమీ కాదు అలా అని నష్టజాతకుడూ కాదు మామూలు మధ్య తరగతి మనుషులందరి జీవితాల్లో లాగే అతడి జీవితంలో నూ మామూలు మిట్టపల్లాలే ఉన్నాయి. జ్యోతిష పరిభాషలో చెప్పాలంటే శుభాశుభ మిశ్రమ ఫలితాలు అలా చదువుతూండగా ఒక వాక్యం దగ్గర ఆమె కళ్ళు ఆగిపోయాయి. పద్మనాభరావుకి ద్వితీయ కళత్రయోగం ఉంది!

ఒక్కసారి కళ్ళు తిరిగి నట్టనిపించింది ఆమెకి అంటే... అంటే .... తను మొదటి కళత్రం! ఇక ద్వితీయ కళత్రం అంటే ... తను చచ్చిపోతుందా? తను పోయాక భర్త మళ్ళీ పెళ్ళి చేసుకుంటాడా? లేక..... లేక .. తను ఉండగానే వేరే ఎవరి నో -

ఆ ఆలోచన వచ్చీ రావడంతో నే విజయ మనసు గుబగుబ లాడిపోయింది అరికాళ్ళకింద మంటలు పుట్టినట్టు లేచి ఆగదిలోంచి ఈ గదిలోకి ఈ గదిలోంచి ఆ గదిలోకి తిరిగేసింది డ్రెస్సింగ్ టేబులు ముందు నిలబడి అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకోగానే ఆమెకి పుట్టెడు దుఃఖం వచ్చేసింది ఎంతో కష్టంలో ఉన్న తనని తన ప్రతిబింబం

# అద్వితీయం

సానుభూతిగా చూసి ఓదారుస్తున్నట్టని- పించింది ఈ గదిలో ఈ అద్దంముందు - ఇంకెవరో నా? విలాసంగా, సగర్వంగా పైట సర్దుకుంటూనా? వెనక నుంచి వచ్చి తన భర్త - దాని బుజాలమీద చేతులు వేసి- ముందుకి వంగి దాని తల్లో పూలని ఆఘ్రాణించి- దాని ముఖం తన వైపుకి తిప్పుకుని- తనకిచ్చినట్టే-

ఇక దుఃఖం పట్టలేక మంచం మీద బోర్లాపడి భో రున ఏడ్చేసింది విజయ

కొంత సేపయ్యాక, గుండెల్లోని ఉద్వేగం కొంత ఉపశమించాక, ప్రశాంతంగా ఆలోచిస్తే తన భయం అర్థం లేనిదనిపించింది. ఛ! ఎంత సిల్లీగా, చదువులేని దానిలా, ఆలోచించింది తను! నిజానికి చాలా మంది మొగుళ్ళలాగే తన భర్తా శ్రీరామచంద్రుడు! ఏక పత్నీ వ్రతమనీ, అదొక నియమమని, దాన్ని దీక్షగా పాటించే నిష్ఠాపరుడనీ కాదు- ఇద్దరు పెళ్ళాలని మెయింటైన్ చేసే సత్తా అతడికి లేదు, ఏ విధంగా చూసినా పాపం పద్మనాభరావు మధ్య తరగతి మానవుడు! ఉద్యోగం చేసి డబ్బు సంపాదించి చన్నీళ్ళకి వేణ్ణీళ్ళు తోడు చేసి, నాజూగ్గా సరసంగా తనతో సినిమాలకి షికార్లకి రావడానికి ఒక శ్రీమతి, ఇంటి పట్టునే ఉండి వంటా వార్పూ ఇల్లూ పిల్లలూ చూసుకుంటూ నోములూ వ్రతాలూ చేసుకునే ధర్మపత్ని ఒకతె- వెరసి ఇద్దరుంటే బాగానే ఉంటుందన్న కోరిక మనసులో ఎక్కడో ఉన్నా, ఆ సరదా తీరేది కాదు కనక, నిజ భార్యనే యథాశక్తి "ఇలలో నీవె ప్రేయసివే, కలలో నీవె ఊర్వశివే" అన్నట్టు నిజాయితీగా ప్రేమించు కొంటున్నాడు మరో ఆడదాన్ని- కంటి కెదురైతే కంటితో చూడడం, ఆవిడ వంటికున్న చీర లాంటిది తన భార్యకి కొంటే బాగుంటుందను కోవడం మినహా ఇంకేమి ఆలోచించే, ఆశించే తత్వం కాదతడిది ఈ

విషయాలన్నీ విజయకి స్పష్టా స్పష్టంగా తెలుసు తనుండగా తన భర్త మరో స్త్రీని కోరుకోవడం జరగదు.

తను చచ్చిపోయాక చేసుకుంటాడా? తను చచ్చిపోయాక ఇక ఎవరు ఏం చేస్తే తన కేమిటి? తనకి తెలియదు కదా! బాధ ఉండదు కదా! కాని ప్రస్తుతం బాధగా ఉంది, ఆ తలపే ఆలోచిస్తే, నిజమే, తనుపోయాక ఆయన మరొకర్తెని చేసుకుని ఎందుకు సుఖపడ కూడదు? తన కేమిటి నష్టం? విజయకి ఏదో త్యాగం చేసిన గొప్ప ఫీలింగూ కలిగింది, తన సొమ్ము ఎవరో లాక్కు పోతున్నట్టు బాధాకలిగింది.

హఠాత్తుగా విజయ మెదడు చురుగ్గా పని చేసింది గత మూడున్నర ఏళ్ళలో నూ పద్మనాభరావు ఇద్దరు పెళ్ళాల విషయమై అప్పుడప్పుడు ఆడిన మాటలన్నీ ప్రతిభావంతుడైన ఫిలిం ఎడిటర్లా ఏర్చి కూర్చింది. తన జ్ఞాపక శక్తికి తనే ఆశ్చర్యపోతూనే ఆ సంభాషణా శకలాల నన్నిటినీ ఓ వరసక్రమంలో పెట్టి చూసుకుంది రేడియోలో "పెళ్ళయిన వాణ్ణని జంకమాకు, ఒకరికి ఇద్దరైతే వేడుకలే" అన్న పాట విన్నప్పుడు, వారపత్రికల్లో ఒక హీరో- ఇద్దరు హీరోయిన్ల సీరియల్ నవలలు చదివినప్పుడు, ఇతరత్రా అతడు చేసిన కామెంట్లన్నీ మననం చేసుకోగా-

"అమ్మో, నమ్మ కూడదు ఈ మగాళ్ళని" అనిపించింది ఆమెకి పద్మనాభరావు మేధకుడే కావచ్చు, తనని సిన్సియర్‌గానే ప్రేమిస్తూ ఉండి ఉండవచ్చు, ఇప్పట్లో రెండో పెళ్ళి ఉద్దేశ్యం ఏదీ అతనికి లేకపోనూ వచ్చు! కాని, కాలం ఎప్పుడూ ఒకేలా ఉండదు కద! పైకి తేలకపోయినా, సబ్ కాన్షస్‌గా లోపలెక్కడో అతడికి సుముఖత ఉండే ఉంటుంది సమయం, సందర్భం వచ్చినప్పుడు అది పైకి వస్తుంది. పైగా ఈ జాతకం ఒకటి! స్పష్టంగా ద్వితీయ కళత్రయోగం అని రాసి ఉంది, ఇందులో! దీన్ని అతడు తప్పక సీరియస్‌గా తీసుకుంటాడు నిశ్చయమే అని నమ్ముతాడు తన కిష్టం ఉన్నా లేకపోయినా రెండో పెళ్ళి తప్పదని, జాతకంలో ఉన్నట్టు జరగక తప్పదనీ అనుకుంటున్నాడేమో! తనకి తెలియకుండానే దానికి క్రమంగా సిద్ధపడు తున్నాడేమో! అసలందుకే ఇంతవరకు తనకీ పుస్తకం చూపించ లేదు తను భరించలేదని! అంగీకరించదని! కాని తమ ఇద్దరి ఇష్టా యిష్టాలతో ప్రమేయం లేకుండా జరగవలసిన దేదో జరిగి తీరుతుందని అతడి నమ్మకమా?

విజయకి భర్తమీద కోపం, విసుగు, చికాకు కలిసి వచ్చాయి ఏమిటీ మనిషి! ఏవో అర్థం పర్థం లేని జ్యోతిష్యాలని నమ్ముతాడు! ఇన్నాళ్ళూ పోనీలే, అతడి నమ్మకాలు అతడివి, ఎవరి వెర్రి వారి కానందం అని ఊరుకుంది. కాని ఈ జాతకాల పిచ్చి వల్ల తన కాపురానికే కీడు మూడుతూందే!

ఏం చెయ్యాలి? నిలదీసి అడిగెయ్యాలా, ఏమిటి మీ ఉద్దేశ్యమని? రెండో పెళ్ళికి రెడీగా ఉన్నారా అనో, ఎవర్తయినా ఇంకా జతపడ్డదా లేదా అనో అడిగి,



# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## ఘనపదార్థాలను తొలిసారిగా రుచి చూపిస్తూ

సుమారు 4వ నెల నుంచి మీ పాపాయికి పాలతోపాటు ఘనపదార్థాలూ కావాలి. దీన్ని సెరిలాక్ కానుకతో ప్రారంభించేందుకు ఇదే సరైన సమయం.

**పోషకాహార లాభం :**
సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు-ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, క్రొవ్వుపదార్థం, విటమిన్లు, ఖనిజాలు అన్నీ ఉన్నాయి. మీ పాపాయికి ప్రత్యేక అవసరాలకు తగినట్లుగా సరైన పాళ్ళలో అన్నీ సమతూకంలో ఉన్నాయి.

**రుచి లాభం :**
సెరిలాక్ మంచి పోషక పదార్థాలకు, మంచి రుచిని కలిపింది. పాపాయిలకు సెరిలాక్ రుచి భలే ఇష్టం.

**సమయం ఆదా లాభం :**
సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార ఉన్నాయి. దాన్ని వెచ్చటి నీటిలో కలిపితే చాలు. క్షణంలో ఆహారం తయారు.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు తయారుచేయడంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.

ఉచిత సెరిలాక్ పుస్తకం కోసం వ్రాయండి.
సెరిలాక్
పోస్ట్‌బాక్స్ నం: 3.
న్యూఢిల్లీ-110 008.






**సెరిలాక్ రక్షణ: పోషకాహారంలో పరిపూర్ణం-ఎంతో రుచికరం**

కడిగి ఎండేసెయ్యాలా?

మరుక్షణం తన తొందరపాటుకి తనే సిగ్గు పడ్డది విజయ. తను ఆవేశంలో, తన కేదో అన్యాయం జరగబోతున్నదన్న భయంతో, భ్రమతో, ఉన్నవి లేనివి ఊహిస్తున్నదేమో! భర్త తను అనుకుంటున్నంత సిరియస్‌గా ఇవేవి నమ్మడం లేదేమో! తను అడిగితే, పిచ్చి, అలాంటి ఆలోచనలూ మాటలూ ఇంకెప్పుడూ రానివ్వకని కాజువల్‌గా తీసి పారేస్తాడేమో! ఎలా నమ్మడం? ఆ మాటలు నిజమో నటనో! నిజమే అయితే ఈ పుస్తకం తన నుంచి దాచడం ఎందుకు?

విజయకి ఏమీ పాలుపోవడం లేదు. ఏం చెయ్యాలి? ఏదో చెయ్యాలి! తొందర పడకూడదు. ఆలస్యమూ చేయకూడదు. ఉద్రేక పడకూడదు, ఉపేక్షించనూ కూడదు. చిన్న పామునైనా పెద్ద కర్రతో కొట్టమన్నారు కాని ఒడుపు చూసి కొట్టకపోతే కాటు తినవలసి వస్తుంది. ఇంతకీ– అది తాడో పామో! ముందు తేల్చుకోవాలి. తాడుని కొట్టడం తెలివి తక్కువ. పాముని కొట్టక పోవడం ప్రమాదం.

తటిల్లతలా ఓ ఆలోచన విజయ మెదడులో మెరిసింది. దాన్ని గురించే ఆలోచిస్తూ యాంత్రికంగా మిగతా సర్దడం అంతా పూర్తి చేసింది. ఆ జాతక పుస్తకాన్ని యథాస్థానంలో ఉంచేసింది.

* * * *

వారం రోజుల తరవాత పద్మనాభరావు ఆఫీసుకి బయలుదేరుతూ ఫైలులో ఈ పుస్తకం కూడా పెట్టుకోవడం చూసిచూడనట్టు ఓరకంట చూసింది విజయ.

"సాయంత్రం తొందరగా వచ్చేస్తారా?" అని అడిగింది.

"ఉహుఁ! కొంచెం లేటవుతుంది. ప్రభాకర్‌తో కలిసి ఒకరి దగ్గరకి వెళ్ళాలి" అన్నాడు పద్మనాభరావు, షర్టు వేసుకుంటూ.

"ఎక్కడికి?"

"ఉన్నాడులే ఈ ఊళ్లో ఒకాయన. జ్యోతిష శాస్త్రంలో మంచి గట్టివాడట. పోనీ ఓసారి చూద్దామని...."

"ముసలాళ్ళలాగా అప్పుడే మీ కి జాతకాల పిచ్చి ఏమిటండీ?" అని కొంచెం విసుగు నటించింది విజయ. "అయినా మీకు చాలదన్నట్టు ప్రభాకరన్నయ్య గారికి ఎప్పటి నుంచీ? మీరే అంటించారా ఆయనక్కూడా?" అంది.

నవ్వేసాడు పద్మనాభరావు. "నేను కాదు. అతనే చెప్పేడు నాకు స్వయంగా, ఈయన గురించి. నన్ను తీసుకెళతా నన్నాడు ఇవాళ!"

"ఏమో మీ ఇష్టం బాబూ! నన్ను అందులోకి లాగనంతవరకు మీ నమ్మకాన్ని నేనెందుకు కాదనాలి?" అంది విజయ, ఉదాసీనంగా.

పద్మనాభరావు ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

* * * *

రాత్రి బాగా చీకటి పడ్డాక తిరిగి ఇల్లు

# అద్వితీయం

చేరుకున్నాడు పద్మనాభరావు. ఏదో ఆలోచిస్తూ నిశ్శబ్దంగా వచ్చి కుర్చీలో కూర్చున్న భర్తకి మౌనంగానే కాఫీ కప్పు అందించింది విజయ.

అతను కాఫీ తాగడం పూర్తయ్యాక, "వెళ్ళేరా?" అంది, కప్పు అందుకుంటూ.

"ఊఁ!"

"ఏమన్నారు?"

"ఏం లేదు. ఏవో చెప్పేరు. కాని ఆయన బాగా నిష్ణాతు లాగున్నాడు జ్యోతిషంలో"

విజయ ఏమీ మాట్లాడ లేదు.

"ఇంతకు ముందు నా దగ్గర ఉన్న జాతక చక్రం తీసుకు వెళ్ళి చూపించాను..... అందులో దోషం ఉందంటున్నారు...." తాపీగా అన్నాడు పద్మనాభరావు.

"దోషమా? కొంపతీసి ఏవో గండాలనీ గ్రహశాంతులనీ అంటారా ఏమిటి?" కంగారు ప్రదర్శిస్తూ అడిగింది విజయ.

"అబ్బెబ్బే అదేం కాదు. అసలు జాతక చక్రమే, వెయ్యడం తప్పుగా [illegible]రట. జనన కాలాన్ని బట్టి చూస్తే గ్రహస్థితి ఇందులో ఉన్నట్టు ఉండదట. కొంచెం తేడా వస్తుందంటున్నాడు ఈయన!"

"అయితే?"

"మరేం లేదు. గ్రహస్థితి మారితే దానిని బట్టి ఫలితాలు కూడా మారుతాయి" సాలోచనగా అన్నాడు పద్మనాభరావు.

"పోనీ, ఏమీ చెడులేకుండా ఉంటే అంతే చాలు" ఆందోళన కనపరిచింది విజయ.

"చెడు ఏమీ లేదులే. ఒకరకంగా చెప్పాలంటే మంచే జరిగింది. పూర్వపు ఫలితాల కంటె ఇదే బాగున్నాయి. నాకూ నీకూ కూడా!"

"అదేమిటి? మీ జాతకంలో నా గురించి ఏం ఉంటుంది?" ఆశ్చర్యంగా అంది.

"బాగుంది. నువ్వు నా భార్యవైనప్పుడు నా జాతక ప్రభావం నీ మీద ఉండదూ? సప్తమ స్థానం కళత్ర స్థానమట. ఆ ఏదో ఇంట ఉన్న గ్రహానికి ఇతర గ్రహాలతో ఉండే సంబంధాన్ని బట్టి భార్య విషయం కూడా చెపుతారు.

"అయితే ఇప్పుడు నా విషయం ఏం చెప్పేరు?"

కొంచెం సేపు తటపటాయించాడు పద్మనాభరావు. చివరకి చెప్పేశాడు. "ఇంతకు ముందు జాతకంలో గ్రహస్థితి ప్రకారం నాకు.... ద్వితీయ కళత్రయోగం ఉండవచ్చుని.... అహఁ, అంటే అలా అయిపోతుందని కాదు, గ్రహస్థితిని బట్టి చూస్తే అలా జరిగే అవకాశం ఉందన్నారు. ఇప్పుడు కొత్తగా వేసిన చక్రం ప్రకారం అలాంటిదేమీ లేదని తేల్చేశాడు ఈయన."

భర్తకి దగ్గరగా వచ్చి, అతడి చేతి మీద చెయ్యివేసి, "అందుకని పాపం, విచారంగా ఉందా?" అంది విజయ, సగం హాస్యం, సగం జాగ్రత్త మేళవించిన స్వరంతో

"ఛ ఛ! అదేమిటి విజయా, అలా అంటావు! నా కెప్పుడయినా అలాంటి ఆలోచన ఉందా చెప్పు? జాతకంలో ఉందన్నాను గాని.... అయినా నిన్ను తప్ప వేరే ఎవరినైనా కలలోనైనా స్మరిస్తానా చెప్పు" చాలా సిన్సియర్‌గానే అన్నాడు ఈ మాటలు, పద్మనాభరావు.

"ఛ! ఊరికే అన్నానండి! మీ సంగతి నాకు తెలియదూ?" అంది విజయ, అతడి తలమీద చెయ్యివేసి నిమురుతూ.

"ఇది వరకు జాతకం ప్రకారం అలాంటి అవకాశం ఉందంటే ఉందనుకున్నాం. అంతే. కాని ఆ అవసరం, ఆ పరిస్థితి ఎప్పుడూ రాదు మనకి. ఇప్పుడు ఆ భయం, ఆ అనుమానలేశం కూడా తీరిపోయింది కద! సంతోషించక విచారం ఎందుకూ? నాకు మాత్రం అనవసరపు ఆలోచనలకి ఆస్కారం లేకుండా ఈయన ఇలా చెప్పడం హాయిగా ఉంది సుమీ!" అని కూడా అన్నాడు పద్మనాభరావు.

విజయ తేలిగ్గా నిట్టూర్చింది.

* * * * *

మరుసటి ఆదివారం ప్రభాకర్‌ని భోజనానికి పిలిపించింది విజయ. అతడు వచ్చాడు.

భోజనాలయ్యాక భర్తని వీధి చివర కిళ్ళీబడ్డీ దగ్గరకెళ్ళి కిళ్ళీలు, అరటిపళ్ళు తెమ్మని చెప్పి పంపించి, తను ప్రభాకర్‌తో మాట్లాడింది.

"సమస్య ఇంత సులువుగా పరిష్కారం అయిపోతుందనుకోలేదు అన్నయ్య గారూ! అంతా మీ చలవే" అంది కృతజ్ఞతతో.

"నా దేముందమ్మా! సమస్యా నీదే, పరిష్కారమూ నీదే. నేను నిమిత్తమాత్రుణ్ని. మీ పనికి నేను పనికొచ్చాను. అంతే చాలు" అన్నాడు ప్రభాకర్.

"ఆ జ్యోతిష్కుడు గారెవరో ఈయన్ని బాగా ఇంప్రెస్ చేసినట్టున్నారే!" అంది విజయ, నవ్వుతూ.

"ఔను. నిజానికి ఆయన బాగా పేరున్న జ్యోతిష్కుడే. నేను ఇలా ఇలా అని విషయమంతా వివరించేసరికి మనతో సహకరించడానికి ఆయన ఒప్పుకున్నాడు. వెయ్యి అబద్ధాలాడైనా ఓ పెళ్ళి చెయ్యమన్నారు కాని పెళ్ళి చేసేసి చేతులు దులుపుకోగానే తీరిపోదు కదా పెద్దవాళ్ల బాధ్యత! పెళ్ళి చెయ్యడం ఎంత ముఖ్యమో, పెళ్ళయ్యాక మొగుడూ పెళ్ళాలు సజావుగా సంసారం చేసుకుంటున్నారో లేదో కనిపెట్టి వాళ్ళకి అన్నివిధాలా సాయపడటం కూడా అంతే ముఖ్యం.

ఇద్దర్ని ఓ ఇంటి వాళ్ళని చెయ్యడానికి వెయ్యి అబద్ధాలాడటం తప్పు కానప్పుడు, ఆ ఇల్లు నిలబెట్టడానికి అన్ని అబద్ధాలూ ఆడవచ్చు అయినా మనం ఆడింది ఒకటే అబద్ధం. తప్పులేదు." అన్నాడు ప్రభాకర్.

ఎమ్మే చదువుకున్న విజయ, 'థాంక్స్' అనకుండ కృతజ్ఞతగా, ఆప్యాయంగా, తడి కంటితో అతడి వైపు చూసి చిరునవ్వు నవ్వింది. ▭




# ఈసారి మీ కుటుంబానికి సన్‌ఫ్లవర్ రక్షణ కవచంతో భద్రత నివ్వండి.




## సన్‌ఫ్లవర్ ఎకానమీ ప్యాక్. విడి వనస్పతి కంటే కొద్ది పైసల ఎక్కువ ధరకే శుద్ధమైనది.



మీ కుటుంబానికి అత్యంత సురక్షితమైనదీ, భద్రమైనదీ ఇవ్వండి: సన్‌ఫ్లవర్ బ్రాండ్ వనస్పతి. సన్‌ఫ్లవర్ రక్షణ కవచంతో ప్యాక్ చేయబడి, సీలు చేయబడినది. విటమిన్ ఎ,డి చేరిన పరిశుద్ధమైన పుష్టికరమైన వనస్పతిని మీ కందించే నిమిత్తం ఇలా చేయబడింది.







# సన్‌ఫ్లవర్ బ్రాండ్ వనస్పతి

1కిలో, ½కిలో ప్యాక్‌లలో లభ్యం.

మంచి నెయ్యి మాత్రమే దీన్ని మించగలది.

WIPRO LTD – *Closer to the consumer*

# జయసుధ సమాధానాలు



డి. శేషకుమారి, అమలాపురం

చల్లని సంసారాన్ని ... చక్కటి సంతానాన్ని మామూలుగా ఆడది కోరుకుంటుంది. నేటి స్త్రీ వీటితో తృప్తి పడుతుందంటారా?

ఈ రెంటితో తృప్తి పడటం సాధ్యంగాని విషయం. ఆమెకు కొన్ని విస్తృతమైన సామాజిక బాధ్యతలు కూడా వున్నాయి.

సి. హెచ్. ఉషారాణి, పర్లాకిమిడి

మిమ్మల్ని భరతనాట్యంలో చూడాలని వుంది. మా కోరిక ఇప్పట్లో నెరవేరుతుందా?

"కళ్యాణి" చిత్రంలో భరత నాట్యంలో చూసారు కదా!

ప్రస్తుతం భరతనాట్యం చేసి నటించే ఓపికలేదు.

యన్. రవి, సత్తుపల్లి

పౌరాణిక చిత్రాల్లో పవిత్రమైన కొన్ని పాత్రలను అపవిత్రులయిన కొందరు తారలు పోషించడం సమంజసమేనా?

నటన అనేది ఓ కళ. కళకు భాషా బేదాలు లేవు అన్న సంగతి మీకు తెల్సిందే. అలాగే సినిమాల్లో జీవించే వారిలో కొందర్ని పవిత్రులుగానూ, మరికొందర్ని అపవిత్రులుగానూ పేర్కొనడం సమంజసం కాదు. నటీనటులకు సరిపడే పాత్రలు పోషించేటప్పుడు ఆ పాత్రపవిత్రమైంది కాబట్టి అపవిత్రులయిన వారిని నటింప జేయకూడదు అనేది లేదు. పవిత్రత... అపవిత్రత అనే భేదాలు సినిమా పరిశ్రమలో కానరావు. నా అభిప్రాయంతో మీరు ఏకీభవిస్తారని ఆశిస్తా!

## ఉత్తమ ప్రశ్న

గాదె కన్నతల్లి, బరంపురం-2

మనిషి దొంగగా, హంతకుడిగా మారడానికి కారణం క్రమశిక్షణతో పెంచని వారి తల్లితండ్రులే అని నా ఉద్దేశ్యం! మీరేమంటారు?

తల్లితండ్రుల పెంపకంలో లోపం వున్నా లేకపోయినా ఎక్కువగా సంచరించేది విశాలమైన సమాజంలోనే కాబట్టి సాంగత్యపు ప్రభావం ... సమాజం యొక్క ప్రభావం పిల్లల మీద చాలా ఎక్కువగా వుంటుంది.

పి. భవాని, తేలప్రోలు

"శ్రీమతిగారు" చిత్రంలో అహంకారిగా నటించారు. మీకు మగాళ్ళంటే అంత అసహ్యమా?

ఆ సినిమాలో ఆ పాత్ర స్వభావం అలాంటిది గనక అలా నటించాను.

యస్. మదుసూధన్, బచ్చోడు

మీరంటే నాకెంతో అభిమానం. నేను మీరు నటించిన చిత్రాలు చూసి మీ నటన గురించి పలు ఉత్తరాలు వ్రాసాను. ఒక్క లెటర్‌కు నాకు సమాధానం రాలేదు. మీ అడ్రస్ వివరంగా తెలుపరూ.....

మీ అభిమానానికి ధన్యవాదాలు. సాధారణంగా నాకు వచ్చే ప్రతి ఉత్తరం నేను చూడటం జరుగుతుంది. మరి మీ ఉత్తరాలు నాకు తప్పక అందే వుంటాయి. ఏది ఏమయినా మీ తృప్తి కోసం మరొకసారి అడ్రసు యీ క్రింద యిస్తున్నాను. జయసుధ, 9–బి వీనస్ కాలనీ, మద్రాసు–600018.

షేక్ కరిముల్లా, కువైట్

హరివిల్లును ఏమాత్రం ఎత్తలేకపోయిన రావణుడు .... వనవాసంలో వున్న సీతను అమాంతంగా ఎలా ఎత్తుకెళ్ళగలిగాడు?

సీత నారీమణి. హరివిల్లు నారీ బరువులో నాలుగో వంతు కూడా ఉండదు గనక.

మన్నె మల్లీశ్వరరావు, పరిమళ్ళ

జయసుధ అక్కా నీ ఇష్ట దైవము ఎవరు?

అందరు దేవుళ్ళూ నాకు యిష్టులే! ☐

కూపన్

## ఆంధ్రసచిత్రవారపత్రిక
## జయసుధ సమాధానాలు

ప్రశ్న: ______________________

______________________

______________________

పంపేవారి పేరు:

పూర్తి చిరునామా:

# అభిమాన తారలపై అభిప్రాయం

నా అభిమాన నటుడు "రెబెల్ స్టార్" కృష్ణంరాజు. తెలుగు సినీ జగత్తులో ఈ 'సినీరారాజు' ప్రదర్శిస్తున్న అద్భుత నటన ప్రేక్షకుల హృదయాలకు పన్నీటి జల్లులాంటిది. ఆరున్నర అడుగుల నిండైన విగ్రహంతో, ఆకర్షణీయమైన,



గంభీరమైన ముఖవర్చస్సుతో ఎటువంటి పాత్రనైనా అవలీలగా పోషించగల శక్తిసామర్థ్యాలు, ఈ మహా నటుని కీర్తి కిరీటంలో కలికితురాయిలాంటివి. 'భక్త కన్నప్ప', 'అమరదీపం' 'కటకటాలరుద్రయ్య', 'బొబ్బిలి బ్రహ్మన' మొదలైన చిత్రాలలో ఈయన చూపిన అసమాన నటనా వైదుష్యం మరపురానిది. ఆహార్యంలోను, ఆంగికంలోను, సాత్వికంలోను, నటనలోను ఈయన ప్రదర్శిస్తున్న ప్రజ్ఞా పాటవాలు ప్రేక్షకలోకాన్ని ఆనందడోలికల్లో ఉర్రుతలూగిస్తాయి. తాను పెద్ద హీరో అయినా ఈయన నిగర్వి. అభిమానుల పట్ల ఈయన చూపించే ఆదరాభిమానాలు దీనికి నిదర్శనం.

ఈ మధ్యన రాజుగారు నటించిన కొన్ని సినిమాలు ఆశించినంతగా రాణించలేదు. దీనికి కారణాలు అనేకాలు. దానికి ఈయన బాధ్యులు కారు. మంచి కథాబలం , ఆదర్శవంతమైన భావాలు కల సినిమాల్లోనే ఈయన నటించాలి. అప్పుడే ఈయన కీర్తిపతాకం సినీ ఆకాశంలో రెపరెపలాడుతూ ఉంటుంది. లేకపోతే ప్రేక్షకులు, అభిమానులు నిరుత్సాహపడే అవకాశం ఉంటుంది. ఈ విషయంలో కృష్ణంరాజు గారు కొంచెము ఆలోచించి రంగంలోకి దూకితే సినిమా ప్రపంచమనే శివజటాజూటంలో ఈయన కీర్తి చంద్రరేఖలాగా వెలుగొందుతుంది.

—వేమూరి మాధవ, నేరేడిమెట్,
సికింద్రాబాద్

★ ★ ★

ఎల్లప్పుడూ పెదవులపైసన్నని చిరునవ్వు చిందించే అందాలరాశి 'జయసుధ' నా అభిమాన తార.



ఆమెనటించిన కుంకుమతిలకం, శక్తి, దాంపత్యం, జస్టిస్ చక్రవర్తి, ధర్మాత్ముడు సినిమాలలో కొన్ని సన్నివేశాలు నా కళ్ళు చెమ్మగిల్లేటట్లు చేసాయి. ప్రేక్షకాభిమానుల పొగడ్తలు మాత్రమే కాకుండ, విమర్శలు కూడ చిరునవ్వుతో స్వీకరించడము ఆమె ప్రత్యేకత. కొంత మంది నటిస్తుంటే అసలు ఫీలింగ్స్ ఏ మాత్రం వుండవు. జయసుధ నటిస్తుంది అనడము కన్న నటనలో జీవించేస్తుంది అని చెప్పాలి. కుటుంబ చిత్రాలలో ఆమె నటన అద్భుతం. ఎంత క్లిష్టమైన పాత్రనైనా ఆమె ఛాలెంజ్‌గా నటిస్తారు. చీరలలోనే ఆమె నిండుగ వుంటారు, మోడరన్ డ్రస్‌లు ముందు ముందు ధరించకుండ వుంటే బాగుంటుంది. జయసుధ పేద పిల్లలకు స్కూల్స్ కట్టించి, తనకు తోచిన విధంగ పేదవారికి సహాయం చేస్తూ మంచి మనిషిగా ప్రజల ఆశీస్సులు అందుకోవాలి. కుటుంబ చిత్రాలలో నే ఇక ముందు నటించి ప్రేక్షకుల అభిమానాన్ని పొందాలి అని నా అభిలాష.

కొల్లి శ్రీదేవి, పండవీధి, భీమిలిపట్నం

★ ★ ★

అతి తక్కువ కాలంలోనే ఎన్నో చిత్రాలలో ఎంతో వైవిధ్యం గల నటన చూపిన సుహాసిని అంటే నాకు ప్రత్యేక అభిమానం. నాటి మంచు పల్లకి చిత్రం



నుంచి నేటి చిత్రాలన్నిటిలోని ఆమె నటన, అభినయం అద్భుతం. ఆమె నటించిన పాత్రలు అన్నీ చాలా సహజంగాను ఎంతో ఉన్నతంగాను ఉన్నాయి. "అది నటన కాదు ఆయా పాత్రల్లో ఆమె జీవించింది" అని అన్పిస్తుంది. శిక్ష చిత్రంలో సుహాసిని నటన చాలా అద్భుతంగా ఉంది. స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలను కళ్ళకు కట్టినట్టు చూపించే సినిమాయిది. ఎంతో బాగా నటించి ఆ పాత్రకు న్యాయం చేకూర్చింది. సుహాసిని నటనలో ఎంతో సహజత్వం వుట్టిపడుతుంది. హావభావాలు, డైలాగ్ డెలివరీ చాలా బాగుంటాయి. ఎంతో చలాకీగాను, అవసరమైతే అంత కంటే ఎంతో గంభీరం గాను నటించగలదు. గ్లామర్ చిత్రాలను కాక కథాబలం ఉన్న చిత్రాలలో మాత్రమే నటించాలని నాకోరిక. హీరోయిన్ ప్రాముఖ్యతగల చిత్రాలలో నటిస్తే బాగుంటుంది. అసభ్య వస్త్రధారణకు తావివ్వక శ్రద్ధతీసుకోవాలి. ఇంకా ఎన్నో మంచి చిత్రాలలో నటించి చలన చిత్రరంగంలో ఎంతో పేరు సంపాదించాలని మన సారా కోరుకుంటున్నాను.

—యిందుకూరి హేమనళిని, కూకట్‌పల్లి -హైదరాబాదు

నేను అందాలనటుడు శోభన్‌బాబు అభిమానిని. నాటి 'వీరాభిమన్యు' నుండి నేటి చిత్రాల వరకు తనకంటూ ఒక ప్రత్యేక స్థానం ఏర్పరుచుకొన్న క్రమశిక్షణా పరుడు శోభన్.

ఒక తల్లి కుమారుడిగా, పిల్లల యొక్క తండ్రిగా



ఒక చెల్లి యొక్క అన్నగా మమతానురాగాలు కురిపిస్తూ, తన సర్వాన్ని ధారపోయు నిస్వార్థపరుడిగా నటించుటలో ఆయనకు ఆయనే సాటి. ఇద్దరు భార్యల మధ్య నలిగే భర్తగా చక్కగా నటించగల నటుడు శోభన్.

శోభన్ యొక్క డైలాగ్ డెలివరీ కొంచెం ఫాస్ట్‌గా వుంటుంది. ఈ విషయాన్ని ఆయన గమనించాలి. ముందుగా చిత్రం యొక్క కథ విని, అది కుటుంబ కథా చిత్రమైతేనే అంగీకరించాలని నా మనవి.

శోభన్‌ను 'పరుశురాముడి' పాత్రలో చూడాలని నా ఆకాంక్ష.

—యం. డి. అమ్ముల్లా,
రంగనాయకులపేట, నెల్లూరు

★ ★ ★

వందేమాతరం" -"ప్రతిఘటన" సినిమాల ద్వారా నా అభిమానాన్ని దోచేసిన నేటి మేటి హీరోయిన్, "అందాల తార "కుమారి విజయశాంతి"

ఇప్పటికి నేను కొన్ని వందల సినిమాలు చూసి ఉంటాను. కాని "ప్రతిఘటన" నా ఆశయాలకు అనుగుణంగా ఉన్న సినిమా. దానిలో నా అభిమాన తార విజయశాంతి నటన సూపర్బ్-"ఆడది అబల కాదు సబల" అని నిరూపించిన బహుచక్కని, సందేశాత్మక సినిమా. ఈ రోజుల్లో వస్తున్న సినిమాలన్ని వ్యాపారాత్మకంగా ఉంటున్నాయి. అదే నా బాధ. అలా గాక సంవత్సరంలో కనీసం రెండు, మూడైనా ఇలాంటి మంచి సినిమాల్లో నటించి, ఇంకా మా అభిమానాన్ని చూరగొని "మహానటి" కావాలని, చెరగని ముద్రలా మా హృదయాల్లో నిలవాలని నా అభిమాన నటి విజయశాంతిగారిని కోరుతున్నాను. పాత్రల విషయంలో కథను ఎన్నుకోవడంలో ఇంకా శ్రద్ధ తీసుకుంటే మంచిదని,



దినదినాభి వృద్ధి పొందాలని నా ఆశ, ఆశయం.

—పోలోజు వెంకటాచారి,
హెచ్. సి. యల్. టౌన్‌షిప్; హైదరాబాదు



# సినిమా వి



ంలిం ఫిల్ములో సంపాదించిన బ్లాక్ మనీతో ఇల్లు కడితే ఇట్లా వుంటుంది.!

## ోభన్, మురళీమోహన్‌రావు తొలి ాంబినేషన్‌లో సత్యనారాయణ సమర్పించే "అడవి రాజా"

"మా 'ఇద్దరు దొంగలు' చిత్రాన్ని ఉగాదినాడె ాటల రికార్డింగ్‌తో ప్రారంభించాం. ఆ ఆనవాయిత ప్పకుండా ఈ ఉగాదినాడు 'అడవి రాజా' చిత్రానిఁ ారంభోత్సవం జరుపుతున్నాం. మా హీరో 'లిసారిగా ఫారెస్టు ఆఫీసర్ పాత్రను ధరిస్తున్నారు. ాటింగ్ ఏప్రిల్ 21 నుంచి. నాలుగు షెడ్యూల్స్‌లో ంతైకి షూటింగ్ పూర్తయిపోతుంది." అన్నారు కె. ాగేశ్వరరావు: ఈయన నిర్మాతగా కైకాల త్యనారాయణ సమర్పించే రమా ఫిలిమ్స్ వారి ఃడవి రాజా"లో శోభన్‌బాబు, రాధ, త్యనారాయణ, గిరిబాబు, నూతన్ ప్రసాద్, భాకరరెడ్డి, గొల్లపూడి, వేలు, వీరభద్రరావు, ుపతిరావు, శ్రీలక్ష్మి వగైరా తారాగణం. సత్యానంద్ ఃన, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, ప్కరరాజు శిల్పం, సలీం నృత్యాలు, నాగేశ్వరరావు-్యం కూర్పుతో ఈ చిత్రాన్ని డైరెక్టు చేసే కె. రళీమోహనరావు "మూడొంతుల షూటింగ్ సుమల్లై ఫారెస్టులో జరుగుతుంది." అని యచేశారు.

## 'నుచందర్‌తో సత్యారెడ్డి ్శకత్వంలో "హెచ్చరిక"

ఏప్రిల్, మే నెలల్లో మిగతా షూటింగ్ ్వుతుంది. ఔట్‌డోర్ షెడ్యూల్ ఊటీలో," ్నరు సినిమా రంగంతో పరోక్షంగా సంబంధ ధవ్యాలున్న ప్రముఖ ఫైనాన్షియర్ సి. ఎల్. నరసారెడ్డి. ఈయన సమర్పణలో ఈయన మిత్రులు ఎస్. ఓబులరెడ్డి, వి. ప్రభాకరరెడ్డి మార్చి చివరి వారం నుంచి నిర్మిస్తున్న శ్రీ సత్య శ్రీనివాస మూవీస్ "హెచ్చరిక" చిత్రానికి "ఢాకూ, రేచుక్క, దొంగదుమూతలు" వగైరా చిత్ర నిర్మాణంలో భాగస్వామి అయిన సత్యారెడ్డి తొలిసారిగా దర్శకత్వం వహిస్తున్నారు. భానుచందర్, శోభన, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, నూతన్‌ప్రసాద్, వేలు, మాడా, బేబీ శాలిని, అనూరాధ, శ్రీలక్ష్మి, గౌతమ్ నటిస్తున్నారు. గణేశ్‌పాత్రో మాటలు, ఆత్రేయ పాటలు, శివాజీ రాజా సంగీతం, దివాకర్ ఛాయ, పాండు - మోహన్ ప్రొడక్షన్, రవీంద్ర - రమేష్ సహకార దర్శకత్వం, కె. రామగోపాలరెడ్డి కూర్పుతో ఎస్. అశోక్‌కుమార్ ప్రొడక్షన్ కంట్రోలర్.

## విజయబాపినీడు దర్శకత్వంలో "బజారు రౌడీ"

"మార్చి 18 నుంచి 24, ఏప్రిల్ 4 నుంచి 12 వరకు రెండు షెడ్యూల్స్ పూర్తి చేశాం. చివరి షెడ్యూల్ మే 1 నుంచి 17 వరకు," అన్నారు విజయబాపినీడు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. ఎం. సుబ్బారాయుడు, గోపాలకృష్ణయ్య నిర్మిస్తున్న బాలబాలాజీ క్రియేషన్స్ తొలి చిత్రం "బజారు రౌడీ"లో భానుచందర్, కల్పన, సత్యనారాయణ, కన్నడ ప్రభాకర్, నూతన్ ప్రసాద్, బాలాజీ, పూర్ణిమ, వై. విజయ , అనూరాధ పాల్గొంటున్నారు. కాశీవిశ్వనాథ్ మాటలు, వేటూరి పాటలు, వాసూరావు

# వేషాలు

**-జి. వి. జి.**

సంగీతం, మహీధర్ ఛాయ, దిలీప్ సింగ్ శిల్పం, బాబూరావు రచనా సహకారం, మోహన్ దాస్ సహదర్శకత్వం, వెళ్ళస్వామి • కూర్పు, గుత్తా మధుసూదనరావు నిర్వహణ, శాయి నిర్మాణతతో సమర్పణ: వాసిరెడ్డి ఉమామహేశ్వరరావు.

## త్వరలో "మిస్ అనుపమ"

"ఒక ఆరితేరిన దొంగ ఒక కన్నె మనసును దోచుకున్నాడు. దాంతో ఎన్నో మలుపులు. తిరిగే ఈ






## "అత్తగారూ స్వాగతం"లో అశ్వని, భానుమతి

చిత్రం తమిళ మాతృక హిట్ అయింది. సుహాసిని, ప్రతాప్ పోతన్ పోటీపడి నటించారు," అన్నారు పి. జనార్ధన రెడ్డి. ఈయన సారధ్యంలో పి. రాజేశ్వరి నిర్మించిన సృజన మూవీస్ వారి పై చిత్రానికి వసంతకుమార్ రచన, ఎం. సి. శేఖర్ ఛాయ, గంగై అమరన్ సంగీతం , టి. ప్రభాకర్ నిర్మాణతతో భారతి- వాసు దర్శకత్వం నెఱపారు.

## అక్కినేని నాగార్జునతో జగపతి రాజేంద్రప్రసాద్ చిత్రం "కెప్టెన్ నాగార్జున్"

"రసవత్తరమైన ట్రయాంగిల్ లవ్ స్టోరి. నాగార్జున టేలెంట్సును బహిర్గతం చేసే పాత్ర. కొత్త హీరోయిన్ స్రవంతి కూడా ఎక్సలెంట్‌గా ఏక్ట్ చేస్తోంది. మార్చి 31 నుంచి ఏప్రిల్ 18 వరకు ఫస్ట్ షెడ్యూల్‌ను పూర్తి చేశాం. మే 7 నుంచి 30 వరకు విశాఖపట్నం, అరకులోయ, బుర్రాగుహలు, పాడేరు, సుజనకోట ప్రాంతాలలో ఔట్‌డోర్ షూటింగ్. చివరి షెడ్యూల్ జూన్ 15 నుంచి 30 వరకు," అన్నారు వి.బి. రాజేంద్రప్రసాద్. ఈయన కథ, స్క్రీన్‌ప్లే స్వీయ దర్శకత్వంలో నిర్మిస్తున్న జగపతి ఆర్ట్ పిక్చర్స్ వారి పై చిత్రంలో నాగార్జున, స్రవంతి, రాజేంద్రప్రసాద్, గొల్లపూడి, నూతన్ ప్రసాద్, శుభలేఖ సుధాకర్, వినోద్, శ్రీలక్ష్మి, డబ్బింగ్ జానకి, లక్ష్మీప్రియ నటిస్తున్నారు. ఆత్రేయ మాటలు, పాటలు రాశారు. చక్రవర్తి సంగీతం, నవకాంత్ ఛాయ, శంకర్ శిల్పం, ఎస్. సురేష్‌కుమార్ సహ దర్శకత్వం, రాజు సాహసాలు, ప్రకాష్ నృత్యాలు, అక్కినేని సంజీవి కూర్పు తెర వెనుక హంగులు.

# డైరెక్టర్ కె. రాఘవేంద్రరావు



ఎ.వి.ఎం. స్టూడియోలో "అపూర్వ సహోదరులు" చిత్రం తాలూకు సెట్ కళకళలాడుతోంది. ఎక్కడా ఏ మాత్రం టెన్షన్ లేకుండా షూటింగ్ పనులు చక చకా సాగిపోతున్నాయి. ఒకాయన ఆర్టిస్టులను మాంచి మూడ్స్‌లో ఉంచి, అందర్నీ ఉషారుగా నవ్విస్తున్నారు "ఆయనెవరండి?" అని అడిగాడు షూటింగ్ చూడ్డానికి వచ్చిన ఓ పెద్ద మనిషి.

"ఆయనే ఈ చిత్రానికి డైరెక్టరు. కె. రాఘవేంద్రరావుగారు," అని జవాబిచ్చారు ఆ షూటింగ్‌కు సంబంధించిన ఓ వ్యక్తి.

"ఆయనా డైరెక్టరు! సినిమా డైరెక్టర్‌లా లేరే?" అని చూడవచ్చిన ఆసామి ముక్కున వేలు వేసుకున్నాడు. డైరెక్టర్ అంటే దర్జాగా పోజు పెట్టి, అందరి మీదా కేకలేస్తూ ఆర్భాటం వేస్తూండాలని ఆ పెద్ద మనిషి అభిప్రాయం కావచ్చు. అందుకే "అరే! మనిషి ఎంత సింపుల్‌గా ఉన్నారు? మరి ఆయన చిత్రాలు అంత బ్రహ్మాండంగా ఉంటాయే! మీరు నమ్ముతారో లేదో- ఆయన ప్రతి చిత్రాన్నీ నేను ఒకటికి రెండుసార్లు చూస్తాను, సార్! మీరేం పొరబడడం లేదు కదా? నిజంగా ఆయనేనా సార్ సుప్రీమ్ డైరెక్టర్ కె. రాఘవేంద్రరావుగారు?" అని మళ్ళీ అడిగాడా ఆసామి.

నిజమే...

ఆయన ఎంత నిరాడంబరుడో ఆయన చిత్రాలు అంత ఆడంబరంగా ఉంటాయి. ఆయన నిర్మాతకు బరువు తగ్గిస్తాడు, చిత్రానికి పరువు పెంచుతాడు అందరి మెప్పే ఆయన ధ్యేయం. ఆర్థిక విజయమే ఆయన గమ్యం. ఆయన ఎంత ఎదిగినా- అహం ఏ మాత్రం పెంచుకోలేదు. పెంచుకున్న మంచితనాన్ని అందరికీ పంచి ఇచ్చే స్వభావం.

తండ్రి కె. ఎస్. ప్రకాశరావుగారు సుప్రసిద్ధ దర్శక నిర్మాత, స్టూడియో అధినేత అవడం వల్ల రాఘవేంద్రరావుకు బాల్యం నుంచీ సినిమా వాతావరణం ఎంతో నచ్చింది. అందుకని చదువును అలక్ష్యం చేయలేదు. మద్రాసు లయోలా కాలేజ్‌లో బి. యె.; చదువుకుంటున్నప్పుడో సారి "డిగ్రీ తీసుకుని ఏం చేస్తావ్? చదవు మానేసి వచ్చి నాకు కాస్త సాయంగా ఉండకూడదా?" అని అడిగారు ప్రకాశరావుగారు.

"ఎందుకైనా మంచిది... డిగ్రీ చేతికి రానివ్వండి", అన్న రాఘవేంద్రరావు ఒక శుభ ముహూర్తాన ఆ డిగ్రీని నాన్నగారికి చూపించి "ఇక సినిమాల్లో చేరిపోతాను," అన్నారు.

ప్రకాశరావుగారు ఎంతో సంతోషించి, చేరిపోనిచ్చారు.

ఫలానా శాఖ అని కాకుండా రాఘవేంద్రరావు చిత్ర నిర్మాణ రంగంలోని ప్రతి ఘట్టాన్నీ పరిశీలిస్తూ, అన్నీ తెలుసుకుంటూండేవారు. తరచు సినిమాలు చూస్తూ, తనకు తోచిన లోపాలేమైనా కనిపిస్తే, తండ్రిగారితో చర్చించేవారు. తండ్రిగారు రూపొందించే సినిమాలలో, సందేహాలకు తావిచ్చేవి ఎమైనా కనిపిస్తే, మొహమాట పడకుండా కుండబద్దలు కొట్టినట్లు చెప్పేసేవారు. తండ్రిగారు లోలోపలే ఎంతగానో సంతోషించేవారు.

కమలాకర కామేశ్వరరావుగారి దగ్గర "పాండవ



## తండ్రి కె.యస్.ప్రకాశరావు గారితో

వనవాసం" చిత్రానికి సహాయ దర్శకుడుగా పని చేశాక తండ్రిగారి వద్ద "స్త్రీ జన్మ, బందిపోటు దొంగలు, తాసిల్దారుగారి అమ్మాయి, భార్య, కోడెనాగు," చిత్రాలకు పని చేస్తున్నప్పుడు కథ, ట్రీట్‌మెంట్, టేకింగ్‌లలో ఎన్నో మెళుకువలు తెలుసుకున్నారు రాఘవేంద్రరావు. మధ్యలో "మనుషులు మారాలి" చిత్రానికి డైరెక్టర్ వి. మధుసూదనరావుగారి వద్ద కూడా కొంత కాలం పని చేశారు.

ఈయన ప్రతిభను గుర్తించి, ఈయనకు డైరెక్టర్‌గా తొలి అవకాశమిచ్చిన వారు "బాబు" చిత్ర నిర్మాతలు ఎ.వి.ఎం. సీజర్, ఎ.ఎల్. కుమార్‌గార్లు, ఆ తర్వాత క్రాంతి కుమార్ నిర్మించిన "జ్యోతి" చిత్రంతో మంచి గుర్తింపు తెచ్చుకున్నారు, "రాజా, అడవి రాముడు, ప్రేమలేఖలు, ఆమె కథ, అమరదీపం, సింహబలుడు, రాధాకృష్ణ, కేడి నెంబర్ వన్, డ్రైవర్‌రాముడు, వేటగాడు, నిండు నూరేళ్ళు, పదహారేళ్ళ వయసు, భలే కృష్ణుడు, మోసగాడు .." నుంచి "బొబ్బిలి బ్రహ్మన్న, అడవి దొంగ" వగైరా చిత్రాలెన్నింటిలోనో తన ప్రతిభను చూపి, జాతీయ అంతర్జాతీయ మార్కెట్లున్న హిందీ చిత్రాల స్థాయిలో తెలుగు చిత్రాలు కూడా వసూలు చేయగలవని నిరూపించిన బాక్సాఫీస్ పట్టు విడుపులు తెలిసిన చిత్ర బ్రహ్మ రాఘవేంద్రరావు.

"మీ దర్శకత్వంలో పౌరాణిక చిత్రం తయారవుతుందని ఆశించవచ్చా?" అని అడిగితే.

"వచ్చు... త్వరలోనే", అని సమాధానమిచ్చారు రాఘవేంద్రరావు.

ఈయని మితభాషి. హిత భాషి. పరనింద-ఆత్మస్తుతి అంటే ఏమిటో ఈయనకు తెలీదు.

అసలు పొగడ్తలంటే ఏ మాత్రం గిట్టదు.

అందుకని- ఆయన గుణ గణాల గురించి, ప్రతిభా విశేషాల గురించి తెలియజేయకుండా ఉండగలనా?

–(జి. వి. జి.)

వడ్డే శోభనాద్రి సమర్పించు

విజయ మాధవి పిక్చర్స్




దర్శకత్వం:
**కె. రాఘవేంద్రరావు** బి.ఏ.,

నిర్మాత:
**వడ్డే రమేష్**

నిర్వహణ:
**వడ్డే కిశోర్**

కథ-మాటలు: పరుచూరి బ్రదర్స్ పాటలు: వేటూరి సంగీతం: జె.వి.రాఘవులు

డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ: కె.యస్.ప్రకాష్ ఎడిటింగ్: జి.జి.కృష్ణారావు కళ: భాస్కరరాజు

VIJAYAMADHAVI ADS




# సినిమా

## శ్రీ రాజ్యలక్ష్మీ ఆర్ట్ పిక్చర్స్ 11వ చిత్రం

"దర్శకత్వ శాఖలో తనకు గల అనుభవాన్నంతా **శరత్** రంగరించి పోసి, పిక్చర్‌ని చక్కగా రూపు దిద్దుతున్నారు. మార్చి 20 నుంచి 30 వరకు మొదటి షెడ్యూల్‌ను పూర్తి చేశాం. ఏప్రిల్ 15 నుంచి మే 5 వరకు జరిగే తదుపరి షెడ్యూల్‌తో షూటింగ్ మొత్తం పూర్తయి పోతుంది," అన్నారు మిద్దె రామారావు. ఈయన నిర్మిస్తున్న తాజా చిత్రంలో సుమన్, భానుప్రియ, రాజేష్, కోట శ్రీనివాసరావు, వేలు, వీరభద్రరావు, శుభలేఖ సుధాకర్, పుచ్చా పూర్ణానందం, శ్రీలక్ష్మి నటిస్తున్నారు. సూర్యదేవర రామ్మోహనరావు కథకు సత్యానంద్ సంభాషణలకర్త. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. ఎన్. సుధాకరరెడ్డి ఛాయ, శాయికుమార్ శిల్పం, సలీమ్ నృత్యాలు, ఎన్. వెంకటేశ్వరరావు – ఉదయ్ ప్రొడక్షన్, డి. వెంకటరత్నం కూర్పుతో పోలవరపు శరత్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు. ఈయన ఇదివరకు పి. చంద్రశేఖరరెడ్డి, వి. రామచంద్రరావు, కె. ఎస్. ఆర్. దాస్ , లక్ష్మీదీపక్, పి. సాంబశివరావు , కె. వాసు ఎ. కోదండ రామిరెడ్డి , తాతినేని రామారావు మున్నగు సుప్రసిద్ధ దర్శకులవద్ద కృషి చేశారు. □

## ఇద్దరూ ఉద్యోగస్తులైతే



శ్రీమతి గీత, శ్రీ రఘునాధ్

# ఉద్యోగం నాకు తృప్తిని ఇవ్వలేదు!

చదువు పూర్తి కాగానే మార్గదర్శిలో సీనియర్ ఆడిటర్ అసిస్టెంట్‌గా చేరాను. కొంత కాలం పని చేసిన తరువాత బెంగుళూరు సూరజ్‌మల్ డైమండ్స్‌లో ఎకౌంట్స్ ఆఫీసరుగా చేరి, వారి చేత ప్రారంభించబడిన క్లాసిక్ కలర్ లాబ్ విజయవాడ బ్రాంచి మేనేజరుగా రెండేళ్ళు పని చేశాను.

ఈ ఉద్యోగాలతో విసుగు పుట్టింది. నాకు నేనుగా ఏదన్నా చెయ్యాలన్న తపన ప్రారంభమైంది ఉద్యోగం చేస్తూ ఎదుగూ బొదుగూ లేని జీవితం గడపాలన్న ఉద్దేశం నాలో అంతరించింది.

కొంతమంది మిత్రులతో కలసి వ్యాపారం చెయ్యాలన్న కృతనిశ్చయంతో 'ఫోటో ప్రింట్' అనే కలర్ లాబ్ హైదరాబాద్‌లో ప్రారంభించాము నేను వర్కింగ్ పార్ట్‌నర్‌గా, దానికి అనుబంధ సంస్థ 'ఫోటో కెమ్'కు మేనేజింగ్ పార్ట్‌నర్‌గా నా వ్యాపార జీవితం ప్రారంభించాను ఇప్పుడు చాలా హాయిగా స్వతంత్ర జీవితం గడుపుతున్నాను.' అన్నారు అరవముదన్ రఘునాధ్

పెళ్ళి చేసుకోవాలన్న ఉద్దేశం కలగనప్పుడు విపరీతంగా సంబంధాలు వచ్చినాయి. వ్యాపారంలో స్థిరపడ్డ తరువాత వివాహం చేసుకుందా మనుకున్నప్పుడు పిల్ల దొరకడం గగనమైపోయింది ఎట్టకేలకు, చిట్టచివరకు బొంబాయిలో దొరికింది అమ్మాయి!

ఏరికోరి ఉద్యోగం చేస్తున్న అమ్మాయినే చేసుకోవాలన్న రఘునాధ్ కోరిక నెరవేరింది

సెంట్రల్ ఎక్సైజు డిపార్ట్‌మెంటులో పని చేస్తున్న, గిత రఘునాధ్‌కు భార్య అయ్యింది

"నేను నా దృష్టంతా వ్యాపారాభివృద్ధి మీదే కేంద్రీకరించాను. అందుకు సహాయంగా ఇంటి బాధ్యతలు నిర్వహించడానికీ ఉద్యోగం చేసే అమ్మాయిని ఎన్నుకున్నాను!" అన్న రఘునాధ్ మాటకు 'నిజమే' అంటూ తలూపారు గీతా రఘునాధ్

'మా వారిలో అన్ని మంచి గుణాలే కానీ ఆలస్యంగా ఇంటికి రావడం ఒక్కటే నాకు నచ్చని గుణం! అందులోనూ కొత్తగా కాపురాని కొచ్చాను కదా! మరి బోర్ కొడుతోంది! అదేమిటని అడిగితే 'నేను చేసేది ఉద్యోగం అయితే ఐదింటికే ఇంటి కొచ్చేయవచ్చు కానీ వ్యాపారం కదా అనేక లావాదేవీలుంటాయి?' అంటారు అప్పుడనిపిస్తుంది ... వ్యాపారం కన్నా ఉద్యోగమే హాయి! అని! అన్నారు శ్రీమతి గీత!

"నెల జీతాలకు అలవాటు పడ్డ వారింతే! కాస్త వెనకేసుకోడానికి కష్టపడకపోతే ఎలా చెప్పండి?" అన్నారు రఘునాధ్!

"పిల్లల్ని కనడం ప్రస్తుతం వాయిదా వేస్తున్నాము మూడేళ్ళు గాప్ ఉంటే మంచిదని మా అభిప్రాయం!" అనే రఘునాధ్, గీతలు ఎప్పుడన్నా తీరిక దొరికితే సినిమాలు చూస్తారుట

'బొంబాయి లైఫ్‌కి హైదరాబాద్ లైఫ్‌కీ చాలా తేడా ఉంది అక్కడంతా ఫాస్ట్ ప్రక్కవారి గురించి పట్టించుకునే టైమ్ దొరకదు కానీ ఇక్కడ 'ఎవరెవరి విషయాలూ మనకే కావాలి' అన్నట్టుంటారు పైగా ఆడది ఉద్యోగానికి వెడుతోంది అంటే అదో రకం చులకన భావం కనిపిస్తోంది! ప్రస్తుత పరిస్థితులలో మొగుడూ పెళ్ళాలిద్దరూ సంపాదిస్తున్నా సరిపోవడం లేదు! అలాంటప్పుడు ఎందుకో ఈ భేషజాలు?' అన్నారు శ్రీమతి గీత

రఘునాధ్ మాతృభాష తమిళం అయినా పుట్టినప్పటి నుండీ హైదరాబాద్‌లో ఉండటం వలన చక్కటి తెలుగు, హిందీ మాట్లాడతారు శ్రీమతి గీత ఇప్పుడిప్పుడే తెలుగు మాట్లాడటానికి ప్రయత్నిస్తున్నారు త్వరగా నేర్చుకోవాలని ఆరాటపడుతున్నారు. అందుకనే ఎక్కువగా తెలుగు సినిమాలు చూస్తున్నారుట!

—కృష్ణాజీ

సీరియల్

# బలి కోరిన ప్రేమ

ఎం.డి.సౌజన్య

(గత సంచిక తరువాయి)

ఒక రోజు ఫేషన్ పెరేడ్‌లో పాల్గొనే ఆడ పిల్లల్లో పదిమంది ఒక్కసారిగా రాలేదు!

కారణం ఏమిటో తెలియదు!!

కాని ఆడపిల్లల్ని ఫేషన్ పెరేడ్‌కు సప్లయ్ చేసే బ్రోకరుమాత్రం బాగా కంగారుగా కనిపించాడు, జుట్టుపీక్కుంటూ.

"రోజూ వస్తున్నారుగదా అని యడ్వాన్స్ ముందుగా ఇస్తే అందరూ కట్టగట్టుకుని ఏదో పిక్‌నిక్‌కు వెళ్ళి తిరిగిరాలేదు! ఇప్పుడెలా?" అంటున్నాడు. బ్రోకర్

అతని కంగారు చూస్తే అన్నపూర్ణకు జాలివేసి-

"పోనీ! అనివార్య కారణాలవల్ల యివ్వాళ ఫేషన్ పెరేడ్ లేదని ప్రకటిస్తేనో?" అంది.

"నో నో! అలా కుదరదు!! ఫేషన్ పెరేడ్ చూడటానికే ఎక్కువమంది ఎగ్జిబిషన్ టిక్కెట్లు కొనివస్తున్నారు. ఇవ్వాళ ఎగ్జిబిషన్‌లో ఫేషన్ పెరేడ్ లేదంటే.... పెద్ద గందరగోళ మయిపోతుంది! పైగా రేపటి నుంచి అన్ని స్టాల్లు సేల్స్ పడిపోతయ్! ఈ ఫేషన్ పెరేడ్‌రోజు ఎరేంజ్ చేసింది, కేవలం ఎగ్జిబిషన్ స్టాల్స్‌లోని సేల్స్ పెంచుకోడానికో" అన్నాడు.

అన్నపూర్ణకు అతని బాధ అర్థమైంది కాని అలాంటి పరిస్థితిలో ఎవరుమాత్రం ఏం చేయగలరు?

ఇంతలో ఎగ్జిబిషన్ డైరెక్టర్ నుంచి ఫోన్ వచ్చింది. "ఫేషన్ పెరేడ్ ఎందుకు ఆలస్యం అవుతోంద"ని!

"ఫేషన్‌పెరేడ్ జరగటానికి అంతరాయం ఏర్పడిన సంగతి అప్పుడే డైరెక్టర్‌గారిదాకా వెళ్ళిందన్నమాట! అయితే అనుమానంలేదు.... నా ప్రత్యర్థులెవరో... నా బ్రోకర్ వృత్తిని దెబ్బకొట్టాలని... యీ ఫేషన్‌పెరేడ్‌లో పాల్గొనే అమ్మాయిల్ని నేను తీసుకురావటానికి వీలులేని పరిస్థితి కల్పించి.... నన్ను ఫూల్‌నిచేసి. నేను ఏమీచేతకానివాణ్ణని నిరూపించటానికి ప్రయత్నిస్తున్నారు!" అన్నాడు బాధగా.

అన్నపూర్ణకు పరిస్థితి అర్థమై "పోనీ!.... మీకు అభ్యంతరం లేకపోతే.. అన్ని డ్రెస్‌లు నేనే ఒకదాని తరువాత ఒకటి ధరించి ఫేషన్‌పెరేడ్ చేస్తాను!" అంది

ఆ పరిస్థితిలో అంతకంటే మంచి మార్గం లేకపోవటంవల్ల బ్రోకర్ సంతోషించినా, ఆమె ఎవరో తెలియకపోవటంవల్ల, ఫలితం ఎంతవరకుంటుందో ఊహించలేకపోయాడు.

అదే విషయం ఒక నావల్టీగా ప్రకటించాడు బ్రోకర్! నిముషాల్లో ఈ విషయం మైక్స్‌లో ప్రసారం చేయబడింది- ఎగ్జిబిషన్ గ్రౌండ్స్ అంతటా!! ఎవరూ ఊహించని విధంగా జనం ఆ రాత్రి ఫేషన్‌పెరేడ్ చూడటానికి తండోపతండాలుగా విరగబడ్డారు. ఆ గుంపుల అదుపుకు పోలీసులకు కష్టమైంది.

"జీవితంలో మళ్ళీ రంగస్థలం ఎక్కకూడదని, నటించకూడదని . నిర్ణయం తీసుకుని.. తప్పని పరిస్థితుల్లో మళ్ళీ నటిస్తున్నాను!" అనుకుంది, అన్నపూర్ణ అన్నపూర్ణ పూర్వాశ్రమంలో ప్రముఖ స్టేజీ నటీమణి అని తెలియటంతో బ్రోకర్ కూడా సంతోషించాడు.

ఈ విషయం తెలిసిన ప్రేక్షకులు, తమ అభిమాన నటీమణిని అలాగన్నా మరోసారి చూడబోతున్నందుకు సంతోషించారు

అందరూ ఊహించినదానికంటే అన్నపూర్ణ- తన నటనా ప్రతిభను ప్రదర్శిస్తూ ఒక్కొక్కభావాన్ని పలికిస్తూ వివిధ దుస్తుల్లో ప్రేక్షకుల్ని అలరించింది.

అన్నింటికంటే.... ఆమె పెండ్లికుమార్తెగా... నెత్తిమీద నుంచి ముఖమల్ మేలి ముసుగుతో జరీ జిలతారు డిజైన్ వున్న ఎర్రవాయల్ చీరెలో ప్రేక్షకుల్ని అద్భుతంగా ఆకట్టుకుంది.

"సిగ్గుపడుతూ . తడబడే అడుగులతో ప్రియునితో ప్రధమ సమాగమనం!" అంటూ మైక్‌లో ఇచ్చిన యనౌన్స్‌మెంట్‌కు తగినట్టుగా ఆమె హావభావాలు, ప్రేక్షక హృదయాల్ని పరవశింప చేసినయ్.

ఆమె మరోసారి... మరోసారి . అదే దుస్తుల్లో రావాలని ప్రేక్షకులు పట్టుబట్టి కోరారు.

ప్రేక్షకాభిరుచిని ఆమె మన్నించింది.

ప్రేక్షకుల కోరికపై ఒక పాట కూడా పాడింది.

ఆమె అంత బాగా పాడుతుందని తెలియని ప్రేక్షకులు మంత్రముగ్ధులై పోయారు

ఆ ఫేషన్ పెరేడ్‌కు ఆ రోజులు దుస్తులు సప్లయ్ చేసిన మఫత్‌లాల్, విమల్, కేసరి షోరూముల వాళ్ళు అక్కడే ఒక్కొక్కళ్ళు వెయ్యినూట పదహార్ల చెక్కులు యిచ్చారు- బహుమతిగా! చాలామంది అభిమానులు అయిదు, పది మేకప్ రూంలోకివచ్చి యిచ్చారు;ఆమెను అభినందిస్తూ. ఆమె వధువుగా కళ్ళు మిరుమిట్లు గొలిపేట్టు అందంగా వుండటంతో కలర్ ఫోటో కెమెరాలు క్లిక్ క్లిక్‌మన్నాయి.

చాలా రోజుల తరువాత మళ్ళీ అభిమానులు చుట్టుముట్టి ఆమెను అభినందించటంతో ఏదో అనిర్వచనీయానందం కలిగింది ఆమెకు!

అన్నేళ్ళ నిరుద్యోగ బాధ ఆమె మరచిపోయేట్టు చేసింది ఆ సమయంలో కలిగిన ఆనందంవల్ల!

ఆమె డబ్బు బేగ్‌లో పెట్టి బట్టలు సర్ది మేకప్ తుడుచుకుని బయలుదేరబోతుండగా 'హలో మిస్ అన్నపూర్ణా....!' హార్టీ కంగ్రాట్యులేషన్స్ ఫార్ యువర్ పర్‌ఫార్మెన్స్! ఇటీజ్ వెరీ లవ్‌లీ!" అంటూ ఓ యువకుడు కరచాలనం చేయటానికి చెయ్యి ముందుకు చాచాడు.

అన్నపూర్ణ అతని చెయ్యి అందుకోకుండా "మీ అభిమానానికి కృతజ్ఞతలు!" అంది చేతులు జోడించి కృతజ్ఞతలు చెబుతూ.

టెర్లిన్‌సూట్‌లో, ఆరడుగుల ఎత్తు, తెల్లటిరంగు కోలముఖం, విశాలమైన నుదురు, పట్టుదలను సూచించే కళ్ళు తల్వార్ మీసకట్టుతో.. చూపరుల్ని యిట్టే ఆకర్షించే అందమైన రూపమతనిది.

అన్నపూర్ణ చేతులు జోడించి నమస్కరించటంతో తనూ నమస్కరిస్తూ "మేకప్ భద్రయ్య చెప్పాడు మీరు నిరుద్యోగులని! మీ కభ్యంతరం లేకపోతే మా జనతా ఎంటర్‌ప్రైజెస్‌లో మీకు నెలకు వెయ్యిరూపాయలతో పాటు- అంతే ఎలవెన్సు వచ్చే ఉద్యోగం ఇస్తాను!" అన్నాడు.

**జరిగిన కథ-3:** ప్రఖ్యాత నటి అన్నపూర్ణను ఒక కోటీశ్వరురాలు తన కన్నకొడుకు ప్రాణాలు కాపాడమని వేడుకుంది. ఆ కోటీశ్వరురాలు కోరుతున్న పని నటనకు సంబంధించినది కాబట్టి అన్నపూర్ణ ఆమె అభ్యర్థనను ఒప్పుకోలేకపోతోంది. కోటీశ్వరురాలు రమాదేవి తన కొడుకు కాంతిభూషణ్ ప్రాణాలు కాపాడమని అభ్యర్థిస్తూ తిరిగి ఉత్తరం రాసింది భగ్న ప్రేమికుడు కాంతిభూషణ్ ప్రియురాలు అవంతిగా నటించడానికి అన్నపూర్ణ ఒప్పుకుంది రమాదేవితో కూడా కారు ఎక్కినప్పుడు గతం గుర్తొచ్చింది

అన్నపూర్ణకు ఒక నిముషం అతను చెప్పేమాట లేమిటో అర్థం కాలేదు!

"మీరు నామాటలు నమ్మినట్టు లేదు! నేను జనతా ఎంటర్ ప్రైజెస్ ప్రొప్రయిటర్ని! టర్నర్ సత్రం వున్న ప్రాంతలో మొన్నే నా సేల్స్ కౌంటర్ తెరిచాను! మీకు అభ్యంతరం లేకపోతే ,... రేపు ఉదయం తొమ్మిదింటికి నా షాపుకు రండి! ఆంధ్రా యూనివర్సిటీలో మాస్టర్ ఆఫ్ బిజినెస్ యడ్మినిస్ట్రేషన్ కోర్సు చదివి, పెనిసిల్వేనియా యూనివర్సిటీలో యడ్వాన్స్ ట్రయినింగ్ అయి, యూరప్ పర్యటించి వచ్చాను! ఇంత వరకు ఎవరూ ఇవ్వని విధంగా వినియోగ దారులకు కొత్త పద్ధతిలో సగంధరకే– ఫ్రిజ్, ఎయిర్ కూలర్, గ్రైండర్, మిక్సీ, లూనా, మోపెడ్, హీరో మెజెస్టిక్, టి. వి. యస్. 50, అలాగే..... సైకిళ్ళు, సోఫా కం బెడ్‌లు ...... ఏవి కావాలంటే అవి సగండబ్బు చెల్లించి– మరో ముగ్గురు సభ్యుల్ని చేర్చి వాళ్ళచేతా సగండబ్బు కట్టించగానే మొదటి సభ్యులు, ఇంకేడబ్బూ కట్టే పని లేకుండా శాశ్వితంగా వాళ్ళు ఏ వస్తువు కావాలని కోరారో అది ఇచ్చి వేస్తాము! ఇలా ఇవ్వటం ఎలా సాధ్యమో .. అదే సీక్రెట్!!" అన్నాడు నవ్వుతూ అన్నపూర్ణ వైపు చూస్తూ.

"మగవాళ్ళు ఇంత అందంగా నవ్వుతారా? " అనుకుంది అన్నపూర్ణ, అతని రూపానికి ముగ్ధురాలవుతూ

"అతని కళ్ళల్లో మాటల్లో చూపుల్లో ఎదుటి మనిషిని కట్టి పడవేసే ఆకర్షణ ఏదో వుంది!" అనుకుంది అన్నపూర్ణ

"ఎక్కడి దాకా వెళ్ళాలి!?" అడిగాడతను.

"నేను అప్‌లాండ్ వెళ్ళాలి! మాయిల్లు చాలా దూరం లెండి!...." అంది అన్నపూర్ణ.

"నేను డాబాగార్డెన్ ఏరియాలో వుంటున్నాను! నా అంబాసిడర్ కారుకు అదంతదూరం కాదులెండి! కమాన్ లిఫ్ట్ యిస్తాను!" అన్నాడు తనే ముందు కారువైపుకు నడుస్తూ.

అతని మాట తీరు చూస్తే బాగా కలుపుగోలు మనిషిలా కనిపిస్తున్నాడు.

అయితే అంత తక్కువ పరిచయంలోనే అలా అల్లుకు పోయినట్టు– ఎంతో చనువు ప్రదర్శిస్తున్న యీ యువకుడెలాంటి వాడో .... ?! అనుకుంది అన్నపూర్ణ కాస్త సంశయిస్తూ.

ఆమె మనసులో భావం అర్థమైనట్టు ఆ యువకుడు నవ్వి "మగవాళ్ళతో సమానంగా ఆడ వాళ్ళు చంద్రమండలానికి వెళ్ళటానికి ముందడుగు వేస్తున్న యీ రోజుల్లో – తోటి మనిషనే గౌరవంతో లిఫ్ట్ యిస్తాను రమ్మంటే సంశయిస్తున్నారా?" అన్నాడు మాటల్లో వ్యంగ్యం ఉట్టి పడేట్టు.

ఆ మాటలతో అన్నపూర్ణ యింకా సంశయించకుండా అతని వెంట నడిచింది.

"ఇతను పెద్ద మానసిక శాస్త్ర వేత్తలా ఉన్నాడు? పరుల మనసులో ని



## బలికోరిన ప్రేమ

భావాలూ ఇట్టే చదివేస్తున్నాడు!" అనుకుంది అన్నపూర్ణ కారు వద్దకు చేరుతూ.

"రండి ! ఫ్రంట్ సీట్‌లో కూర్చోవాలి! యు ఆర్ మై గెస్ట్!" అన్నాడు అన్నపూర్ణ వెనక సీటులో కూర్చునే అవకాశం ఇవ్వకుండా.

అన్నపూర్ణ ఇక సంశయాలు విడిచి పెట్టి కారెక్కింది.

"మీరు రేపు వచ్చేట్లయితే చెప్పండి రేపే మీకు చెప్పిన పోస్టుకు ఇంటర్వ్యూలు జరుపుతున్నాను!" అన్నాడతను.

"నేను ..... మీరు చెప్పిన పోస్టుకు తగిన అభ్యర్థినే అని ఎలా అనుకుంటున్నారు?" అంది అన్నపూర్ణ. ఆమెకు అతన్ని పరీక్షించాలనిపించింది.

ఎప్పుడూ నవ్వుతున్నట్టు ఇతరులను ఆకర్షించే కళ్ళు –– నవ్వితే సొట్టలు పడే బుగ్గలు – గుండ్రటి ముఖం – పసిమిఛాయ, పెద్ద కళ్ళు– అందమైన ఎఱ్ఱటి చిన్న పెదాలు..... ఇలా ఆడవాళ్ళకే ఈర్ష్య కలిగించే రూపం మీది! అందమైనమ్మ చిక్కినా అందమే అనే సామెత ఉందికదా! నా బిజినెస్‌కి అందమైన అమ్మాయిలు ఒక పెద్ద ఎసెట్! పైగా కస్టమర్స్‌ను ఆకర్షించటానికి, వాళ్ళతో చనువుగా మాట్లాడటానికి – వాళ్ళకు కావలసిన వస్తువు అంటకట్టడం కాదు బిజినెస్.. .! మన దగ్గర అమ్ముడు పోని వస్తువును వాళ్ళకు అంటగట్టే . ఓర్పు – నేర్పు– మెళకువ వుండాలి! అది మీ వంటి మంచి నటి దగ్గర పుష్కలంగా ఉందని నా దృఢ విశ్వాసం! నా అంచనా తప్పవటం అంటూ జరగదు?" అన్నాడు.

అతని మాటల్లో కనిపించకుండా అంతర్లీనంగా వున్న ఆ పొగడ్తకు అన్నపూర్ణ మళ్ళీ యింకో ప్రశ్న వేయలేక పోయింది.

ఇతను ఎవరిని ఏ మాటలతో ఎలా ఆకట్టుకోవాలో క్షుణ్ణంగా తెలిసిన సవ్యసాచి!– అనుకుంది అన్నపూర్ణ.

"నేను "సీషోర్" హోటల్లో భోంచేస్తాను! అది మీ అప్ లాండ్స్‌కు దగ్గరగానే వుంది గదా ...!! రండి భోజనం చేద్దాం!" అన్నాడతను

అన్నపూర్ణ అతన్ని వారిస్తూ, "సారీ! మా అమ్మ నా కోసం ఇంటి దగ్గర ఎదురు చూస్తుంటుంది!" అంది.

"మీ అమ్మగారికి నేను సారీ చెప్పి.... మీ ఆలస్యానికి కారణం కూడా వివరంగా చెబుతాను! కమాన్.... అన్నం పరబ్రహ్మ స్వరూపం... వద్దనకూడదు! అయినా యింత రాత్రి ఇంటి కెళ్ళి ఆమెగారిని ఇబ్బంది పెట్టడం మాత్రం ఏం బాగుంటుంది!" అన్నాడతను.

అతను ఎదుటి వ్యక్తి మళ్ళీ నోరెత్తే వీలు లేకుండా మాట్లాడుతున్నాడు.

అన్నపూర్ణకు ఇంకా అతని కెలా చెప్పాలో తోచలేదు! ఆమె ఓడి పోయింది!!

ఇంతలో కారు హోటల్ సీషోర్ లోపలి కెళ్ళి పార్కింగ్ సెంటరులో ఆగింది.

"రూఫ్‌గార్డెన్ మీల్స్ బాగుంటాయి. కమాన్!" అన్నాడా యువకుడు ముందుకు దూసుకు పోతున్నట్టు నడుస్తూ.

మంత్రించినట్టు అన్నపూర్ణ అతని వెంట నడిచింది.

లిఫ్ట్‌లో రూఫ్‌గార్డెన్‌కి చేరాక అక్కడున్న జంటల్ని చూసి ఆశ్చర్యపోయింది అన్నపూర్ణ.

ఒక్కో టేబిల్ చుట్టూ ఒక్కో జంటే ఉన్నారు.

నైట్ గౌన్స్ ధరించి కొందరు, బికినీలలో కొందరు, శారీస్ ధరించి కొందరున్నా.... అంతా "హాట్" డ్రింక్స్ పుచ్చుకుంటూ.... సిగరెట్స్ కాల్చుతూ కనబడటం ఆమె కెంతో ఆశ్చర్యం కలిగించింది.

"మీది టేబుల్ నెంబర్ 13 సార్! ఈ ప్రక్కనే వుంది.... రండి!" అన్నాడు సూపర్‌వైజర్.

అతను చెప్పిన తీరునుబట్టి, "ఇతను రోజూ ఆనవాయితీగా యిక్కడి కొస్తాడల్లే వుంది! అందుకే రోజూ ఇక్కడొక టేబుల్ ఎప్పుడూ సిద్ధంగా వుంటుంది కాబోలు!" అనుకుంది అన్నపూర్ణ.

ఇంతలో గాగుల్స్ ధరించిన ఒక అమ్మాయి దగ్గరి కొచ్చి "మీకు కంపెనీ కావాలా సార్!" అంది.

"నో .... సారీ!" అన్నాడతను అన్నపూర్ణ వైపు చూసి చిరునవ్వుతో.

రెండు బాంబే మీల్స్ ఆర్డరిచ్చాక, "ఇదిగో నా అడ్రసు.... రేపు ఇంటర్వ్యూకు పెద్ద క్యూ వుంటుంది.... ఈ కార్డు చూపండి.... మీకు నా గదిలో కి డైరెక్ట్‌గా ప్రవేశం లభిస్తుంది!" అన్నాడు ఒక విజిటింగ్ కార్డు ఇస్తూ–

దానిమీద "రవికాంత్– ఎమ్. బి. ఏ; ప్రొప్రయిటర్– జనతా ఎంటర్ ప్రయిజెస్– విశాఖ" ఫోన్ నెంబర్– జనతా గ్రామ్స్–" అన్న విషయాలు చదివి తెలుసుకుంది.

"హలో రవికాంత్‌గారు– "బెల్లీ డాన్స్– కమ్– స్ట్రిప్పింగ్" కోసం మేమంతా ఆర్డర్ చేశాం . విత్ యువర్ కైండ్ పర్మిషన్ . .!" అన్నాడొక యువకుడు.

"ప్రొసీడ్.. విత్ ప్లజర్!" అన్నాడు రవికాంత్.

వెంటనే లైట్స్ డిమ్ అయ్యాయి

చుట్టూవున్న ప్రాంత మంతా చీకటయ్యింది.

నలుగురు ఒక స్టేజీలాంటి దాన్ని నెట్టుకొచ్చారు. దానిమీద పైనుంచి నాలుగు వైపులా ఫోకసింగ్ లైట్లు కళ్ళు మిరుమిట్లు గొలిపేట్లు పడుతున్నాయి.

అందంగా అంగాంగం తీర్చి దిద్దినట్లున్న ఇద్దరు యువతులు మెరపు తీగల్లా స్టేజీమీద కొచ్చారు. నడుము చుట్టూ– వక్షస్థలం చుట్టూ కొద్దిపాటి నల్లటి సిల్కు గుడ్డలు తప్ప– దాదాపు అంతా నగ్నంగానే వున్నారు.

ప్రక్కనే వున్న మ్యూజిక్‌కు తగ్గట్టు నృత్యం చేస్తూ శరీరంలో అంగాంగం తమాషాగా వూగిస్తూ నృత్యం చేస్తున్నారు, కళాకారిణులు.

"ఈ నృత్యంలో అంత ఎంజాయ్ చేయటాని కేముంటుందో!?.... అందుకే లోకోభిన్న రుచిః– అంటారు!"– అనుకుంది అన్నపూర్ణ.

ఆ రమణీమణుల నృత్యానికి తన్మయత్వం చెందిన కొందరు యువకులు– యువతులు– పరిసరాలు మరచి నృత్యం చేస్తున్నారు. అప్పటికే వాళ్ళు తాగిన మత్తువల్ల కొద్దిగా తూలుతున్నా వాళ్ళు చుట్టూ ఏం జరుగుతోందో ఎవరెవరు అక్కడున్నారో.... అదెలాంటి సభ్యతో పట్టించుకోవటం మానివేశారు.

ఇంతలో మ్యూజిక్‌లో మార్పొచ్చింది.

స్టేజీమీదున్న ఇద్దరు స్త్రీలు వంటినున్న ఆ కాస్త వలువలూ వదలి చాల జుగుప్స కలిగేట్టుగా అభినయించ సాగారు. చుట్టూవున్న జనం ఈలలు, చప్పట్లు– హుర్రే.... హుర్రే.... అన్న అరుపులు సాగించారు.

అన్నపూర్ణకు ఆ వాతావరణం అసహ్యమనిపించింది.

"నాగరికత వెర్రితలలు వేసినా.... ఇంత హీనమైన పనులు చేసేస్థాయికి దిగ జారిపోవటం చాలా ఘోరం" అనుకుంది.

"ఇప్పుడు మా ప్రోగ్రాంలో హైలైట్ అయిన అయిటమ్ చూస్తున్నారు. యువజంటలు ఎవరైనా పాటలు పాడేవారుంటే స్టేజీమీదకు వస్తే.... మా మ్యూజిక్ గ్రూప్ మ్యూజిక్ అందిస్తుంది!"– అన్న గొంతు వినపడింది మైక్‌లో.

ఎవరో ఇద్దరు స్టేజీ ఎక్కి ఇంగ్లీషులో బూతర్థం వచ్చే పాటలు పాడటం మొదలు పెట్టగానే– చీకట్లో చుట్టూవున్న వాళ్ళు చప్పట్లు చరుస్తూ ఆ పాటలే రిపీట్ చేస్తున్నారు!





# తల్లి పాలు బిడ్డకు అన్నిటికీ మించిన పోషకాహారమేకాక ఎంతో మానసిక సంతృప్తిని కూడా కలుగచేస్తాయి

తల్లిపాలు తాగటం వలన మాతా శిశువుల ఆత్మానుబంధం ఎంతో దృఢతరమవుతుంది. తల్లి ప్రేమను బిడ్డకు పంచి పెట్టేందుకు యిదే ప్రకృతి సిద్ధమైన పద్ధతి. శిశువు సంతోషంగా సంతృప్తిగా పెరిగేందుకు దోహద పడుతుంది.

కేవలం తల్లిపాలు మాత్రమే బిడ్డకు కావలసిన పోషకాహారాన్ని, సమపాళ్ళలో అందించ గలుగుతాయి.



**మీ బిడ్డను, మీ చనుపాలతోనే పెంచండి. అదే ప్రకృతి నిర్దేశించినది, మీ శిశువుకు కావలసినది.**

కాని ఏదైనా అనుకోని ఇబ్బంది వచ్చినపుడు, అంటే ఏదైనా జబ్బు చేసినప్పుడో, పాలు సరిపడనప్పుడో విజయ స్ప్రేను వాడండి – చక్కగా పరీక్షించబడిన నమ్మకమైన శిశు ఆహారం. మీ బిడ్డ ఆరోగ్యం కాపాడడానికి డబ్బా మీద వ్రాసిన సూచనలను క్షుణ్ణంగా చదివి, అమలు పెట్టండి.

**శిశు సంరక్షణ కొరకై, విజయ స్ప్రే తయారీ దారులైన ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి సహకార సమాఖ్య వారిచే విడుదల చేయబడినది.**

AKSHARA 15986 APDDCFL (Tel)

## బలికోరిన ప్రేమ

"ఇందాకటి నగ్న నృత్యంకంటే ఈ పాటే బాగుప్స కలిగిస్తోంది! ఇంగ్లీషులో ఇంత బూతుపాట వుంటుందనుకోలేదు!"– అన్నపూర్ణ మనసు బాధతో మూల్గింది.

"అసలు ఈ రవికాంత్‌తో ఇక్కడికి రాకుండా వుండవలసింది!" అనుకుంది అన్నపూర్ణ. ఆమె అక్కడ తానిక కూర్చోలేననుకుంది. అసహనంగా లేచి నిలబడి, "నాకు పొద్దు పోతోంది!" అని చెప్పాలనుకుంది.

"ఇంకో కొసమెరపు అయిటమ్ వుంది....!" అన్నాడు రవికాంత్.

"నౌ.... జంటిల్‌మన్.... మా డ్యాన్స్ లాస్ట్ అయిటమ్ క్రింద డాన్సర్స్‌ని అందమైన సీతాకోకల్లా చూపబోతున్నాము!".... ఎంజాయ్ చేయండి!!" అన్న గొంతు వినిపించింది.

అంతవరకు వున్న లైట్లు స్టేజీమీద వెలిగి– ఆరి మళ్ళీ వెలిగాయి!!

ఇద్దరు రబ్బరు బొమ్మల్లాంటి యువతులు మర్మాంగాలమీద ప్లాస్టిక్ రబ్బరుతో చేసిన అందమైన సీతాకోక చిలుకల బొమ్మలతో ప్రేక్షకులకి దర్శనం ఇచ్చారు. ఆ సీతాకోక చిలుక బొమ్మలు వాళ్ళ శరీరాల మీద చిత్రించినట్టుగా అతుక్కుపోయి వున్నాయి.

"ఇప్పుడు ఎవరైనా స్టేజీమీద కొచ్చి ఈ సీతాకోక చిలుకల్ని స్ట్రిప్‌చేసి అందరికీ ఆనందం కలిగించండి!! యువకులు మాత్రమే ప్లీజ్!!" అన్న గొంతు వినిపించింది– మైక్‌లో.

చాలామంది యువకులు– వారితో పాటు యువతులు కూడా స్టేజీమీదకు మిడతల దండులా ఎగబడ్డారు....!!

అన్నపూర్ణ ఆ దృశ్యాల్ని చూడలేక కళ్ళు మూసుకుంది.

అయినా యిలాంటి నీచమైన పనులు చూస్తూ.... చేస్తూండటానికా ఇంత మంది ఇక్కడ రూఫ్‌గార్డెన్ అంటూ చేరారు....!! ఛీ!.... ఛీ!.... ఈ రవికాంత్‌తో వచ్చి పొరపాటు చేశాను!! ఇలాంటి అభిరుచు లున్నవాడు.... మంచివాడయి వుండటానికి అవకాశం లేదు!!– అనుకున్నది. ఇంతలో చప్పట్లతో ఆ ఘోర కార్యక్రమం ముగిసింది.

"డాన్స్‌ప్రోగ్రాం అయిపోయింది! జస్ట్ వన్‌మినిట్.... మీల్స్ తీసుకునే వెళదాం!" అన్నాడు.

"అనవసరంగా మొహమాటపడి వచ్చి యిరుక్కుపోయానే!" అనుకుంది అన్నపూర్ణ.

లైట్లు అన్ని యధాతథంగా వచ్చేశాయి!

అక్కడ అంతవరకు ఏమి జరగనట్టు అంతా మళ్ళీ ప్రశాంత వాతావరణం వచ్చేసింది

అంతమంది చుట్టూ త్రాగుతున్నా.. తనుమాత్రం కేవలం రెండు కోకో కోలా మాత్రమే ఆర్డరిచ్చిన రవికాంత్‌ను చూస్తే అన్నపూర్ణకు ఆశ్చర్యం వేసింది!! పైకార్యక్రమాల్లో అతను పాల్గొన లేదు!

అతను అసలు సిగరెట్ కూడా ముట్టించక పోవటం ఆమెకు మరింత విస్మయాన్ని కలిగించింది

"మరి ఏ వ్యసనాలూ– చెడ్డ అలవాట్లు లేని ఈయనకు యీ వాతావరణంలో పుట్టి పెరిగిన స్నేహితులు ఇందరు ఎలా లభించారు?" అనుకుంది ఆమె

"బాబే మీల్స్ చెప్పాను.. మీకు అభ్యంతరం లేదుగదా!? అయామ్ ఏ వెజిటేరియన్!" అన్నాడు రవికాంత్.

"నేనూ అదే! డ్రింక్స్.... పుచ్చుకోవటం అలవాటు లేదా.... లేక.... కొత్త వ్యక్తి ఎదురుగా వుండటంచేత....!?".... అడిగింది అన్నపూర్ణ.

"నో నో!! అయామ్ ఎ టీటోటలర్! మా అమ్మా నాన్నా బాగా ఆర్థొడాక్స్ పీపుల్! ఎంత కాదన్నా వాళ్ళు పెంచిన వాతావరణం వల్ల నేను ఏ బలహీనతలకూ బానిస కాలేదు!" అన్నాడు నవ్వుతూ

మీల్స్ పూర్తికాగానే టేబుల్‌మీద ప్లేటులో వంద రూపాయల నోటువేసి

లేసూ, "సారీ! నా వల్ల మీకు లేటయ్యింది....!! ఇంత ఆలస్యం అవుతుందనుకోలేదు!" అన్నాడు కారు వైపుకు నడుస్తూ.

"ఇక్కడికి మీరు తరచు వస్తుంటారనుకుంటా?" అడిగింది అన్నపూర్ణ.

"ఔను! బ్రహ్మచారిని గదా? ఇదేనా కాస్త రిలీఫ్ ఇచ్చే కాలక్షేపం....!! పైగా అక్కడ కనిపించిన వాళ్ళల్లో అధికభాగం.... మా కంపెనీ ఏజెంట్స్!"

"ఆడ మగా కూడానా....!?"

"ఔను! ఇప్పటికే ఆడవాళ్ళు ఓ పాతిక మంది.... మగవాళ్ళు ఓ పాతిక మంది ఏజంట్సుగా పని చేస్తున్నారు!" చెప్పాడతను.

"మరి ఇంకా రేపు ఇంటర్వ్యూ లేమిటి?"

"ఏజెంట్స్ రెండు రకాలు– ఇంటింటికి తిరిగి మా కంపెనీ స్కీమ్స్ వివరించి చెప్పేవాళ్ళు! వాళ్ళకు జీతంతో పాటు కొంత కమిషన్ కూడా లభిస్తుంది! ఇక సేల్స్ ప్రమోటర్స్ అని రెండో రకం! వీళ్ళు షోరూమ్స్‌లో వుండి వచ్చిన కస్టమర్లకు కావలసిన అయిటమ్స్ అమ్మటంలో నచ్చ చెప్పి మా కంపెనీకి ఎక్కువ లాభం కలిగేట్టు చూస్తుంటారు! ఇందాక మనం హోటల్స్‌లో చూసింది ఇంటింటికి తిరిగి మా కంపెనీ అయిటమ్స్ అమ్మటానికి సాయం చేసేవాళ్ళు! రేపు ఇంటర్వ్యూలు సేల్సు ప్రమోటర్స్‌కి....!" అన్నాడు.

ఇంతలో కారు హారన్ విని అన్నపూర్ణ తల్లి వీధిలోకి వచ్చింది.







అర్థం చేసుకున్నాడతను.

"రండిబాబూ! కూర్చోండి!" అంది రాజేశ్వరి.

అతను కూర్చొని గోడకున్న పటాలు చూస్తూ–

"మీవంటి– అన్నపూర్ణవంటి మంచి నటీమణుల్ని .... వాళ్ళ సేవల్ని..... వాళ్ళ కళాప్రతిభను సక్రమంగా వినియోగించుకో లేక పోవటం మన ఆంధ్రుల దురదృష్టం!" అన్నాడు గోడకున్న వివిధ సన్మాన పత్రాలు పరికిస్తూ.

"ఇవన్నీ ఎవరిక్కావాలి బాబూ ఈ రోజుల్లో! కళాసేవే లేదు! అంతా కాసుల సేవే!" అంది రాజేశ్వరి.

అన్నపూర్ణ యీమధ్య స్టేజీమీద నటించటం లేదని... ఏదైనా ఉద్యోగం చేయటానికి అన్వేషిస్తోందని తెలిసి.... మా కంపెనీలోనే ఉద్యోగం లోకి చేరమంటున్నాను! ప్రారంభంలోనే నెలకు వెయ్యి రూపాయలు జీతం, వెయ్యిరూపాయలు ఎలవెన్సు క్రింద లభిస్తాయి, తరువాత సేల్స్ ప్రమోషన్‌ను బట్టి కమిషన్ కూడా వుంటుంది! రేపే ఇంటర్వ్యూ .... మీరు అన్నపూర్ణను తప్పక పంపండి!" అన్నాడు లేచి నిలబడి.

"అదేమిటి బాబూ.... కాస్త కాఫీ అయినా తీసుకోకుండా?" – అంది రాజేశ్వరి.

"పర్వాలేదమ్మా! అయినా..... ఇప్పుడేగా భోజనం చేశాను.... అన్నపూర్ణ గారితో!" అన్నాడు, రవికాంత్.

రాజేశ్వరికి– తన కూతురికి తప్పక ఉద్యోగం దొరుకుతుందన్న ఆశ దృఢపడటంతో ఎంతో ఉత్సాహం వచ్చి" వస్తుండండి బాబు!!.......

అమ్మా అన్నపూర్ణా....' బాబుగారు చెబుతున్నారు గదా. .. రేపు తప్పక ఇంటర్వ్యూకి వెళ్ళు!" అంది.

ఉద్యోగం ఇచ్చే వ్యక్తే స్వయంగా వచ్చి ఇస్తానంటే– ఉద్యోగం అవసరమున్న వ్యక్తి ఆనందం ఎలావుంటుందో.... అన్నపూర్ణ పరిస్థితీ అలాగే వుంది.

"అలాగేనమ్మా!" అంది, రవికాంత్‌కు వీడ్కోలు చెబుతున్నట్లు సాగనంపటానికి వచ్చి.

"మీరూ అమ్మాయితో పాటు రండి!" అన్నాడు రవికాంత్.

"గుడ్‌నైట్..... స్వీట్‌డ్రీమ్స్!" అంది అన్నపూర్ణ మెల్లిగా గొణిగినట్టు.

"ది సేమ్ టుయూ!" అన్నాడు రవికాంత్ చిలిపిగా అన్నపూర్ణ వైపు నవ్వుతూ చూస్తూ.

జీవితంలో మొదటి సారి అన్నపూర్ణ వళ్ళు గగుర్పొడిచినట్లనిపించింది.

ఏదో సిగ్గు తెరలు ముంచుకొచ్చినట్లు, గుండెలు దడదడ మంటూన్నట్లనిపించి "ఈ ఆకర్షణ – ఈ వాలు చూపులేనా ప్రేమంటే!" అనుకుంది మంచం మీద వాలిపోయి తియ్యటి కలలు కంటూ.

కారులో దిగిన కూతుర్ని చూసి "ఏమమ్మా! ఇంత ఆలస్యమైందేమ్మా!" అంది.

రవికాంత్ ఆమె మాటలకు సమాధానంగా "నేను జనతా ఎంటర్ ప్రయిజెస్ ప్రొప్రయిటర్ని.....!" అంటూ చెబుతుండగానే–

"టర్నర్ సత్రం దగ్గరున్న షాపేగా.... కొత్తగా పెట్టారు.... ముగ్గురు సభ్యుల్ని చేర్పితే ఏ వస్తువైనా సగం ధర చెల్లించగానే ఇస్తారు!" అంది ఆనందంగా.

"ఔను! చూశారా అన్నపూర్ణగారూ.... మీ అమ్మ గారికి తెలిసిన విషయాలు మీకు తెలియలేదు!" అన్నాడు నవ్వుతూ.

అన్నపూర్ణకూ ఆశ్చర్యం వేసింది తల్లి మాటలకు.

"రండి బాబూ! కాఫీ తీసికెళుదురు గాని!" అంది అన్నపూర్ణ తల్లి.

"ఈమె మా అమ్మ..... రాజేశ్వరి!!.... ఒకప్పటి సంగీత నాటకాల నటి!" చెప్పింది అన్నపూర్ణ.

రవికాంత్ ఆమెకు నమస్కారం చేస్తూ "మీ వంటి మహానటి కుమార్తె కాబట్టే.... అన్నపూర్ణగారు ఇంత ప్రతిభావంతురాలైంది!" అన్నాడు ఆమె వెంట ఇంట్లోకి నడుస్తూ.

లోపల ఇద్దరు మాత్రమే పడుకోవడానికి వీలున్న పాత పందిరి మంచం– రెండు కుర్చీలు– ఒక పాతబల్ల చూసి వాళ్ళెంత పేదరికంతో గడుపుతున్నారో

(ఇంకా ఉంది)

# వారఫలం

## 25-4-1986 శుక్రవారం మొదలు 1-5-1986 గురువారం వరకు

★ **మేషం:** వారమంతా బాగా కృషి చేయక తప్పదు. అందువలన సత్ఫలితం అందుకోక తప్పదు. మీది భారీ వ్యాపారం గదా! అలాంటప్పుడు ఎంత కృషి చేయాలి, ఎంత జాగ్రత్తగా వ్యవహరించాలి. పరులకు యివ్వ తగినంత డబ్బు అందక యిబ్బందిపడటం కూడా గమనిస్తారు. స్త్రీలకు: వస్తు, వస్త్ర, నగలు సేకరించుటకు అనుకూలమైన వారం.

★ **వృషభం:** ఉత్తమమైన వారఫలాన్ని అందుకోనున్నారు మీ కృషి వ్యర్థం కాకపోవటం గమనింపనున్నారు. బంధుమిత్ర సహాయం అందుకోనున్నారు. రాజకీయంగా ఏదో అనుకూలం పొందనున్నారు. స్త్రీలకు: వ్యవహారమందు, ఉద్యోగమందు పెద్దగా అనుకూలించదని గ్రహించాలి.

★ **మిధునం:** ఆదాయ మందు అభివృద్ధి, ఆరోగ్యమందు వృద్ధి, చెప్పదగిన సమయం కొందరకు సాహితీరంగాన వికాసం చెప్పదగిన సమయం. మాటకు గౌరవం పెరగటంవిశేషం గౌరవాఢ్యుల స్నేహం కూడా లభ్యం కాగలసమయం స్త్రీలకు: సుఖశాంతులు, ఆరోగ్యమందువృద్ధి, ఆదాయమందభివృద్ధి.

★ **కర్కాటకం:** పరుల కొరకు పాటుపడక తప్పదు. అయినా పేరుప్రతిష్ఠలు రాగలవనుకోవటం పొరపాటు. శ్రమించక తప్పని వారం. మాటకు విలువలేక పోవటం కూడా గమనించగలుగుతారు. పదిమందిలో పెద్దగా గౌరవింపబడటం లేకపోవటం మానశికంగా బాధకు కారణమవుతుంది. స్త్రీలకు: ఆర్థికంగా మెరుగు లేకపోవటం గమనించగలరు.

★ **సింహం:** చాలామంది దూర ప్రాంతాలకుపోగల అవకాశమున్నది.అనుకొనని విధాన యింట శుభం జరుగుటకు 'సుముహూర్తం' నిశ్చయం కానున్నది. వ్యవహారం ఏదయినా సానుకూలం కావలసినది ఉంటే ఈ వారంలో పరిష్కరింపబడుతుంది. స్త్రీలకు: ఆరోగ్య భాగ్యం, ఉద్యోగమందు స్వల్ప వృద్ధి.

★ **కన్య:** నూతన వ్యక్తులు పరిచయమవుతారు. ఉద్యోగరీత్యా కొంత మేలు జరుగనున్నది. విద్యా విషయంగా పెంపు చేకూరనున్నది. విజయ సూచక వారమే. 'శని' గ్రహాశీస్సులున్నాయి. ఆర్థికంగా మేలే. స్త్రీలకు: బంధుమిత్ర సందడి. ప్రభుత్వపరంగా మేలు. రావలసిన డబ్బు అంది అవసరాలు పూడ్చుకొనుటకు మేలైన వారంగా గమనించి శ్రమించాలి.

★ **తుల:** ఎవరో ఏదో చేస్తారు. ఏదో జరుగబోతుందని ఆశించటం వెర్రితనం. మనమే శ్రమించాలి. తగిన ఫలితం అనుభవించాలి. రాశియందు స్థితుడైన 'కేతువు' వ్యర్థపుటాలోచనలకు, ప్రయాణాలకు కారణభూతుడు. స్త్రీలకు: అపవాదులు రావచ్చు. అనవసరంగా బాధ కలుగవచ్చు.

★ **వృశ్చికం:** మీ వ్యాపారాన అనుకొన్న దానికన్నా ఎక్కువ లాభం గడింపనున్నారు అయినా ఆశకు హద్దు ఉన్నదని, ఏ పని సానుకూలం చేసికోవాలన్నా అధిక శ్రమ అవసరమని గ్రహించాలి ఒకానొక వ్యవహారంలో ఎంత శ్రమించినా, లాభం లేదని గ్రహించాలి. స్త్రీలకు: ఉద్యోగరీత్యా అనుకూలదాయకమని గ్రహింపగలరు.

★ **ధనుస్సు:** ప్రజారంగాన సేవ చేయక తప్పదు. కాని రాజకీయాలకు దూరంగా ఉండటం అవసరం. వృత్తిరీత్యా మీకు మేలున్నది. అంతో యింతో చేతికి అందుతుంది. అయితేనేం అంతకు అంత వ్యయం కూడా చెప్పదగిన అంశం, స్త్రీలకు ఈ వారమందు అధిక వ్యయం, వ్యర్థపుటాలోచనలు. స్వల్పాదాయం, మధ్య మధ్య ఆటంకాలు

★ **మకరం:** కళా సాహిత్యరంగాలందు మీకు చేయి తిరిగేలాగైతే, సదవకాశాలు లభ్యం కాగలవు. ధనధాన్య, సంపత్తికి, ఉద్యోగ గౌరవం, సభా, పత్రికా గౌరవానికి కొందరకు అవకాశమున్నది శుభకార్య సానుకూలతకు అనుకూలవారం కాదు. స్త్రీలకు: ధనలబ్ధికి, ఉద్యోగ వృద్ధికి, ఆరోగ్యాభివృద్ధికి అనుకూలం

★ **కుంభం:** రాజకీయంగా గాని, వ్యవహారరీత్యా గాని ఏ విధంగా మేలుండదనీ, మీరు ఆశించిన ప్రయాణాలకు ఆటంకాలు రాగలవనీ, వృత్తికి అవరోధం రాగలదనీ, వ్యాపారం యధాప్రకారం సాగిపోదనీ గ్రహించి వ్యవహరించాలి స్త్రీలకు: చిక్కినట్టు చిక్కి వృత్తియందు కళారంగాన అవకాశాలు జారిపోతాయి. కృషి వదలకండి.

★ **మీనం:** వ్యవహార విజయ సూచక వారం. అలవాటుగా చేసే పనులకు ఆటంకాలురానున్నవి. వృత్తియందు వికాస లోపం ఏర్పడనున్నది. రాజకీయంగా పెద్దగా అనుకూల సమయంగాదు. అలాంటప్పుడు వృథా కాలక్షేపం ఎందుకు? స్త్రీలకు: ఉద్యోగమందు పెంపు చెప్పదగిన సమయంగాదు. ఎక్కడకో ప్రయాణించక కొందరకు తప్పదు.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# మూడు ఏభయిలు!!!

అవధానుల జగన్నాధరావు & మల్లంపల్లి గాంధీ రామారావు

విశ్వనాధం -

అప్పు తీర్చే అలవాటు లేనివాడికి అప్పు చేసే హక్కు లేదు ఒక వేళ నువ్వా హక్కు ఉందనుకున్నా, అప్పు తీర్చడం అలవాటు లేనివాళ్ళకి అప్పియక పోవడం నా అలవాటు. నా అలవాటుతో నిన్ను బాధిస్తే నన్ను క్షమించు

-నీ తమ్ముడు
పార్వతీశం.

ముప్ఫై ఏభయి రూపాయిలు అప్పుగా కావాలని చిట్టిని పంపిస్తే ఈయకపోవడమే కాకుండా, అనవసరమైన అభిప్రాయాలు వెల్లడి చేస్తూ ఉచిత సలహాలిస్తూ వ్రాసిన చీటీ చూసి ఒళ్ళు మండిపోయింది. కోపంతో దాన్ని ముక్క ముక్కలు చేసి సైడు కాలువలో పారేశాను.

నాకన్నా చిన్నవాడూ, నా సహాయంతో చదువు వెలిగించిన వాడూ బోడి సలహాలు యిచ్చేసరికి ఒళ్ళంతా కోపంతో ఊగిపోయింది

"చూడండి! మీ తమ్ముడికంటే పక్కింటి సుబ్బారావు గారికే మన మీద నమ్మకం ఎక్కువ ఉన్నట్లుంది. అడిగిన వెంటనే కాదనకుండా వంద రూపాయలు పంపించారు ఆ విషయాన్ని తలచుకొని మిరట్టే బాధపడకుండా, త్వరగా తెమలండి. సినిమా ప్రారంభమైపోతే నాకు చిరాగ్గా ఉంటుంది" అంది వసంత

టెంపో మీద వెళ్ళినా, ఆలస్యం అవడంవల్ల సినిమా టిక్కెట్లు బ్లాకులో తీయవలసి వచ్చింది. బాల్కనీలో కూర్చున్నాం అందరం అక్కడి నుండి హాలు హాలంతా కనపడుతోంది. రిజర్వ్ క్లాసులో కూర్చుని ఉన్న పార్వతీశాన్ని, కు ంబాన్నీ చూసి "మీ తమ్ముడికి మరి అంత పీనాసితన మేమిటండీ? మనలా అన్ని సినిమాలు చూస్తున్నట్లు కూడా అనిపించదు నెలకోసారి చూసే ఆ ఒక్క సినిమానీ. మనలా బాల్కనీలో కూర్చుని హాయిగా చూడొచ్చుగా. అందరిలా రెండు ఏభయిలు కాకుండా, మీ తమ్ముడొక్కడూ మూడు ఏభయిలు బ్రతికేద్దామనుకుంటున్నాడా?" అంది వసంత కాస్త వ్యంగ్యంగా.

"కక్కుర్తి వెధవ! చిన్నప్పటి నుండీ వాడికా డబ్బు ధ్యాసే చదువుకునే రోజుల్లో నాన్న యిచ్చే పాకెట్ మనీతో కూడా ఆదాతే వాడికి. ఆ రోజుల్లోనే వాడి ముఖానికి సుఖపడే యోగంలేదు ఇప్పుడెక్కడి నుండి వస్తుంది? ఈ రోజు నా అవసరం వచ్చిందని యింత సోది చెప్పాడు. రేపు వాడికీ, వాడి కుటుంబానికీ నా అవసరంరాకపోదు. అప్పుడు నేనూ నేర్పిస్తా వీడికి పొదుపు పాఠాలు" అన్నాను. - సాయంకాలం వాడు చిట్టి చేత పంపించిన, చీటీ జ్ఞాపకం వచ్చి నాలుగు కంపా కోలా సీసాలూ, నాలుగు పాప్‌కార్న్ పొట్లాలూ ఖాళీ అయిపోయాయి -సినిమా పూర్తయేసరికి

హాలు బయటికి వచ్చి, రెండు ఏల్స్ పెట్టెలు కొనుక్కొని, టెంపో ఎక్కాం నలుగురం మళ్ళీ.

జోరుగా పోతున్న టెంపోలోంచి, సిటీబస్ స్టాప్ వద్ద చూశాను. పార్వతీశం, పెళ్లాం పిల్లలూ బస్సుకోసం ఎదురు చూస్తూ కనుపించారు ఆ క్షణంలో, ఆ పీనాసి వెధవ తమ్ముడని చెప్పుకునేందుకే సిగ్గేసింది



"లాటరీలో కోటి రూపాయిల ప్రైజు వచ్చినా, వీధి బ్రతుక్కి అకు చెప్పులూ, కాటన్ చొక్కాలూ, సైకిల్ తొక్కుళ్ళూ, రిజర్వ్ క్లాసులూ, సిటీ బస్సులూ తప్పవు..." అన్నాను పైకి పార్వతీశం మీది కోపాన్ని మాటల్లోకి మార్చుతూ

వసంతా, పిల్లలూ పగలబడి నవ్వారు.

"నాలుగు కోలా పన్నెండు, టింపోలకి ఇరవై, టికెట్లకి ఇరవై, టికెట్లు బ్లాకులో కొన్నందుకు అదనంగా యిచ్చిన మరో ఇరవై, సిగరెట్లకీ, పాప్‌కార్న్‌కి పది ... మొత్తం ఎనభైకి పైనే ఖర్చయింది" - అని మనసులో లెక్క కట్టి "ఈ సినిమాకి మనకి ఎనభై ఖర్చయింది ఆ సన్నాసి మొత్తం ఇరవైలో తేల్చేసి ఉంటాడు" అన్నాను వసంతతో సిగరెట్ దమ్ము గట్టిగాలాగి వదులుతూ

"చేసుకున్న వాళ్ళకు చేసుకున్నంత! మునుపటికే సామెత చెప్పినట్లు, రాజు కూతురికూడా ముష్టి రాత తప్పలేదట రాత అలాగ ఉంటే మీ తమ్ముడనగా ఎంత?" అంది వసంత దండిగా మిగిలిపోయిన అన్నం, కూరల్ని పనిమనిషి కోసం అట్టే పెడుతూ.

* * * *

పార్వతీశం -

"ఇవాళ వెలిగిన వెలుగులకి అన్నయ్య ఎక్కడో ఓ వంద రూపాయిలు అప్పు చేసే ఉంటాడు' అనుకున్నాను అన్నంలో మజ్జిగ కలుపుకుంటూ.

"నాన్నా మనం కూడా టింపో మీద వచ్చి ఉంటే, ఇంటికి అరగంట ముందుగా వచ్చేసే వాళ్ళమేమో?" అన్నాడు రాజు పెదనాన్న కుటుంబాన్ని తలుచుకుంటూ

"దానికేం? టింపోమీద తప్పకుండా రావొచ్చు -నువ్వో చిన్న పని చేస్తే ఈసారి మేత్స్ టీచర్ అంత బాగా చెప్పడంలేదని అదనంగా పెట్టించుకున్న ట్యూషన్ మానేసి ఆ ఖర్చు తగ్గిస్తే" అన్నాను

"ఏం మాట్లాడాలో తెలియక తల వంచుకున్నాడు రాజు.

## మూడు ఏభయిలు!!!

"చూడు రాజూ! సినిమాకి వెళ్ళడం అన్నది ముఖ్యం గాని, ఎలా వెళ్ళేమన్న దానితో నిమిత్తమేమిటి చెప్పు! సినిమా చూడ్డానికి మూడుగంటలు స్పేర్ చేయదలచిన నీకు, టింపో మీద వచ్చి ఆదా చేసే అరగంటా అంత విలువైనదని అనుకోను. సాయంకాలం కడుపు నిండా ఫలహారంచేసి, కాఫీలు తాగి బయలుదేరిం తర్వాత, సినిమాహాల్లో, ఆ అపరిశుభ్ర వాతావరణంలో, అనవసరమైన తిళ్ళు తినడం, ఆరోగ్యాన్ని పాడు చేసుకోడం ఎందుకు చెప్పు? సినిమాలు చూడ్డానికి టాక్సీలూ, కూరల మార్కెట్ నుండి కూరలు తెచ్చుకునేందుకు రిక్షాలూ అవసరమా చెప్పు! జీవితంలో నేర్చుకోవలసింది, డబ్బు సంపాదించడంకాదు. సంపాదించిన సొమ్మును అర్ధవంతంగా ఖర్చు పెట్టడం - తెలిసిందా? ఈ రోజు నీవింట్లో ఉండి చదువుకుంటున్నావని మిగిలిన నాలుగు రాళ్ళూ ఆదా చేయకుండా దుబారాగా ఖర్చు పెట్టేస్తే ... రేపు పై చదువుల కోసం మరో ఊరికి వెళ్ళవలసి వస్తే, అదనంగా పెరిగే ఆ ఖర్చులకి డబ్బు ఎక్కడి నుండి తీసుకురావాలో నువ్వే చెప్పు!" అన్నాను.

"నన్ను క్షమించండి నాన్నా! మీరు చెప్పింది నిజమే." అన్నాడు రాజు రాజుకు, అర్ధ సద్వర్ధన కాస్త అర్ధమయేటట్లు చెప్పినందుకు ఆనందంగా లోపలికి నడిచాను పక్క వేసుకుంటూ.

* * * *

విశ్వనాధం:-

మార్కులు బాగా రాకపోవడం వల్ల, వేణుకి ఏ గవర్నమెంటు ఇంజనీరింగ్ కాలేజీలోనూ సీటు రాలేదు. బ్రహ్మ ప్రయత్నం చేసిం తర్వాత మైసూర్‌లో ఓ ప్రైవేట్ ఇంజనీరింగ్ కాలేజీలో మాత్రం సీటొచ్చింది– ఇరవై వేల రూపాయిల డొనేషన్‌తో.

"పి. యఫ్. లోనూ, సీ. టీ. డీ. లోనూ కలిపి మొత్తం పదిహేను వేలయింది. కనీసం మరో ఆరేడు వేలు కావాలి వాడ్ని జాయిన్ చేయడానికి" అనుకున్నాను.

అలా అనుకోవడం – ఆ రోజుకు అది పదో సారి.

ప్రాణ స్నేహితులనుకున్న వాళ్ళు 'కూడా డబ్బు సర్దడానికి వెనుకంజ వేయడంతో, ఏం చేయడానికి పాలు పోలేదు

చివరికి మిగిలింది తమ్ముడొక్కడే. వాడే నన్నాదుకో గలడని పించింది ఆత్మాభిమానాన్ని చంపుకొని వాడింటికి బయలు దేరాను– జీవితంలో అతి ముఖ్యమైన మలుపులో వేణుని నిరుత్సాహపరచడం సుతరామూ ఇష్టంలేక.

పలకరింపులూ, కాఫీలూ, పూర్తయ్యాక అసలు' విషయంలో కొచ్చాను.

"తమ్ముడూ! వేణుకి ఇంజనీరింగ్‌లో సీటొచ్చింది–" అన్నాను నాంది ప్రస్తావనగా.

"సంతోషం అన్నయ్యా!" అన్నాడు తమ్ముడు ముక్తసరిగా

"వాడ్ని కాలేజీలో జాయిను చేయడానికి కనీసం ఇరవై వేలుండాలి నేను మొత్తం పదిహేను వేలు జతపరిచాను. నువ్వెక్కడయినా అప్పుచేసి మిగిలింది సర్దుతే, నీ సొమ్ము పూవుల్లో పెట్టి.." అంటూ ఆగాను, మారిన పార్వతీశం ముఖకవళికలు గమనించి.

"అన్నయ్యా! అందని ఎత్తులకి ఎగరడం... క్రిందపడి కాళ్ళూ చేతులూ విరగ్గొట్టుకోడం నా తత్వానికే విరుద్ధం కష్టపడి మార్కులు తెచ్చుకోలేని వాడిమీద, అంతలేసి ఖర్చులు పెట్టి ఇంజనీరింగ్ చదివించడం అంత మంచిది కాదేమో? దీనితో నీ ఆర్ధిక పరిస్థితి ఎంతగా చితికి పోతుందో ఆలోచించు. ఆ డొనేషన్ కాలేజీలో చదువులు, మనలాంటి మధ్య తరగతి వారికోసం కాదు గాదెల్లో డబ్బు మూలిగే భూఖామందుల కోసం, కోట్లకి పడగలెత్తిన వ్యాపారుల కోసం– తన బాధ్యతల్ని ఎంతగా అర్ధం చేసుకున్నకొడుకయినా, వార్ధక్యంలో చేయూత నీయగలడే గాని, తల్లిదండ్రుల పూర్తి భారాన్ని మోయలేడన్నయ్యా. వృద్ధాప్యంలో కాలం నెట్టడానికి, డబ్బు ఆదా చేసుకోవలసిన బాధ్యత మనదే నా ఉచిత సలహాలతో నీ మనసు నొప్పిస్తే నన్ను క్షమించు. అయినా మొన్న ఏభై రూపాయిలు అప్పీయని నా దగ్గర్నుండి, ఐదువేలు అప్పుగా ఎలా తీసుకెళ్దామనుకుంటున్నావో అర్ధం గావడం లేదు" అన్నాడు పార్వతీశం.

నిష్కర్షగా వాడిచ్చిన సమాధానానికి మనస్సు చివుక్కుమంది

"తమ్ముడూ! ఇంతవరకూ నువ్వు డబ్బు జాగ్రత్త గలవాడవను కున్నానుగాని, స్వార్ధపరుడవని ఏనాడూ అనుకోలేదు మనిషికీ, మనిషికీ మధ్య, కేవలం డబ్బే కాకుండా అనుబంధమనేది కూడా ఒక టుంటుందని మరచిపోకు నీకు చేతనై కూడా నాకు సహాయం చేయడం లేదని నాకు తెలుసు నువ్వు చదివేటప్పుడు నెలనెలా పంపించిన సొమ్ము సంగతే మరచిపోయావా? అవును! ఎందుకు మరచిపోవూ?



లోకంలో సహజంగా జరిగేది అదేకదూ. సిగ్గు చంపుకొని, స్వయంగా వచ్చి అడిగినందుకు, నీకన్నా పెద్ద వాడినన్న గౌరవమైనా చూపించకుండా బాగా బుద్ధి చెప్పావ్!" అన్నాను విసురుగా కుర్చీలోంచి లేస్తూ.

ఆఖర్న అన్నమాట వాడిమీద బాగా పని చేసినట్టుంది ఒక్క క్షణం ఏదో ఆలోచించి, "అన్నయ్యా! ఒక్క నిముషం ఆగు!" అంటూ లోపలికి వెళ్ళాడు.

బీరువా తెరిచిన చప్పుడు వినిపించి.. తిరిగి మనసులో ఆశ మొలకెత్తింది

గదిలోంచి వస్తూనే, నా చేతికో ప్లాస్టిక్ కవరందించాడు. ఆత్రుతగా విప్పి చూశాను. కవర్లో పదివేల రూపాయిలకి ఫిక్సెడ్ డిపాజిట్ సర్టిఫికేట్ కనిపించింది. ఆశగా తమ్ముడి కళ్ళల్లోకి చూశాను

"అన్నయ్యా! నేను ఉద్యోగంలో జాయినవడం, నీకు వేణు పుట్టడం ఒక్కసారే జరిగాయి నీవు ఐదేళ్ళపాటు క్రమం తప్పకుండా, నాకు నెలకు పాతిక రూపాయిలు పాకెట్ మనీ పంపించేవాడివి గుర్తుందా? దానికి బదులుగా నా జీతం నుండి, నెలకు ఏభై చొప్పున ఐదేళ్ళపాటు సి. టి. డీ.లో దాచి ఉంచాను– ఐదేళ్ళ తర్వాత ఆ మొత్తాన్ని నీకిచ్చి ఆశ్చర్యంలో ముంచెద్దుదామనే ఉద్దేశ్యంతో. గాని నీ ఖర్చు దారీ తత్వాన్ని గమనించి ఆ ఆలోచన విరమించుకొని ఈ సొమ్మును ఫిక్సెడ్ డిపాజిట్ రూపంలో దాచి ఉంచాను. ఆ మొత్తం అలా పెరిగి పెరిగి ఈనాటికి పదివేలయింది. ఈ సొమ్ము నీదే. నీ యిష్టం వచ్చినట్టు ఖర్చుపెట్టుకో" అన్నాడు ప్తార్వతీశం.

నా కళ్ళల్లో ఆనందాశ్రువులు నిలిచాయి. "థాంక్స్‌రా తమ్ముడూ! దీన్ని ఎన్. కేష్ చేయడానికి రేపొస్తాను దానికి నీ సంతకం ఉండాలిగా" అంటూ స్కూటర్ స్టార్ట్ చేసి యింటి ముఖం పట్టాను.

* * * *

విశ్వనాథం:–

జీవితంలో ముప్ఫయి ఆరేళ్ళు ఉద్యోగం చేసి సాధించిందల్లా– వేణుని ఇంజనీరుని చేయడం, చిట్టికి పెళ్ళి చేసి అత్తారింటికి పంపించడం ఈ కనీసపు కర్తవ్య నిర్వహణకే జీవితంలో అన్ని విధాలా అలిసి పోయాను. పదవీ విరమణ తదనంతరం, బాంకు వాళ్ళిచ్చిన ఇరవై వేల రూపాయిలు కరగి పోడానికి అట్టేకాలం పట్టలేదు.

ఢిల్లీలో పని చేస్తూ, నెలనెలా వేణు పంపించే వంద రూపాయిలూ ఏ మూలకూ సరిపోక పోవడంతో, బాంక్ మానేజర్‌గా రిటైరైన నాకు ఓ లాడ్జిలో మానేజర్‌గా జాయినవక తప్పలేదు.

"జీవితం అంటే ఓ వెలుగు వెళ్లడం" అనే ధోరణిలో జీవితాన్ని గడిపిన మా ఉభయులిద్దరికీ... ఆ వెలిగిన వెలుగులు భయంకరమైన చీకట్లను మిగులుస్తాయని... తెలిసే సరికి ఎంతో ఆలస్యమై పోయింది. వయసులో ఆయిన దానికీ, కాని దానికి టింపోల మీద, టాక్సీలమీదా, తిరిగిన నాకు,

# రవి తేజం

ప్రజలంతా ఏకమైన
పరాజయమె లేదురా...
సంఘ సమైక్యతలో నే
సమధర్మం గెలుచురా!

సమ సమాజ నిర్మాణము
ప్రజల వీర యాగమురా...
ఉదయించే రవి తేజము
నాప గలుగు నెవడురా!

స్వార్థపరుల మాయ వలల
పడని వాడె ధీరుడై
సమ సమాజ న్యాయముకై
నిలిచే మొనగాడురా!

శ్రమజీవుల సుఖం కోరి
పాటుపడే వీరుడే-
ప్రజల నేత, ప్రజల భ్రాత
ప్రజల యోధ వరుడురా!

విప్లవ చైతన్య ధార
కట్టు కట్టు లేవురా...
శ్రమజీవుల దోచుకొనే
దొరలు నిలువలేరురా...

విప్లవాగ్ని విజృంభించ
ఆర్పగలుగు నెవడురా?
ఆగదురా పోరాటం-
అవనీస్థలి నిండురా!

ధూర్తులోకదోపిడీల
కాల్చు అగ్ని కెరటమై...
ఆర్తనాద మిక లేదని
చాటు సుధాకిరణమై!!

-సోమసుందర్

# మూడు ఏభయిలు!!!

వృద్ధాప్యంలో గంటల కొద్దీ బస్సుల కోసం పడిగాపులు కాయడం, కిలోమీటర్ల కొద్దీ నడవడం...

"జీవితం ఎలా జీవించాలో"... విశదంగా వివరించాయి

ఆనాడు ఏభై ఎనిమిదేళ్ళకు జరిగిన మొదటి పదవీ విరమణకన్నా, త్వరలో జరుగబోయే రెండవ పదవీ విరమణ, మనసును పూర్తిగా కృంగదీస్తోంది.

ఆనాడు ...!

వేణు నెత్తిమీద పెట్టుకొని పూజిస్తాడన్న ఎండమావి లాంటి ఆశా, బేంక్ వాళ్ళిచ్చిన సొమ్ము భవిష్యత్ మీద ఆశను పెంచాయి

ఈనాడు !

ఉడిగి పోయిన జవసత్వాలూ, దుర్భర దారిద్ర్యమూ, ముందు మిగిలిన శేష జీవితమూ, వికటాట్టహాసం చేస్తూ ముందు నిలిచాయి. ఉద్యోగ విరమణ చేయమని ప్రొప్రయిటరు గారు చెప్పడం, ఆయనది తప్పు కాదేమో!

డెబ్బయి ఎనిమిదేళ్ళ వయస్సు నిండిన, తనను భరించడం, ఆయనకి కూడా కష్టమే మరి ఇవ్వవలసిన యింటద్దె, నెలసరి ఖర్చులు తలచుకునే సరికి ఒక్కసారిగా ఒంటి నిండుగా చెమట్లు పోశాయి

భయంకరమైన ఆలోచనలు, దుర్భరమైన భవిష్యత్‌ను కళ్ళముందు, నిలిపి నిద్రను దూరం చేశాయి.

వెంటనే మంచం మీదనుండి లేచి, వేణుకి, తమ్ముడికి సహాయం అర్థిస్తూ, ఉత్తరాలు వ్రాసి నిద్రలో కొరిగాను ఆశతో

* * * *

పది రోజులు భారంగా గడిచి పోయాయి ఇంతవరకూ, ఇద్దరిలో, ఏ ఒక్కరి నుండి ఉత్తరం రాక పోయేసరికి మనసంతా ఆందోళనతో నిండి పోముంది.

రైల్వే స్టేషన్‌ల వద్దా, సినిమా హాళ్ళ ముందూ, భగవంతుని మందిరాల వద్దా, వికృతమైన రూపాలతో, దీనంగా యాచించే యాచకు లందరూ, నిండు మనసుతో ఆహ్వానిస్తున్నట్టనిపించింది. ఎందుకో ఆ ఆలోచనతో తల తిరిగినట్టయింది.

కాస్త తమాయించు కొని, గబగబా తయారయి, లాడ్జికు బయలుదేరాను

"తాతగారూ? మీకో శుభవార్త!" అంటూ వేణు వద్ద నుండి వచ్చిన ఉత్తరాన్ని అందించాడు పోస్ట్ మేన్ దారిలో.

"థాంక్స్ బాబూ!" అంటూ ఉత్తరాన్ని లాల్చీ జేబులో పదిలంగా పెట్టుకొని బస్టాపు చేరుకున్నాను– పరుగులాంటి నడకతో బల్ల మీద కూర్చొని, ముఖానికి పట్టిన చెమటను పంచెతో తుడుచుకొని, కొండంత ఆశతో, వేణు వ్రాసిన ఉత్తరాన్ని చదవడం మొదలు పెట్టాను.

శ్రీయుతులునాన్న గారికి,

మీరు ఉత్తరంలో వ్రాసిన విషయాలు చదివి ఎంతో విచారించాను. మిమ్మల్నిద్దర్నీ మాతో బాటు ఇక్కడే ఉంచుకుందా మనుకున్నా, గాని ఈ ఇరుకు ఇంట్లో యిబ్బంది అవుతుంది. ఈ నెల నుండి ప్రతినెలా పంపించే వందతో బాటు అదనంగా మరో ఏభై రూపాయిలు పంపించగలను. ఢిల్లీ లాంటి మహానగరంలో ఖర్చులు మీకు తెలియనివి కావు. దయ చేసి ఈ డబ్బుతో సర్దుకోండి. మరేదైనా చిన్న లాడ్జిలో ప్రయత్నిస్తే ఉద్యోగం దొరక్క పోదు. ప్రయత్నించండి. అమ్మను అడిగినట్టు చెప్పండి.

కోడలూ మీ యిద్దరికీ నమస్కారాలు చెప్ప మన్నారు వెంటనే ఉత్తరం వ్రాయండి

మీ వేణు

నట్టనడి సముద్రంలో, తుఫానులో ఒంటరిగా చిక్కుకున్న నావలా తయారయిన నా జీవితానికి బలమైన ఆయుధంతో వేణు చిల్లు పొడిచాడని పించింది– ఈ ఒక్క ఉత్తరంతో.

ఎన్నో ఆశలు పెంచుకొని, వీడికోసం, వాడి చదువు కోసం, అందిన చోటల్లా అప్పులు చేశాను. చివరికి సాధించిందేమిటి?

"కొడుకు పెద్ద ఇంజనీరుగా పనిచేస్తుంటే.... మీ కిదేం ఖర్మండీ" అన్న పరామర్శ తప్పించి.

సరిగ్గా ఆక్షణంలో తమ్ముడు మళ్ళా జ్ఞాపకం వచ్చాడు. ఆరోజు ఐదు వేల రూపాయిల అప్పుకోసం పోయినప్పుడు వాడిచ్చిన సలహా మనసులో మెదిలింది. వాడు చెప్పినట్లు వేణుని ఆ కాలేజీలో ఇంజనీరింగ్ చదివించడం నిజంగా శక్తికి మించిన పనే అయింది.

బహుశా కష్టమనేది తెలియకుండా పెంచడమే నేను చేసిన నేరమేమో అనిపించింది. జీవితమంటే నవ్వుల నావా, పువ్వుల వానగా పెరిగిన వేణుకి, ఈ నాటి నా పరిస్థితి ఎలా అర్థమౌతుంది? వృద్ధాప్యంలో ఆసరాగా ఉంచుకోవలసిన పి. యఫ్. అంతా వయసులో నే ఖర్చు చేసిన, నన్ను ఈ నాడు ఆదుకునే నాథుడెవరు?

'పార్వతీశం చెప్పినట్లు శక్తికి మించిన ఎత్తులకు ఎగరడం' నే చేసిన తప్పు. ఎంతగానో ఆలోచించి ఆనాడు వాడిచ్చిన సలహాను తృణీకరించిన నాకీ శిక్ష పడవలసిందే.

ఆక్షణంలో "ఎవరికి ఎవరూ బంధమూ...." అన్న ఘంటసాల వారి పాట జ్ఞాపకం వచ్చింది. దానితో బాటు ఎప్పుడో చదివిన ఓ గేయం తలపులలో నిలిచింది.

ఖర్చు మీదను అదుపు
దాని నందురు పొదుపు
ముదిమి వయసుకు మదుపు
ఓ చదువులమ్మా!

కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి పంచకొంగుతో నెమ్మదిగా కళ్ళు తుడుచు కున్నాను ఎవరూ చూడకూడదని.

ఒకే తల్లి కడుపున పుట్టినా, ఇద్దరి జీవన సరళులలో ఎంతటి వ్యత్యాసం!

అదుపు లేని అడవి గుర్రంలా విశృంఖలంగా పరుగు లెత్తిన నాజీవితం! రౌతు చేతి గుర్రంలా క్రమమైన పద్ధతిలో పరుగు తీసిన తమ్ముడి జీవితం.

'పొదుపు' అనే మాటే బూతుగా అనిపించే వాతావరణంలో పెరిగిన వేణు ఆలోచనా పద్ధతే మారిపోయింది

ఒక కొలిక్కి రాని ఆలోచనలతో మెదడు మొద్దుబారింది వణికే చేతులతో వేణు వ్రాసిన ఉత్తరాన్ని చించి పారేశాను.

వేణు లాగే ఆ కాగితాలు కూడా నానుండి దూరంగా ఎగిరిపోయాయి

"తాత గారూ! మనం ఎక్కాల్సిన బస్సొచ్చింది" అని చెప్పింది రోజూ నాతో బాటే బస్సులో ప్రయాణం చేసే కాన్వెంటు పాప

థాంక్స్ బేబీ' అంటూ ఆమె తలనిమిరి, బస్సెక్కాను

* * *

"ఈ ఉద్యోగానికి ఇది ఆఖరు రోజు! జీవితానికి ఆఖరు రోజు ఇంకా ఎంత దూరముందో!" అనుకుంటూ బస్సుదిగి లాడ్జ్‌కు నడిచాను.

అనుకున్నట్టుగానే, నా సీట్లో మరో వ్యక్తి కనుపించాడు.

ప్రొప్రయిటరుగారి వద్దకు వెళ్లాను– చివరిసారిగా నమస్కరించి పోదామని.

నన్ను చూసిన వెంటనే "చూడండి విశ్వనాథం గారూ! ఈ నెల నుండి, మానేజరుగా ఆ కొత్త వ్యక్తిని నియమించాను. ఇన్నేళ్ళుగా విశ్వశనీయంగా పని చేసినందుకు, కృతజ్ఞతగా ఈ శాలువా, రెండు వేల రూపాయిలూ అదనంగా యిస్తున్నా. ఉంచండి" అంటూ చేతికి ఓ పేకెట్ అందించి, తిరిగి తన పనిలో మునిగి పోయాడు ప్రొప్రయిటరు.

గత పద్నెనిమిదేళ్ళుగా, నా జీవితానికో ఆధారం చూపిన, అతనికి మనస్ఫూర్తిగా నమస్కరించి బయటకు నడిచాను నిశ్శబ్దంగా రద్దీ టైము కాక పోడంతో అరగంట చూసినా బస్సురాలేదు. సరిగ్గా ఆ క్షణంలో జ్ఞాపకం వచ్చాడు పార్వతీశం– ఇలాగే బస్టాండులో నిల్చొని.

ఆరోజు వాడినీ, వాడి కుటుంబాన్నీ చూసి, హేళనగా నవ్విన నవ్వులు , వికటాట్టహాసాలై మనసుని దొల్చేస్తున్నాయి.

"అప్పుడు ఏమాత్రం జాగ్రత్తగా ఉన్నా... అనవసరమైన ఖర్చులూ, విలాస కరమైన హొటలు భోజనాలూ, అయినదానికీ కాని దానికి చేసిన టాక్సీ ప్రయాణాలూ, ఖరీదైన సిగరెట్లూ కాస్త తగ్గించి ఉంటే. ఎంత మిగిలి ఉండేదో అనిపించింది ఆ చిన్న మొత్తాలు పెరిగి.. పెరిగి. ఎంత బాసటగా నిలిచేవో అనిపించింది ఆనాడు అదా చేయాలన్న ఆలోచనే చేదుగా ఉండేది ఆ ఆలోచన– ఈ నాటి జీవితాన్నే చేదు చేసింది.

పెద్ద రొద చేసుకుంటూ వచ్చిన బస్సు, ఆలోచనలకు అంతరాయం కలిగించింది. నిస్త్రాణగా బస్సెక్కాను.

* * *

తిండి తిని నిద్రపోయానన్న మాటే గాని మనసునిండా ఆలోచనలే. జవాబు లేని ప్రశ్నలే.

ప్రాణంతో ప్రాణంలా చూసుకున్న వేణుకు బరువైపోయాం– ఈ ముదిమి వయసులో. ఎంతో తెలివిగా నిస్సహాయతను తెలియ జేస్తూ, బాధ్యతను పూర్తిగా వదిలేశాడు.

ఇక మిగిలిందల్లా ఒకేఒక్క ఆశ!

తమ్ముడి వద్ద నుండి, ఎంతగానో ఎదురుచూస్తున్న ఉత్తరం! ఆ ఆశకూడా అడియాసగా మిగులుతే.....!

మెదడును దొల్చేస్తున్న ఆలోచనలకి ఫుల్‌స్టాప్ పెట్టినట్లు పోస్ట్ మాన్ ఉత్తరాన్ని యిచ్చాడు.

వణికే చేతులతో ఉత్తరాన్ని విప్పి చదవడం మొదలు పెట్టాను.

ప్రియమైన అన్నయ్యకు,

నమస్కరించి వ్రాయునది. ఉత్తరంలో వివరించిన నీ పరిస్థితి ఊహించుకుంటే, విచారం కన్నా, ఇంత వరకూ నాకు తెలియనీ యనందుకు.... నీపైకోపం వచ్చింది.

"ఏ సమాచారం లేక పోతే.... అది మంచి సమాచారమే" అన్న సూక్తిమీద ఉన్న నమ్మకంతో, నీ పరిస్థితి తెలుసుకునేందుకు అంతగా ప్రయత్నించలేదు.

తెనాలి నన్నపనేని కళామందిరంలో ఇటీవల జరిగిన లిటిల్ సిటిజన్స్ 8వ వార్షికోత్సవ సందర్భంగా ప్రసంగిస్తున్న శ్రీమతి దొకల సుజాతదేవి (రచయిత్రి), ముఖ్య అతిథి శ్రీ యొద్దుగంటి లక్ష్మణరావు, అధ్యక్షత వహించిన శ్రీ కొసరాజు శివప్రసాద్ (సెక్రటరి ఆంధ్రప్రదేశ్ చెస్ అసోసియేషన్) గార్లని చిత్రంలో చూడవచ్చు.



# నామసార్థకత

## ధర్మపథం



పేరు సంజ్ఞ కోసమే పెట్టుకొన్నా, కొన్ని సందర్భాలలో దానికి ఎంతో విలువ ఉంటుంది. ఆ విలువ దానికి వ్యక్తిని బట్టి లభిస్తుంది. దీనికి ఉదాహరణగా శ్రీరాముణ్ణే తీసుకోవచ్చు.

విష్ణుదేవుని పది అవతారాలలో ముగ్గురు రాములున్నారు. మొదటివాడు భార్గవరాముడు, రెండవవాడు దశరథరాముడు, మూడవవాడు బలరాముడు. కాని, "రాముడు" అని స్మరిస్తే శ్రీరాముడే స్ఫురణకు వస్తాడు కాని, తక్కిన యిద్దరిలో ఎవ్వరూ స్ఫురణకు రారు. భగవంతుని పరిపూర్ణాంశం శ్రీరామునిలో ఉండడమే దీనికి కారణంగా తోస్తుంది. రామనామ స్మరణ వల్ల పాపాలు నశిస్తాయంటే - శ్రీరామ నామస్మరణను మాత్రమే గ్రహించవలసి ఉన్నది. పరశురామ, బలరాములకు ఆ నామ స్మరణతో ప్రసక్తి లేదు.

ఇలాగే - రాఘవుడనే పేరు శ్రీరామునికి మాత్రమే చెంది ఉన్నది. సుప్రసిద్ధుడైన రఘు మహారాజు వంశంలో పుట్టిన అందరూ రాఘవులు కావచ్చు. రఘుకుమారుడు అజుడు, అతని కుమారుడైన దశరథుడు, దశరథుని యితర పుత్రులగు భరత-లక్ష్మణ, శత్రుఘ్నులు, దశరథుని మనుమలు, ముని మనుమలు మొదలైన అందరూ రాఘవులు కావచ్చును. కాని రాఘవుడంటే శ్రీరాముడే కాని మరొకరు స్ఫురణకు రారు. రాఘవుడనే పేరు శ్రీరాముని పట్ల రూఢమై పోయినది. కారణం - ఇంద్రుణ్ణి కూడా జయించగల రఘుమహారాజు శౌర్య పరాక్రమాలు, ఔదార్యాది గుణాలు సమగ్రంగా శ్రీరాముని యందు మాత్రమే కనపడుతున్నవి. ఈ విధంగానే "రఘువీరు"డనే పేరు కూడా శ్రీరామునికి మాత్రమే చెందియున్నది. లక్ష్మణాదులు, శ్రీరాముని పుత్రులు కుశలవులు మున్నగు వారున్నూ మహావీరులే! అయినా ఇరవై ఒక్కసార్లు రాజులను వెదకి వెదకి సంహరించిన పరశురాము నోడించిన బాహు విక్రమం, ఒంటరిగా ఖరదూషణాదులను పెక్కుమందినీ, దేవతలను గడగడలాడించిన రావణునీ సంహరింపగల బాహు పరాక్రమం శ్రీరామునకే ఉన్నందున రఘు వీర నామం అతనియందే సార్థకమయింది. ఉదాహరణకు మాత్రం ఇది చూపబడినది.

-బులుసు వేంకటరమణయ్య

# మూడు ఏభయిలు!!!

'జీవితంలో కష్టమనేది కూడా ఉంటుంది' అన్న సత్యం తెలియనీయకుండా పెంచిన వేణు మీ యిద్దరి పూర్తి బాధ్యత స్వీకరిస్తాడని నేనను కొను ఆడంబరాలకు అతిగా ఖర్చు చేస్తూ, పొదుపు చేయాలన్న ఊహ లేశమాత్రమేనా లేని మీ వృద్ధాప్యం, దుర్భరమౌతుందని ఊహించాను..

గాని దయనీయంగా మారుతుందని అనుకోలేదు

నీవు అందిన చోటల్లా అప్పు చేసి, చేసిన పనులన్నీ నాజీవితంలో చిన్న మొత్తాల పొదుపు ద్వారా జరిగిపోయాయి పిల్లలిద్దరి చదువులకూ, పెళ్ళిళ్ళకూ కూడా. .. నేనప్పు చేయలేదంటే. నువ్వీ స్థితిలో కూడా నమ్మవేమో జీవితాన్ని సరియైన కోణం లోంచి చూస్తూ పెరిగిన రాజు, మమ్మల్నిద్దర్నీ అర్థం చేసుకొని, అన్ని విధాలా సహాయకారిగా ఉంటున్నాడు. నేను కట్టుకున్న యింటి మీద వచ్చే, అద్దె, నా పి. యఫ్ మీద వడ్డీతో మాయిద్దరి జీవితాలూ సుఖంగా జరిగిపోతున్నాయి. ఇంతే కాకుండా అదనంగా రాజు పంపిస్తున్న సొమ్ము మిగులుతోంది

ఇలాంటి స్థితిలో, మిమ్మల్నిద్దర్నీ ఆదుకోవడం కన్న నేను చేయగలిగిన, మహత్కార్యమే ముంటుంది చెప్పు? మీరిద్దరూ ఇక్కడికి వచ్చి ఉండడానికి రాజు కూడా, తన సమ్మతినీ, ఆనందాన్నీ వ్యక్తం చేశాడు నేనివాళే బయలు దేరి వస్తున్నా మీ రిద్దరూ నాతో బాటు బయలు దేరడానికి సిద్ధంగా ఉండండి ఒదినకు నానమస్కారాలు చెప్పు

ఇట్లు,<br>
సీతమ్ముడు,<br>
పార్వతీశం

ఉత్తరం చదివిన నాకనులనిండి రెండు కన్నీటి బొట్లు నేలమీద పడ్డాయి

అంతవరకూ, మౌనంగా నన్నే గమనిస్తున్న వసంత ఆందోళనగా చూసింది.

కన్నీళ్ళు తుడుచుకొని, చిరునవ్వుతో ఉత్తరాన్ని వసంతకు అందించాను. ఉత్తరం చదివిన వసంత కళ్ళల్లో.. కాస్త జీవం వచ్చింది

"వసంతా! ఎవరు మూడు ఏభయిలు బ్రతకాలని ఈ రోజు అన్నావు గుర్తుందా! నీ వన్న మాటలకు ఆ రోజు నవ్వాను. గాని, జీవితంలో మొదటి ఏభై ఏళ్ళ సంపాదనలో, రెండవ ఏభైకోసం కాస్తంత పొదుపు చేయక పోతే, విచ్చల విడిగా ఖర్చు పెడితే, జీవితం ఎంత దయనీయంగా మారుతుందో ఈ రోజు తెలిసింది ముదివి వయసుతో, ఆయువు ముగిసే దాకా, కనీసపు అవసరాలతో కాలం నెట్టడానికి కూడా, యవ్వనంలో, బాగా సంపాయించే తరుణంలో పొదుపు చేయాలి కదూ" అన్నాను.

వసంత చేతిలో నున్న ఉత్తరం గాలికి రెపరెప లాడుతూ "ఔనన్నయ్యా!" అని చెప్పినట్లనిపించింది. □

# కిసాన్ సమయాన్ని మీ పిల్లలతో ఎవరు పంచుకుంటారో ఊహించండి చూద్దాం

మిక్కీమౌస్, డొనాల్డ్‌డక్, విన్నీది పూ, గూఫీ, మీరు కొనే ప్రతీ స్క్వాష్ లేక క్రష్ బాటిల్‌తోబాటు, ఒకొక్క గ్లాసుమీద ఒక్కొక్కరు మీ కోసం ఉచితంగా వస్తున్నారు.

కిసాన్ స్క్వాష్ మరియు క్రష్. అతి రుచికరమైన, మధురమైన పళ్ళనుండి చెయ్యబడ్డవి. మీకు సులభంగా. సుముఖానందాన్ని ఉల్లాసాన్ని ఇవ్వగల పానీయాలు చక్కెర వెయ్యనక్కరలేదు. క్షణాల్లో తయారు చెయ్యవచ్చు.

నిత్యం ఒక కిసాన్ బాటిల్ చేతికందుబాటులో ఉంచుకోండి. ఏ రకమైనా లేదా పూర్తి ఆరు రకాలూ కొని, మీ పిల్లల డిస్నీ స్నేహితుల్ని కూడా. ఇంటికి తీసుకెళ్ళండి.




## కొత్త, రుచికరమైన పళ్ళనుండి చెయ్యబడ్డవి, సాధారణంగా కిసాన్‌వే మరి

**ఉచితం**

ప్రతీ
బాటిల్‌తోబాటు





© 1983 Walt Disney Productions

### స్క్వాషెస్ మరియు క్రషెస్

ఆరెంజ్, పైనాపిల్, లెమన్, గ్రేప్, మ్యాంగో, లెమన్ బర్లీ.

గ్లాసులు. ఆరెంజ్. రోస్ పైనాపిల్ మరియూ ఖుస్ సిరప్స్‌తోకూడా లభిస్తాయి.

ఈ పథకం స్టాకున్నంతవరకే ప్రతీ బాటిల్‌తోబాటు నిర్ణేత స్థలాల్లో మాత్రమే.



**Kissan**

MAA(S) KPL 1A TEL 86

# అరవింద ఆశ్రమంలోని మాత ఎవరు?

శ్రీ అరవిందయోగి అనుయాయులకు మాత ఎవరో తెలిసే ఉంటుంది. పాండిచ్చేరిలో ఉన్న అరవింద ఆశ్రమంతో అర్ధ శతాబ్దానికి పయిగా అనుబంధాన్ని పెంచుకున్న మాత అశేష జనావళి గుండెల్లో మాతృస్థానాన్ని పొందిందే తప్ప మాత ఎవరు అన్న ప్రశ్నకు అవకాశం లేకుండా చేసింది. మానవత్వమే తత్వంగా ప్రాణ ప్రతిష్ఠ చేసుకున్న అరవిందుని గితాచరణ సాహచర్య ప్రభావమే దీనికి కారణం కాబోలు! ఈ మాత ఆనీ బీసెంట్, సిస్టర్ నివేదితలలాగా భారతీయురాలు కాదు కాని, భారతీయులకు ఆత్మీయురాలు!

అరవిందుని తరువాత అంతటి స్థానాన్ని ఆక్రమించుకొన్న మాత ఎంతో మందికి మాతగానే తెలుసు కాని, ఆమె పుట్టుపూర్వోత్తరాలకి సంబంధించిన వివరాలు పెద్దగా తెలియదు. మాత సాహచర్యంవల్ల జీవితానుభవాన్ని అర్థవంతమైన ధోరణితో సమాజ శ్రేయస్సు కోసం వినియోగించడం నేర్చుకొంటున్న సుజాతా నహర్ అనే మహిళ "మదర్స్ క్రానికల్స్" పేరిట పుస్తకాన్ని రాసి మొదటి భాగాన్ని వెలువరించింది. అరోవిల్లెలో ఉన్న "మిరా అదితి సెంటర్" వారు దీనిని ప్రచురించారు.

మూర్తిభవించిన సాధుత్వం మాతలా పరిణమించిందేమో అనేవిధంగా ఆమె నిరాడంబరత, నిర్మల ప్రవృత్తి, నిత్యసేవా తత్పరత, నిండు సచ్ఛలత ఎవరినైనా ఆకట్టుకొంటాయి. ఈమె ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడుతుంది. ఫ్రెంచ్ భాషలో చక్కగా రాయ గలుగుతుంది. జపాన్ నగలంటే మక్కువ. భారత దేశంలో నేసిన పట్టుచీరలంటే ప్రాణం! అయితే ఎప్పుడూ కూడా పొట్టి రెట్టల చొక్కాతో, సాటిన్ సల్వార్‌తో దర్శనమిస్తూ ఉండేది. చెరగని చిరునవ్వుతో "ఆల్ఫాన్స్" అంటూ ఆటోగ్రాఫ్‌ల మీద సంతకాలు పెట్టేది. పూన దిలీప్ కుమార్ రాయ్ ఈమెను "మిరా" అని సంబోధిస్తూ ఒక పాట కూడా రాసాడు. "మిరా" అంటే కృష్ణభక్తురాలు మిరాబాయికి సరితూగే మాటకాదు. మాత అసలు పేరు మిర్రా ఆల్ఫన్సా. ఈమె తండ్రి టర్కీ దేశపువాడు. తల్లి ఈజిప్ట్ వనిత. వీరిద్దరూ ఫ్రెంచ్ పౌరసత్వాన్ని స్వీకరించిన వారే! ఇస్లామ్‌ను వదలిపెట్టి రోమన్ కెథోలిక్‌లుగా వీరు మారిపోయారు. మాత తల్లి కమ్యూనిస్ట్ కూడా! ఈ విధంగా భిన్న సంస్కృతులు, అభిరుచులు మధ్య పుట్టి పెరిగిన మాత ఆలోచనా దృక్పథం ఉన్నత ప్రమాణాలను కలిగి ఉండడంలో ఆశ్చర్యం లేదు.

ఫిబ్రవరి 21, 1878న పారిస్‌లో జన్మించిన మాత 1914 నాటికి కాని భారత దేశాన్ని చూడలేదు. అరవిందయోగి ఈమెకు సమకాలికుడే కాదు, సమవయస్కుడు కూడా! ఆయన 1872లో పుట్టి 1950లో తనువు చాలించాడు. మాత చిన్నతనంలో యూదుల సంగితమన్నా, టెన్నిస్ బంతి ఆట అన్నా, వేడి వేడి మాంసపు కూర అన్నా తెగ ఇష్టపడేది. 1897లో ఎడవుర్డ్ మోరిసెట్‌ని పెళ్ళి చేసుకొంది. వీరి కుమారుడు ఇంజనీర్‌గా పని చేసేవాడని,






## మిర్రా ఆల్ఫన్సా

కలకత్తాలో భూగర్భ రైలు మార్గాన్ని నిర్మించేటప్పుడు డాక్టర్ బి. సి. రాయ్ ఆయనను ఆహ్వానించాడని సుజాత నహర్ వెల్లడించింది.

ఇకపోతే మాత అరవింద ఆశ్రమాన్ని ఆశ్రయించి అరవిందుని అంతటి స్థానాన్ని పొందగలిగిందని చెప్పడం జరుగుతోంది కాని, మాత ప్రభావితురాలు కావడానికి అసలు కారణ మేదో సరిగా తెలియడం లేదు. ఈమె సోదరుడు మాట్టియో ఆల్ఫన్సొ ఫ్రాన్స్‌లో కాలనియల్ గవర్నర్ జనరల్‌గా ఉండేవాడు. ఆయన ద్వారా అరవింద ఆశ్రమానికి ప్రభుత్వపరమైన చిక్కులు రాకుండా ఈమె సహాయ పడిందని కొంతమంది అభిప్రాయ పడుతారు. మరి కొందరైతే అరవిందయోగిని మాయం చేసి వేరే ఎవరినో ఆ స్థానంలో ఈమె ఉంచిందని చెబుతూ ఉంటారు కాని, అందులో వాస్తవం ఉన్నట్లు తోచదు. అరవింద యోగి మరణించాక కూడా మాతకు ఆశ్రమంలో గౌరవప్రదమైన ప్రథమస్థానమే ఉండేది కదా!

ఈమె బోధనలు ప్రత్యేకమైనవిగా కనిపించవు. అరవింద సిద్ధాంతమే ఈమె మాటల్లో ప్రతిధ్వనిస్తూ ఉండేదని ఎంతో మంది చెబుతారు. ఈమెకు సంబంధించిన ఎన్నో విషయాలు ఇంకా గుప్తంగానే ఉన్నాయి. కొంతవరకైనా ఈ మాత వివరాలను సేకరించి ప్రజానీకానికి అందించిన సుజాతా నహర్ ఎంతైనా అభినందనీయురాలు. ఈమె జీవిత చరిత్రలోని వ్యక్తిగతమైన అంశాలకు ఎక్కువ ప్రాముఖ్య మివ్వకుండా సంస్థాగతమైన ఆమె బోధనల సారాన్ని కూడా వెలుగులోకి తీసుకొని రావలసి ఉంది. అరవిందుని అంతరంగ వాణిగా ఆమె మెలిగేదని వినవచ్చే మాట వాస్తవమా కాదా అన్న సంగతి కూడా నిర్ధారణ కావాలి.

విమర్శకులు సత్యాన్వేషణ సాగిస్తారని ఆశిద్దాము.

– డా. జి. ఆర్. బి.

రామయ్య పొలం పనుల్లో దిట్ట
కాని అతని వారసత్వం అప్పులు
మాత్రమే, పెట్టుబడి నాస్తి,
దాంతో చాలా దిగులు పడ్డాడు

# యిప్పుడు అతని పొలం సస్యశ్యామలం
# అతనికి తీరిక లేదు ఒక్క క్షణం

రామయ్య తన తండ్రి వడ్డీ వ్యాపారి ఋణాన్ని తీర్చడానికి ఎంత కష్టపడ్డాడో కళ్ళారా చూశాడు తను మాత్రం ఆ తప్పు చేయకూడదనుకున్నాడు కానీ అతనికి డబ్బు ఎంతో అవసరం మరి అటువంటి పరిస్థితిలో ఆంధ్రప్రదేశ్ సహకార బ్యాంకింగ్ విధానం గురించి ఎవరో అతనికి చెప్పారు రామయ్యకు దేవుడే దిగివచ్చి వరమిచ్చినట్లయింది సహకార బ్యాంకింగు వ్యవస్థ గ్రామీణ అభివృద్ధికి సత్వర సహాయం సక్రమంగా అందించేందుకు ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడింది

ఈ వ్యవస్థ మూడు దశలుగా విభజింపబడింది మూలసంస్థ ఆంధ్రప్రదేశ్ స్టేట్ కో ఆపరేటివ్ బ్యాంకు 'ఆప్‌కాబ్' ఆధ్వర్యం క్రింద 27 జిల్లా కేంద్ర సహకార బ్యాంకులు 430 శాఖలతో ఉన్నాయి ఈ సంస్థలకనుబంధమైన 6729 ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాల (PACS) పరిధిలో ఆంధ్రప్రదేశ్‌లోని గ్రామాలన్నీ ఉన్నాయి

PACS లో చేరిన వారికి కేవలం సహకార బ్యాంకింగు వారి సహాయాలన్నీ లభించడమే కాకుండా వారు ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాల వాటాదార్లు కూడా అవుతారు.

**ఆం.ప్ర. సహకార బ్యాంకింగ్ విధానము ఆంధ్ర ప్రదేశ్ లో రైతులకు శ్రీరామరక్ష**



ఆంధ్రప్రదేశ్‌లో గ్రామీణాభివృద్ధికిగాను యిచ్చే ఋణాలలో ఆప్‌కాబ్‌దే అగ్రస్థానం మొత్తం ఋణాల పంపిణీలలో 30% ఆప్‌కాబ్ వారిదే

వ్యవసాయాభివృద్ధికి ఎక్కువ ప్రాముఖ్యం యిచ్చినా కూడా కుటీర పరిశ్రమలు, చిన్న తరహా పరిశ్రమలు, పశువుల పెంపకాలు, కోళ్ళఫారాలు మొదలగువాటికి కూడా సహాయం అందిస్తారు అసలుకి వచ్చిన ఆదాయాన్నంతా తిరిగి ఆంధ్రప్రదేశ్‌లోని గ్రామాల అభివృద్ధి కొరకు మాత్రమే వెచ్చించే ఏకైక ఆర్థిక సంస్థ ఆప్‌కాబ్ ఒక్కటే

ఆప్‌కాబ్ రిజర్వుబ్యాంకు వారి అత్యంత నిర్దిష్టమైన నిబంధనలతో అతి సమర్థవంతంగా నిర్వహించబడుతుంది మిగతా వాణిజ్య సంస్థలు యిచ్చే సహాయాలన్నీ యివ్వటమే కాకుండా --మీ జమలన్నిటిమీద 1/4% ఎక్కువ వడ్డీ కూడా చెల్లిస్తారు దీనిని రెట్టింపు చేసి జిల్లా కేంద్ర సహకార బ్యాంకు 1/2% ఎక్కువ వడ్డీ యిస్తారు

ఆప్‌కాబ్ వారి సహకారమే లేకుంటే రామయ్యవంటి రైతులు ఎందరో గాలికి కొట్టుకుపోయేవారు

## ఆంధ్ర ప్రదేశ్ సహకార బ్యాంకులు

## ఆంధ్ర ప్రదేశ్‌లో గ్రామీణ ప్రజలకు శ్రీరామరక్ష

Sistas/APCOB/421/86 Tel

సీరియల్

ఎస్. భారతీ దేవి



# ప్రేమసాగరం

(గత సంచిక తరువాయి)

మోహినీ, జయరాం భోంచేస్తున్నారు వరలక్ష్మి వాళ్లకు వడ్డిస్తుంది రాములమ్మను వాళ్ళు ఏ పనీ చెయ్యనియ్యటం లేదు. ఆమెను వెళ్ళమన్నా, ఇల్లు వదలకుండా స్వప్నను కనిపెట్టుకుని ఉంటుంది. స్వప్న బయటి కెళ్ళినా, లాన్‌లో కూర్చున్నా బాడీగార్డులా అమెను కనిపెట్టుకు నుంటుంది అలా ఉండమని స్వప్నకు తెలియకుండా రఘునాథ్ చెప్పాడు రాములమ్మ అవసరాలకు డబ్బు కూడా అతనే ఇస్తున్నాడు

వంటరిగా కూర్చుని, కూర్చుని గదిలో విసుగెత్తి పోయింది స్వప్నకు. రాములమ్మను తీసుకుని స్కూలుకు వెళ్ళొద్దామని మెట్లు దిగుతుంది మెట్లు హాలులో నుంచి ఉంటాయి మెట్లకు దగ్గరగా ఉంటుంది డైనింగ్ హాలు

వరలక్ష్మి మాటల్లో, రఘునాథ్ పేరు వినిపించటంతో, అప్రయత్నంగా నిలబడిపోయింది స్వప్న ఆమె వెనుకే నడుస్తున్న రాములమ్మ కూడా అలాగే నిలబడి పోయింది

"అవిడెందుకిస్తుంది బాబూ డబ్బు? నువ్వట్టి అమాయకుడివి కాబట్టి, ఇన్ని రోజుల నుంచి, ఆ మాయలాడి ఆడుతున్న నాటకాన్ని కనిపెట్ట లేకపోయావు."

వింటున్న స్వప్నకు, తను నిల్చున్న మెట్లు కదులుతున్నట్టనిపించింది

"వాడు లేడూ, ఆ రఘునాథ్. ఇన్ని రోజుల నుంచి పెళ్ళి, పెటాకులు లేకుండా ఎందుకున్నాడనుకుంటున్నావు? అన్ని అవసరాలు తీరుతుంటే, పెళ్ళి చేసుకోక పోతే మాత్రం ఏం?"

వరలక్ష్మి మాటలు, కత్తుల్లా ఆమె గుండెను తరుగుతున్నాయి. ఆమె మాటల్లోని వ్యంగ్యం, తేలిక తనం భరించ లేక పోయింది

**జరిగిన కథ-14:** జయరాం ఎంతగా తనను బాధించినా స్వప్న అతన్ని వదలి వుండలేక పోతోంది. డబ్బు విషయంలో స్వప్న, జయరాం ఘర్షణపడతారు. స్వప్నకు జ్వరం వస్తే రఘునాథ్ అమెను హాస్పిటల్‌లో చేరుస్తాడు. స్వప్న తిరిగి కోలుకుని ఇంటికి వచ్చేటప్పటికి ఇంట్లో చాలా మార్పులు జరగటం గమనిస్తుంది. జయరాం ఎన్ని రకాలుగా ప్రయత్నించినా స్వప్న మాత్రం అతనికి డబ్బు ఇవ్వదు.

'సింగారించుకుని, ఈ మహాతల్లి రోజూ వాడిదగ్గర కెళుతుంది పిల్లి పాలు తాగుతూ, తన నెవరూ చూడటం లేదనుకుంటుందంట అలా సాగుతుంది వీళ్ళరంకు నలుగురూ, నాలుగు రకాలుగా అనుకుంటున్నారు ఇప్పటికే మన కుటుంబం గురించి. అందరికీ తెలిసినా, ఈ విషయాలు నీకు మాత్రం తెలియటం లేదు ఆడది చెడితే, అందుకు కారణం మొగుడే అనుకుంటారు'

అడుగులో, అడుగేస్తూ అక్కడ కొచ్చి నిల్చుంది స్వప్న ఆమె కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి.

'రాక్షసి! నేను చెడిపోయానా? నీలాంటి వాళ్ళను బ్రతకనిస్తే, నాలాంటి వాళ్ళ కాపరాలు కూలిపోతాయి నిన్ను బ్రతకనియ్యకూడదు' అంటూ వరలక్ష్మి గొంతు పట్టుకుంది స్వప్న.

అనారోగ్యంతో, శిధిలమయిన శరీరంతో ఉన్న స్వప్న బలం, తెగతిని మదపు టేనుగులా బలిసి పోయిన వరలక్ష్మి బలం ముందు ఏపాటిది?

"బాబోయి చంపేస్తుంది అని అరుస్తూనే, తలతో బలంగా స్వప్న గుండెల మీద పొడిచింది.

"నీ కెంత ధైర్యమే" అంటూ మోహిని, స్వప్న చెంపలు రక్తం చిమ్మేలా కొట్టింది.

నీరసంతో కళ్ళు తిరిగి, వాళ్ళు కొట్టిన దెబ్బలకు స్పృహతప్పి పోయిన స్వప్నను చేతులతో నే కాకుండా కాళ్ళతో కూడా తన్నారు. జయరాం బలవంతంగా వాళ్ళ నుంచి, స్వప్నను వేరుచేసి, దెబ్బలతో కందిపోయి రక్తపు ముద్దలా ఉన్న ఆమె శరీరాన్ని రెండు చేతులతో ఎత్తుకుని, ఆమె రూములోకి తీసుకెళ్ళి పడుకో బెట్టాడు. రాములమ్మ ఏడుస్తూ సపర్యలు చేస్తుంది పాపం అంతకంటే ఏం చెయ్యగలదు ఆమె

తలతో కొట్టటం మూలంగా, ఛాతి మీద బాగాదెబ్బతగిలింది స్పృహతప్పి కందపడినప్పుడు, డైనింగ్ టేబులు అంచు తగిలి, నుదుటి మీద గాయం అయింది ఆ గాయం నుంచి ఇంకా రక్తం స్రవిస్తూనే ఉంది

డాక్టర్‌కు ఫోన్ చేద్దామంటే, దెబ్బలిలా తగిలాయని అడుగుతాడేమో. తీగలాగితే, డొంక కదిలినట్టుగా, విషయమంతా బయటకు వొస్తుంది.

డాక్టరు ద్వారా, విషయం రఘునాథ్‌కు తెలిసిందంటే, పోలీసు రిపోర్టు ఇచ్చి, ముగ్గుర్ని కటకటాల వెనక్కు పంపిస్తాడు. అందుకే, డాక్టరుకు ఫోన్ చెయ్యకుండా ఆమెను చూస్తూ కూర్చున్నాడు. రాములమ్మ కళ్ళు వర్షిస్తూనే ఉన్నాయి

* * * *

తెల్లవారు జామున, నాలుగు గంటల సమయంలో తెలివచ్చింది స్వప్నకు. ఏడుస్తూ ఆమె ముఖంలోకి చూస్తూ కూర్చున్న రాములమ్మ కనిపించింది. జరిగిందంతా గుర్తుకు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తుంది

'అమ్మా! మంచినీళ్ళు తాగు' స్వప్న తలను తన గుండెలకు అన్చుకుని, ఆమెనోటికి మంచినీళ్ళ గ్లాసు అందించింది రాములమ్మ

గట, గటా ఆ నీళ్ళన్నీ తాగింది స్వప్న. అప్పటికి కాస్త తేరుకుంది స్వప్న

'అమ్మా మనం త్వరగా ఇక్కడ నుంచి వెళ్ళిపోదాం'

'ఎక్కడ కెళతాం?'

'నీకు తెలియదమ్మా వీళ్ళు మనుష్యులు కాదు రాక్షసులు మీ ప్రాణాలు తీసే దాకా వదలరు

ఈ ప్రాణం పోవటమే, నేను కోరుకునేది కూడా

మీకు తెలియదమ్మా మీ వెనుక జరుగుతున్న కుట్ర మిమ్మల్ని కొట్టి ఇక్కడ పడేసి, డాక్టర్ని కూడా పిలవలేదు మిమ్మల్ని చూస్తుంటే నాకు భయం వేసింది రఘునాద్ బాబుకు ఫోన్ చేద్దామంటే, వీళ్ళు వింటారేమో అన్న భయంతో చెయ్యలేక పోయాను అందరూ నిద్రపోయింతర్వాత, చప్పుడు చెయ్యకుండా, రఘునాథ్ బాబుగారి దగ్గర కెళ్ళి జరిగింది చెబుదామని, వెళ్ళటానికి కిందకెళ్ళాను అయ్యగారు, ఆ బూతాలిద్దరూ వరండా గదిలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు

వాళ్ళ మాటలు వినేవాళ్ళు ఎవరూ లేరనుకున్నారేమో పెద్దగానే మాట్లాడుకుంటున్నారమ్మా ఆయాసంతో మాట్లాడలేక, ఆగింది రాములమ్మ

ఏమనుకుంటున్నారు? నరసంగా అడిగింది స్వప్న శరీరంలో ప్రతి అవయవాన్ని కదల్చాలన్నా భరించలేనంత బాధగా ఉంది

"నా నోటితో ఆ మాటలు ఎలా చెప్పనమ్మా! మీకు, పిచ్చి పట్టిందని, ఆ పిచ్చిలో తెలియక వరలక్ష్మిని గొంతు పిసికి చంపబోయారనీ, లోగడ కూడా మీరు, ఆమెన్నూ, మోహినినీ ఇలాగే గొంతు పిసికి చంపబోయారంట మీకు పిచ్చి అనే అయ్యగారు మళ్ళీ పెళ్ళి చేసుకున్నారంట ఏదో ఒక రోజు పిచ్చిలో బాబును కూడా చంపుతారేమో అన్న భయంతో మిమ్మల్ని హాస్పటల్లో ఉంచుతారంట డాక్టర్‌తో ఇలా చెప్పి, మిమ్మల్ని మెంటల్ హాస్పటల్‌లో చేరుస్తారంట

అలా చెయ్యమని వరలక్ష్మి, అయ్యగార్కి, కూతురికి నచ్చ జెపుతుంది డాక్టర్ అలా వప్పుకోకపోతే, అతనికి కొంత డబ్బిచ్చి మిమ్మల్ని హాస్పటల్‌లో చేర్చుకునేలా చేస్తారంట అలా, పిచ్చిదానిగా మిమ్మల్ని హాస్పటల్‌కు పంపితే, మీకు మతిస్థిమితం లేదు కాబట్టి, ఆస్థి వ్యవహారాలన్నీ అయ్యగారు స్వయంగా చూసుకోవటానికి వీలవుతుందట అలా ముగ్గరూ కల్సి మిమ్మల్ని పిచ్చిదానిగా నిర్ణయించి హాస్పటల్‌కు పంపటానికి, ఆలోచనలు చేసారమ్మా రాత్రంతా' ఏడుస్తూ చెప్పింది రాములమ్మ

ఆమె చెబుతున్న ఒక్కొక్క మాటా, కత్తిలా స్వప్న గుండెల్ని



## ప్రేమసాగరం

చిలుస్తున్నాయి. మస్తిష్కం మొద్దుబారి పోయింది ఆలోచనల తీవ్రతతో, మానసికమయిన క్షోభతో, ఆమె హృదయం నలిగి పోతుంది గతం తాలూకు జ్ఞాపకాలు గుండె అట్టడుగు పొరల్లోంచి పైకొచ్చి ఆమెను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి నేను ప్రేమించిన జయరామేనా, నన్ను పిచ్చిదాన్నిగా సృష్టించి హాస్పటల్‌కు పంపించాలను కుంటున్నది?

ఆయన్ని దూరం చేసుకుని, ప్రశాంతంగా బ్రతకటం కంటే, నరకమయినా ఆయన సమక్షంలో అనుభవించటం హాయిగా ఉంటుందని నేననుకోవటమేనా? నేను చేసిన పొరపాటు

మైగాడ్! డబ్బుకోసం, మనుష్యులింత నీచానికి దిగజారిపోతారా? నువ్వు సృష్టించిన మనుష్యుల కంటే మనుష్యులు సృష్టించిన కాగితాలకే విలువ ఎక్కువా నాకు నేను పూర్తిగా అర్పించుకోవటం ద్వారానే, ఆయన్ని పూర్తిగా పొందగలనను కున్నాను ఆయన్ని అర్థం చేసుకోవటంలో ప్రతిసారి నా ఆలోచనలు తారుమారవుతూనే ఉంటాయి

'నేను ఆ రాత్రి సమయంలోనే, రఘునాధ్‌బాబు గారింటి కెళ్ళాను రాత్రి ట్రియిన్‌కు బెంగుళూరు వెళ్ళారంట వారం రోజుల వరకూ రారని చెప్పాడు వాళ్ళ తోటమాలి నాయర్‌కయినా చెబుదామనుకుంటే, అయ్యగారు వారందాకా రారుకదా అని నాయర్ బంధువులింటి కెళ్ళాడంట ఏడ్చుకుంటూ వచ్చేసానమ్మా.'

స్వప్నకు, ఆలోచించటానిక్కూడా శక్తి లేనట్టుగా కళ్ళు మూసుకుని పడుకుంది చివరకు తన జీవితం ఇలా ముగియబోతుందా? అనుకుంది విధికి ఎదురు ఈదటం మనిషికి సాధ్యం కాదు ఆ విధికి తలవంచటమే నేను చెయ్యగలిగింది గాఢంగా నిట్టూర్చింది

★ ★ ★ ★

డబ్బివ్వమని అతను ఫోన్‌మీద, ఫోన్ చేస్తున్నాడు జయరాంకు మాటపోతుందన్న భయంతో, మతిపోతున్నట్టుగా ఉంది దానికితోడు, మోహిని పెళ్ళాం దగ్గర డబ్బు తీసుకోవటం కూడా చాతకాదు మాటలు మాత్రం చెబుతారు అంటూ తేలికగా మాట్లాడటం, ఆమె పాటకు ఎప్పటిలా వరలక్ష్మి వంత. వాళ్ళ మూలంగా అతని కోపం, చికాకు మరింత ఎక్కువవుతున్నాయి

రెండు రోజుల్లో మీరు డబ్బివ్వకపోతే, షేర్ వదులుకోవలసి వస్తుందని చెప్పాడు అతను చెప్పి కూడా రెండు రోజు లవుతుంది షేరు వదులుకుంటే, నలుగురిలో చిన్నతనంగా ఉంటుంది. అందుకోసం షేరు వదులుకోలేక పోతున్నాడు స్వప్న డబ్బు ఇస్తుందన్న నమ్మకం లేదు ఎలాగయినా, చివరిసారిగా ప్రయత్నించి చూద్దామని, స్వప్న గదిలో కొచ్చాడు.

జయరాం గదిలోకి రాగానే, ఏదో పనున్నట్టుగా రాములమ్మ బయటకు వచ్చింది.

అడుగులు చప్పుడును బట్టి, వచ్చింది జయరాం అని తెలిసినా, కళ్ళు తెరవకుండా అలాగే పడుకుంది అతన్ని చూడాలన్నా, అతనితో మాట్లాడాలన్నా వంటిమీద తేళ్ళూ, జెర్రులూ పాకినంత కంపరంగా ఉంది స్వప్నకు

దెబ్బల మూలంగా, వళ్ళంతా నెప్పులు. మూడు పూటల నుంచి భోజనం లేకపోవటం మూలంగా, కడుపులో ఆకలి, ప్రాణం అన్నబట్టి పోతున్నట్టుగా ఉంది

ఆలోచనలు మనస్సును తొలిచి వేస్తున్నాయి మనస్సు ఆలోచించటం ఎప్పుడు మానివేస్తుందో! బహుశా మనిషి మరణించినప్పుడే కావచ్చు

"స్వప్నా!" అని పిలిచాడు బరువుగా కనురెప్పలెత్తి చూసింది

'నాకు డబ్బు కావాలి!'

'ఇవ్వను"

నిన్ను చంపయినా తీసుకుంటాను కసిగా అన్నాడు

"ఇప్పుడు నేను బ్రతికున్నానా?'

'నీలాంటి మొండిది చచ్చినా ఒకటే! బ్రతికినా ఒకటే!

"మీకు నేను లేను అలాగే, మీరు నాకు లేరు మీరేం చేసినా సరే నేను డబ్బు మాత్రం ఇవ్వను!"

చివరిసారిగా చెబుతున్నాను నా మాట వినకపోతే నీకు మెంటల్ హాస్పటల్ గతవుతుంది నీకు మతిస్థిమితం లేదు కాబట్టి, ఆస్థి అంతా నా స్వంత మవుతుంది నా మాట వింటే, ఇక్కడే పడి ఉండొచ్చు'

భర్త ఉదార స్వభావానికి, పెద్దపెట్టున నవ్వాలనిపించింది స్వప్నకు

'మాట్లాడవేం?"

"చెప్పానుగా ఇవ్వనని!'

'ఈ ఒక్కసారి కివ్వు పరువు పోతుంది

"పరువేకాదు ప్రాణం పోయే పరిస్థితి అయినా ఇవ్వను

ఎలా ఇవ్వవో నేనూ చూస్తాను

"మీ కనురెప్పల శాసనాలకే తలొంచే పూర్వపు స్వప్నను కాదు నేను "

'ఈ చెక్కు మీద సంతకం పెట్టు అంటూ చెక్కు పుస్తకం ఆమె ముందుంచాడు స్వప్న ఆ పుస్తకాన్ని అందుకుని, బలాన్నంతా కూడదీసుకుని లేచి ముక్కలు, ముక్కలుగా చింపి అతని ముఖంమీద విసిరి కొట్టింది జయరాం కోపంతో ఊగిపోయాడు విసురుగా వచ్చి స్వప్న జుట్టు పట్టుకుని, తన బలంకొద్దీ, తనిష్టం వచ్చినట్టు కొట్టాడు. ఆ దెబ్బలను భరించలేని స్వప్న స్పృహకోల్పోయి, తోటకూర కాడలా నేలమీద వాలిపోయింది

కళ్ళు తెరిచి చూసేసరికి, హాస్పటల్ రూములో ఉంది రాములమ్మ వచ్చి చెప్పేవరకూ, అది మెంటల్ హాస్పటల్‌అనీ, తను రెండు రోజుల నుంచి స్పృహలేని స్థితిలో, స్పెషల్ రూములో ఉన్న సంగతి కూడా స్వప్నకు తెలియదు

పూర్తిగా తెలివి వచ్చిం తర్వాత, జరిగిందంతా అర్థమయింది. తనను పిచ్చిదానిగా సృష్టించి, హాస్పటల్‌లో జయరామే ఉంచాడని తెలిసినా, ఈ స్థితిలో తను పిచ్చిది కాదని చెప్పినా, తన గోడు పట్టించుకునేవారు ఎవరూ ఉండరని పిచ్చిదానిగానే, ఆ రూములో ఉంది

(ఇంకా ఉంది)

# నెలవులు

టి. ఎస్. ఎ. కృష్ణమూర్తి

"బస్తీ కెళ్ళి బ్రతకాలని నిశ్చయించుకునేశాను మామా!" అన్నాను.

రంగప్పమామ చూపులలో చాల ఆశ్చర్యం కన్పించినా "నీ ఇట్టంరా!" అన్నాడు నవ్వి. ఆయనలోని గొప్పదనం అదే ఎవరినీ, ఎందుకూ ఆటంక పరచడు

"ఒకపూట మాత్రం తిండి పెట్టి రోజుకి నాలుగు రూపాయలు కూలి ఇస్తారు మన వూర్లో. అదే బస్తీలో అయితే రోజుకి పదిహేను రూపాయలు సునాయాసంగా సంపాదించుకోవచ్చు!" అన్నాను

"ఖరుసు కూడా ఉంటుందనుకుంటాన్రా అబ్బీ!" అన్నాడు ఆయన.

"ఎంతలా ఖర్చు చేసినా రోజుకి కనీసం ఓ అయిదు రూపాయలు మిగిల్చుకోవచ్చు మామా! ఇక్కడ పని వున్న రోజు ఉంటుంది. లేనిరోజులలో మనం పడే బాధలో? అందుకే బస్తీకెళ్ళి ఏదో ఒక పని వెతుక్కుందామని అనుకుంటున్నాను అమ్మ కష్టం, సుఖం నీవే కనిపెట్టుకు నుండాలి. ఉత్తరాలు నీకే వ్రాస్తాను డబ్బు కూడా నీ పేరిటే పంపుతాను అమ్మకు అందజేస్తూండు!"

"నీ ఇట్టంరా!"

"రేపు ఉదయాన్నే బయల్దేరి వెళ్ళి పాలకొండ స్టేషన్లో రైలెక్కి వెళ్తాను"

"మంచిదిరా! చేమంగా ఎళ్ళిరా!"

'క్షేమంగా వెళ్ళి లాభంగా తిరిగిరా!' అనలేదు రంగప్పమామ. అయితే నేను ఆ విషయాన్ని అంతగా పట్టించుకోలేదు

ఇతరుల పనుల మీద అనేక పర్యాయాలు బస్తీకి వెళ్ళి వచ్చిన వాడ్నే బస్తీలో చాల ప్రదేశాలు తెలుసు ఒకరిద్దరు ముఖ పరిచయస్తులు కూడా వున్నారు ఏ పని దొరికినా నా పల్లెలో కన్నా నాలుగు రూపాయలు ఎక్కువగా సంపాదిచుకోగలననే నమ్మకంతో బయల్దేరాను.

* * * * *

బస్తీ.... ఇక్కడ నివసించే మనుషులు చిత్రమ్మైన వాళ్ళు! సాటి మానవుడు నడి రోడ్డుమీద దిక్కులేని చావు చచ్చిపోతున్నా పట్టించుకునేవారు అరుదు ఇక్కడ. ఇక్కడి మనుషులకు ఎదుటి వాళ్ళనుగూర్చి ఆలోచించే ఓపికా, తీరికా సామాన్యంగా వుండవు. ఎక్కువభాగం మనుషులు తమ పనులలో తాముంటారు తప్ప ఎదుటివారి బాధలవైపు కన్నెత్తి చూడరు పన్నెత్తి పలకరించరు

బస్తీలో నాలుగు రోజులు చెడ తిరిగిన తరువాత, పల్లెనుండి తెచ్చుకున్న డబ్బు పూర్తిగా ఖాళీ అయిపోబోతూవుండగా నాకు ఒక చక్కని పని దొరికింది

రిక్షా త్రొక్కడం!

బస్తీలో నాకు తెలిసిన రామరాజుగారనే పెద్ద మనిషి నన్ను నమ్మి నాకు ఒక రిక్షా అద్దెకు ఇప్పించాడు రిక్షాకి రోజుకి ఐదు రూపాయలు అద్దె చెల్లించాలి. రాత్రింపవళ్ళు రిక్షా నావద్దే ఉంచుకోవాలనుకుంటే రోజుకి ఏడు రూపాయలు చెల్లించాలి

ఆనందంగా రిక్షా త్రొక్కడం మొదలుపెట్టాను

మొదటి రెండ్రోజులూ రిక్షా అద్దె చెల్లించగా నాకు మిగిలిన డబ్బులు నా భోజనానికే సరిపోలేదు ఎందుకంటే రిక్షా త్రొక్కడం క్రొత్తగా నేర్చుకుంటున్నవాడ్ని కాబట్టి ఎక్కువ బాడుగలు త్రొక్కలేకపోయాను

మూడవ రోజు నుండి ఎక్కువ బాడుగలే త్రొక్కసాగాను అయినా నేను సంపాదించిన డబ్బులు నా కడుపుకే సరిగ్గా సరిపోవడంలేదు రిక్షా త్రొక్కడం అంటే ఏమిటో అనుకున్నాను కానీ రిక్షా త్రొక్కడంవల్ల ఆకలి ఆకలి విపరీతమ్మైన ఆకలి ఎన్నిసార్లు తిన్నా, ఎంత తిన్నా భస్మం అయిపోతోంది

చివరికి నేను గ్రహించిన దేమిటంటే హొటల్లలో నేను అన్నం తింటూ రిక్షా త్రొక్కాలంటే మా అమ్మకు పంపడాన్కి నెలకి పది రూపాయలు కూడా మిగల్చలేను. అందుకే నంజప్ప పూటకూళ్ళ ఇల్లు కనుక్కొని అక్కడ సంగటి ముద్దలు తినడం మొదలుపెట్టాను

నాకు మూడు రకాలుగా ఆనందం లభించింది మొదటిది... సంగటి తినడంవల్ల నేను కొంత డబ్బు మిగిల్చగలుగుతున్నాను. రెండవది ...నాకు సంగటి అంటే ఇష్టం. చివరిది రిక్షా త్రొక్కడం వల్ల కలిగే అధిక క్షుద్బాధను నివారించ గలుగుతోంది సంగటి

నా కాళ్ళలో, నా జబ్బల్లో బలం వుంది. నా రక్తాన్ని - చమటగా మార్చి రిక్షా త్రొక్కి డబ్బు సంపాదిస్తున్నాను కానీ. .

* * * *

ఒక రోజు సంఘం టాకీసు వద్ద ఓ లావుపాటి పోలీసు నా రిక్షాలో ఎక్కాడు త్రీ టవున్ స్టేషన్ వరకూ రెండున్నర మైళ్ళు ఎండలో పడి రిక్షా త్రొక్కి తీసుకెళ్తే డబ్బు లివ్వకుండా వెల్తున్నాడు. అడిగితే.. "మక్కెలిరగదన్ని లోపల తోస్తాను వెధవనా కొడకా!" అని తిట్టి మరీ పోయాడు.

ఉసూరుమంటూ నిలబడి పోయిన నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి మా ఊరి రెడ్డి కూడా నాలాంటి వాళ్ళను అప్పుడప్పుడు తన పొలంలో పని చెయ్యడాన్కి తీసుకెళ్ళి పని చేయించుకుని డబ్బు లివ్వడు. కానీ తిట్టడం మాత్రం చెయ్యడు. కడుపు నిండా తిండి పెట్టిస్తాడు కూడా.

మా ఊరి రెడ్డే నయం అన్పించింది.

స్టేషను బయట ఎండలో పసి పిల్లల్ని ఇద్దర్ని పొదివి పట్టుకుని ఏడుస్తూ కూర్చుని ఉంది ఓ స్త్రీ. ఆమె భర్త ఏదయినా ఘణకార్యం చేసి లోపల ఆదిత్యం స్వీకరిస్తున్నాడేమో? ఎండలో కందిపోతున్న ఆ పసి కందమ్మలనూ, దుఃఖంతో తల్లడిల్లుతున్న ఆమెనూ చూశాక ఆ పోలీసు డబ్బులివ్వనందుకు కలిగిన బాధ తగ్గిపోయింది నాలో. వాళ్ళకేసి జాలిగా చూసి అక్కడ్నుండి భారంగా బయల్దేరాను

ఇంకో రోజు రాత్రి పండ్రెండు గంటల దాకా బాడుగల కోసం కాచుకుని చిన్న ఎలక్ట్రిసిటీ ఆఫీసు ప్రక్కగా రిక్షా ఆపుకుని రిక్షాలోనే నిద్రపోయాను అక్కడ రిక్షాలు ఆపరాదట ఆ విషయం నాకు తెలియదు తెల్లగా తెల్లవారక మునుపే రిక్షా చక్రాల వాల్వ్‌ట్యూబులు అన్నీ తీసి కాలువలో పారవేశాడు ఆ ఆఫీసు తాలూకు ఉద్యోగి ఎవరో.

వరుసగా చక్రాలలో గాలి పోయిన శబ్దానికి నిద్ర లేచిన నేను "ఏమిటి ఈ అన్యాయం?" అని అడిగితే కొట్టడానికే వచ్చాడు

నా కడుపు కాలిపోయింది మా ఊర్లోనూ కర్కోటకు లున్నారు కానీ కడుపులమీద కొట్టే వాళ్ళు మాత్రం లేరు నెత్తీ నోరూ బాదుకోబోయి ఎదురుగా కన్పించిన దృశ్యం చూసి ఆగిపొయ్యాను

రోడ్డుకు అవతల వైపు వున్న హొటలు వరండాలో రాత్రెప్పుడో వచ్చి చలికి ముడుచుకుపోయి పడుకున్న అభాగ్యుల మీద బక్కెట్లతో నీళ్ళు చల్లుతున్నాడు హొటలు తాలూకు మనిషి.

నన్ను గూర్చి బాధపడకుండా ఆ అభాగ్యులన్ను గూర్చి చింతిస్తూ రిక్షాను లాక్కొని బయల్దేరాను.

ఒక్క సైకిలు షాపూ తెరవ లేదు ఎక్కడా అప్పటికి.

బారెడు ప్రొద్దెక్కాక తెరచిన ఓ సైకిలు షాపులో నాలుగు రూపాయలు ఇచ్చి వాల్వ్‌ట్యూబులు వేయించుకుని గాలి కొట్టుకుని బయల్దేరితే.... ఆ రోజంతా కటకటే! రిక్షా అద్దె డబ్బులు సంపాదించుకోవడమే గగనమై పోయింది.

రిక్షా త్రొక్కడానికి లైసెన్సుండాలని తెలియదు

నాకు. ఎవరూ చెప్పనూ లేదు. ఓ రోజు ఓ పోలీసు లారితో బాది నా వద్ద పది రూపాయలు గుంజుకు పోయాడు. నేను లైసెన్సు లేకుండా రిక్షా నడుపుతున్నందుకు లైసెన్సు తెచ్చుకోవడానికి వారం రోజుల కూలిపాటు పోయింది.

రిక్షాకి కూడా లైసెన్సుండాలని తెలీక పోవడంతో ఓ రోజు రిక్షాని మునిసిపాలిటీ వాళ్ళు పట్టుకు పోయారు. రిక్షాయజమానిని లైసెన్సు గూర్చి అడిగితే "నేను నీకు రిక్షా ఇచ్చినప్పుడు దానికి లైసెన్సు బిల్లా ఉంది ఫో!" అనేశాడు ఇహ చేసేది లేక పది రూపాయలు పెట్టి లైసెన్సు బిల్లా కొని రిక్షా తెచ్చుకోవాల్సి వచ్చింది.

ఆ మరునాడే రోడ్డు వారగా నిలబెట్టి వున్న నా రిక్షా రాంగ్‌సైడ్‌లో ఉందంటూ కేసు పెట్టాడు ట్రాఫిక్ పోలీసు. అకారణంగా ఐదు రూపాయలు అపరాధం క్రింద కట్టాల్సి వచ్చింది కోర్టులో.

ఈ బాధలన్నీ తెములుల్చుకుని రెండు రూపాయలు సంపాదించే ప్రయత్నంలో నేనుండగా నా సైకిలు రిక్షాకి ఫోర్కు విరిగి పోయింది. రిపేరి చేయించమంటే "విరగ్గొట్టింది నీవే కాబట్టి నీవే రిపేరి చేయించాలి" అంటాడు రిక్షాయజమాని

చివరికి నేను గ్రహించిన దేమిటంటే ఈ వెధవ రిక్షా త్రొక్కడం కన్నా సినిమా హాల్లో వేరుశనక్కాయలు అమ్ముకోవడం నయం! అని.

అందుకే రిక్షాకి ఓ నమస్కారం పెట్టి వదిలేసి రామరాజుగారి సహాయంతో ఓ హోటల్లో సప్లయిర్‌గా చేరాను.

"శ్రమ తక్కువ, తిండిని గూర్చిన సమస్య అసలుండదు, అమ్మకి పంపించడానికి, ఇంతో అంతో మిగిల్చుకోవడానికి ఇబ్బంది లేదు" అనుకుని ఆనందపడి పోయాను. కాని ..

* * * *

"కాఫీ చెప్పి ఎంతసేపయిందయ్యా?"

"దోశ ఇలా మాడి తగలడిందేమోయ్!"

"ఒరేయి త్వరగా తీసుకురారాపెసరట్!"

"నీళ్ళేవిరా బుజ్జితండ్రీ!"

ఇలాంటి మర్యాదలు అందుకుంటూ నా పని ప్రారంభించాను.

సహజంగా హోటల్ సప్లయర్లని చాలా అగౌరవంగా చూస్తారు మనుషులు. కొందరయితే మీదపడి కొట్టడానికి వచ్చినంత పని చేసేవాళ్ళు. 'వీడూ మనలాంటి మనిషే!' అనే సహృదయంతో ప్రవర్తించే వాళ్ళు తక్కువమంది

చాల ఓపికగా అన్నీ భరించసాగాను... కానీ... నాకు ఆ యోగం లేదు. నాన్న బ్రతికి ఉన్నప్పుడు ఎప్పుడో చదివిన వానాకాలపు చదువు ఆ సప్లయర్ పనికి చాలక పోవడంతో బిల్లులు వేయడంలో పొరపాట్లు చెయ్యసాగాను.

హోటల్‌కు వచ్చే వారి వద్ద డబ్బులు లంచంగా తీసుకుని బిల్లులు తక్కువ వేస్తున్నానని అనుమానించి మెడపట్టి మరీ గెంటేశారు హోటలు యజమాని.

మా ఊరే నయం. తప్పు చేసిన వాడి మెడ మీద కూడా చెయ్యి వెయ్యరు ఎవరూ. అపరాధం వేస్తారంతే!

ఈ పర్యాయం రామరాజుగారి సహకారంతో ఓ సైకిలూ, ఓ పాల క్యానూ అద్దెకు తీసుకుని పాల వ్యాపారం ప్రారంభించాను రోజూ చీకటితో నే చుట్టుప్రక్కల వున్న పల్లెటూర్లకు వెళ్ళి పాడి పశువులున్న వారి వద్ద పాలుకొని తీసుకువచ్చి టీ దుకాణాలకు వెయ్యడం ప్రారంభించాను. నా తిండి తిప్పలు జరిగిపోయి రోజుకు పది రూపాయల రాబడి కన్పించింది. ఆనందమే కదా?! కానీ. ...

* * * * *

"ఏయ్! సైకిలు ఆపు!"

సైకిలు ఆపాను.

కాఖీ బట్టలలో వున్న ఆ యువకుడు నా దగ్గరగా వచ్చాడు.

"రోజూ ఈ త్రోవమ్మటే వస్తావు కదూ?"

"అవును!"




'రోజూ ఆ ఎదురింట్లో ఓ లీటరు పాలు వేసి వెళ్ళు!"

"అలాగే బాబూ! ....డబ్బులు ఏ రోజు కారోజు ఇస్తారా? వారానికి ఓ సారా?"

అతను పగలబడి నవ్వాడు.

"ఆ ఇల్లు ఎవరిదనుకుంటున్నావు?"

"ఎవరిది బాబూ?"

"హెల్తు ఆఫీసరు వారి ఇల్లు అది. రేపట్నుండి పాలు వెయ్యి. పాలు చిక్కగా వుండాలి. డబ్బులు గిబ్బులు అడగకు... జాగ్రత్త!"

"వెయ్యక పోతే బాబూ?"

"నీ పాలు డబ్బిచ్చి కొని బాటిల్లలో పోసి సీలు చేసి రాజధానికి శాంపిల్ పంపిస్తాము. రిజల్టు రాగానే కోర్టుకు లాక్కు వెళ్ళి కేసు పెడ్తాము ఆర్నెల్లకి తక్కువ కాకుండా జైలు శిక్ష పడుతుంది ఫైనాల్టీ కూడా ఓ అయిదు వందలుండ వచ్చు!"

ఆ మరుసటి రోజు నుండి ఒక లీటరు పాలు ఉచితంగా ఆ మేస్త్రీ చూపిన ఇంటిలో వేయసాగాను.

నాలుగు రోజులు గడిచాయి.

"ఒరేయి ఆ క్యానులో ఎన్ని లీటర్లున్నాయిరా పాలు?"

"పదహారు లీటర్లు బాబూ!"

"ఆరు లీటర్లు ఆ స్టీలు డ్రమ్ములో పోసి పోరా!"

క్రూరంగా వున్న ఆ పేట రౌడిని చూసి భయపడుతూ ఆరుంపావు లీటరు కొలచి స్టీలు డ్రమ్ములో పోశాను.

"బాబూ! డబ్బులు....."

"సవిటి కాలువలో తోసి బోడి కొట్టిస్తానులం. ..! మా దాదా వాళ్ళ బంధువుల పెళ్ళికి కాసిన్ని పాలు

# ఇ'వేమన'పద్యాలు




కనగ సొమ్ములెన్నొ కనకంబు నొక్కటి
పసుల వన్నెలెన్నొ పాలు నొకటి
పుష్ప జాతులెన్నొ పూజ యొక్కటే సుమీ
విశ్వదాభిరామ వినురవేమ.

అడిగితే డబ్బు లడుగుతావా? ప్రతిరోజూ ఇస్తావేం రా బాడూష్! పరిగెత్తు... ఇక్కడే వుంటే క్యాను లాక్కుని తన్ని తగలేస్తాను!"

అంటూ తిట్టి అటుగా వస్తున్న మరో అభాగ్యుడి పాల క్యాను ఆపవలసిందిగా పురమాయించాడు తన సహాయక రౌడీని.

మండే గుండెతో, కాలే కడుపుతో, రగిలే మనసుతో వనికే కాళ్ళతో అక్కడ్నుండి బయల్దేరాను. సైకిలు నెట్టుకుంటూ 'దరిద్రుడికి సముద్రుడు కూడా మోకాలి లోతే!' అన్పించింది.

## నెలవులు

మా ఊర్లో అయితే పాలను అమృతంలా భావిస్తారు. కరణంగార్ని ఇంట్లో వాళ్ళు గూడా పాలు ఉచితంగా తీసుకోరు ఎవరి వద్దా! కానీ ఈ జనారణ్యంలో......'

అలాంటి అనుభవాలే మరో రెండుమూడు లభించిన తరువాత పాల వ్యాపారం మానేసి రామరాజుగారి చెప్పుల షాపు ప్రక్కగా ప్లాట్‌ఫారం మీద టీ దుకాణం పెట్టాను. కాలే కడుపుకు మండే గంజి అన్న చందంలా నాలుగు రూపాయల రాబడి కన్పించింది అందులో నూ కాని

★ ★ ★ ★ ★

రోడ్డు మీది టీ దుకాణానికి మునిసిపల్ లైసెన్సు తెచ్చుకుని, ప్రొఫెషన్ టాక్సు, లేబర్ టాక్సు కట్టిన తరువాత కూడా పోలీసులకూ, రౌడీలకూ, హెల్తు మేస్త్రీలకూ .. రోజుకి పాతిక మందికి తక్కువ కాకుండా ఉచితంగా టీ కాఫీలు ఇవ్వాల్సి వచ్చింది

ప్లాట్‌ఫారం దుకాణం కాబట్టి వర్షం పడే రోజులలో, ఊర్లో ఏవైనా మినిస్టర్ ప్రోగ్రాంలున్నప్పుడూ నా పని శూన్యం అయిపోయేది. పైగా టీ త్రాగి గ్లాసు జేబులో వేసుకుని వెళ్ళిపోగల చతురులనూ, డబ్బులివ్వకుండా జారుకో గల పెద్దమనుషులనూ కనిపెట్టి వుండడం కష్టంతో కూడుకున్న పని.

ఒక్కరోజు పాలు చెడిపోతే నాలుగు రోజుల ఆదాయం పోయినట్లే!

★ ★ ★ ★ ★

"టీ షాపు కూడా నాకు అచ్చిరాదు కానీ మరేదయినా దారి చూపించండి బాబయ్యా!" అన్నాను చివరికో నాడు

చాచి లెంపకాయ కొట్టారు రామరాజుగారు కళ్ళు తిరిగి కూలబడ్డాను ఆయన కాళ్ళ వద్దే!

చిన్నతనంలో వీధి బడిలో చదివిన ఓ పద్యం జ్ఞాపకానికి వచ్చింది

"కమలములు నీట బాసిన కమలాత్ముని
రస్మిసోకి కమలిన్ భంగిన్,
తమ తమ నెలవులు తప్పిన తమ మిత్రులె
శతృ.. .. . ."

"ఒరేయి నీలాంటి వాళ్ళు ఇలాంటి ఊర్లలో బ్రతకాలంటే దేశం చాల మారాలి. పైవాడు, క్రిందివాడు అదే తేడా ల్లేకుండా మనిషి మనిషిగా బ్రతికే రోజులు రావాలి అలాంటి మార్పు ఇప్పట్లో రాదు, అలాంటి రోజులు కనుచూపు మేరలో లేవు కాబట్టి నీ వూరు వెళ్ళిపోయి నీ పాత బ్రతుకే బ్రతుకు నీకు అదే మంచిది!" అన్నాడు ఆయన.

"నిజం! అదే మంచిది!!" అనుకున్నాను మనసులో

ఆ మరునాడు తెల్లవారు ఝామున్నే నా చేతి సంచి భుజానికి తగిలించుకుని రైల్వే స్టేషను కేసి నడిచాను

★ ★ ★ ★ ★

"గంజో, అంబలో త్రాగి మన ఊర్లోనే బ్రతకాలని వచ్చేశాను మామా! ఇక భస్తీ ఛాయలకు కూడా వెళ్ళదలచుకోలేదు!" అన్నాను.

రంగప్ప మామ చూపులలో ఆశ్చర్యం కన్పించలేదు.

"శుభం! కలకాలం సుఖంగా బతుకు!" అన్నాడు.

చదువు సంధ్యలు లేనివాడయినా లోకం చూసినవాడు రంగప్ప మామ. నేను బస్తీకి వెళ్ళేప్పుడు "క్షేమంగా వెళ్ళి లాభంగా తిరిగిరా!" అని ఎందుకు ఆశీర్వదించలేదో అర్థం అయింది నాకు □

# మాటలకు మౌనానికి మధ్య మధుర క్షణాలు

ఏదియేమయినా ఫరవాలేదనుకొనే మధుర క్షణాలు మీ జీవితంలో ఎన్నో. మౌనసామ్రాజ్యం వొడిలో ఉద్వేగపూరితమైన నవ్వుతో—ఏకమైన వేళ, ఇంకెవ్వరూ, కాదు ఈ ప్రపంచమే ఏమైనా ఫరవా లేదు నిజమే. మీకు ఈ మధుర క్షణాలకు మధ్య ఏదీ అడ్డురాకుండా ఉండేందుకు అవసరమైనది కోహినూర్ లేత ఎఱుపు మీ మృదువైన ఆలోచనలకు సున్నితత్వానికి రక్షణనిస్తుంది శ్రేష్ఠమైన లేటెక్స్‌తో తయారుచేయబడినది. పూర్తి రక్షణ నివ్వడానికి ఎలెక్ట్రానిక్ సాధనాలతో పరీక్ష చేయ బడినది. మృదువుగా ఉండేందుకు ల్యూబ్రికేట్ చేయబడింది.




**KOHINOOR**

లేత ఎఱుపు సుకుమారమైన కండోం

TTK తయారీ.

## విద్య అంటే?

విద్య అంటే పిల్లలకు చదువు, వ్రాత , లెక్కలు చెప్పడం మాత్రమే కాదు అంతకన్నా ఉన్నతమైంది విద్య అంటే పిల్లల వ్యక్తిత్వం, శీలం, నైపుణ్యం మొదలయిన గుణాలను అభివృద్ధి పరచడం – అని రాష్ట్ర గవర్నర్ శ్రీమతి కుముద్ బెన్‌జోషి మార్చి 29న వాసవీ పబ్లిక్ స్కూలు వార్షికోత్సవంలో ప్రసంగిస్తూ అన్నారు. విద్యారంగంలో ఉపాధ్యాయుల, తలిదండ్రుల పాత్ర ప్రాధాన్యాన్ని గవర్నరు నొక్కి చెబుతూ, పిల్లలలో జాతీయతా లక్షణాలను ఉద్బుద్ధం చేయడానికి జీవితాన్ని అంకితం చేయగల ఉపాధ్యాయులు అవసరమని ఆమె అన్నారు విద్యారంగం బహు విస్తృతం గనుక ప్రభుత్వం మాత్రమే దానిని నిర్వహించడం కష్టమని, స్వచ్ఛంద సంస్థలు, కూడ తమ వంతు బాధ్యతను నిర్వహించాలని ఆమె సూచించారు వాసవీ ఎడుకేషన్ అకాడెమీ ప్రధాన పోషకులు, బీహార్ గవర్నర్ శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య ప్రసంగిస్తూ, విద్య వ్యాపారంగా పరిణమించిందని విచారం ప్రకటించారు. విద్యను ఈ వ్యాపారపు కుళ్ళు నుంచి తొలగించి, బీదలకు, దళితులకు అందుబాటులో వుండేట్లు చేయాలని ఆయన కోరారు. వాసవీ అకాడెమీ చేస్తున్న సేవను ఆయన ప్రశంసించారు. మాజీమంత్రి శ్రీ కె రోశయ్య కూడ వాసవీ సంస్థ సేవను కొనియాడారు. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ శ్రవణ్‌కుమార్ సతీమణి శ్రీమతి జీవన్‌లతా విద్యార్థులకు బహుమతి పంచిపెట్టారు

## సుందరయ్యా స్మారక విజ్ఞాన కేంద్రం :–

భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ సంస్థాపకులలో ఒకరైన శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య స్మారకార్థం బాగ్‌లింగంపల్లిలో నిర్మించనున్న సుందరయ్య విజ్ఞాన కేంద్రానికి మార్చి 28న సి పి ఐ ఎం. ప్రధానకార్యదర్శి, కేరళ మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఇ ఎం ఎస్ నంబూద్రిపాద్ శంకుస్థాపన చేశారు శ్రీ సుందరయ్య కమ్యూనిస్టు ఉద్యమానికి పర్యాయపదంగా వుండే వారని, ఆయన రచనల అధ్యయనం దేశ ఆర్థిక, రాజకీయ విధానాల అధ్యయనం కాగలదని శ్రీ నంబూద్రిపాద్ అన్నారు. ఈ స్మారక విజ్ఞాన కేంద్రం శ్రీ సుందరయ్య రచనల, ప్రపంచమంతటా వున్న తక్కిన కమ్యూనిస్టు విప్లవకారుల రచనల అధ్యయన పరిశోధనలకు కేంద్రం కాగలదని ఆయన అన్నారు.

# హైదరాబాదు నోట్‌బుక్

ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు ప్రసంగిస్తూ, గొప్ప తెలుగు నాయకుడైన శ్రీ సుందరయ్యను గౌరవించడం తెలుగువాడుగా తన కర్తవ్యమని అన్నారు నేను సుందరయ్యగారిని మూడుసార్లు మాత్రమే కలుసుకొన్నాను. 1983 లో తొలిసారిగా ఎన్నికల పొత్తు కోసం కలుసుకొన్నాను అప్పుడు పొత్తు కుదరలేదు రెండవసారి 1985 లో కలుసుకొన్నాను అప్పుడు రెండు పార్టీల మధ్య అవగాహన ఏర్పడింది. సుందరయ్య త్యాగమయ జీవితం, తాను నమ్మిన సిద్ధాంతాలకు అంకితం కావడం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. అటువంటి నాయకునికి మనం చేయదగిన సేవ రాజకీయాల్ని కాలుష్యం నుంచి ఉద్ధరించడం. కమ్యూనిజమంటే ఏమిటని ఎందరినో అడిగాను ఎవ్వరూ సంతృప్తికరమైన సమాధానం చెప్పలేదు. సమాజం ఒక కమ్యూన్ (పరివారం) వంటిది సమాజంలోని ప్రతివారూ సమానులు. సమాజం ఉత్పత్తి చేసిన దానిని అందరూ సమానంగా పంచుకోడం – ఎలాటి దోపిడీ లేకుండా ఇదే కమ్యూనిజమని నాకు తోస్తుంది – అని శ్రీ రామారావు అన్నారు కేంద్ర నిర్మాణానికి స్థలాన్ని రాష్ట్రప్రభుత్వం ఉచితంగా ఇచ్చింది శ్రీ మోటూరి హనుమంతరావు తమ ప్రసంగంలో ఈ విషయాన్ని ప్రస్తావించి సి పి ఎం తెలుగుదేశం పార్టీకి మిత్రపక్షమయినందున రాష్ట్రప్రభుత్వం స్థలాన్ని ఉచితంగా ఇచ్చిందని అపోహపడ నక్కరలేదని అన్నారు సుందరయ్య వంటి నాయకుని సేవకు ఏ ప్రభుత్వమైనా తోడ్పడగలదని అన్నారు సి పి ఐ. ఎం రాష్ట్రసంఘం ప్రధానకార్యదర్శి శ్రీ ఎల్. బాలగంగాధరరావు ప్రసంగిస్తూ, ఈ స్మారక కేంద్ర నిర్మాణానికి 50 లక్షల రూపాయలు అవసరమని, సి పి ఐ ఎం. రాష్ట్రసంఘం ఇంతవరకు 30 లక్షలు సేకరించిందని వివరించారు

## శ్రీ కోన ప్రభాకరరావు :–

గవర్నర్ పదవికి రాజీనామా ఇచ్చిన శ్రీ కోన ప్రభాకరరావు మార్చి 29న సపరివారంగా బొంబాయి నుంచి హైదరాబాద్‌కు తిరిగి వచ్చారు. బొంబాయి విశ్వవిద్యాలయ వ్యవహారాలలో జోక్యం చేసుకోడం వల్ల శ్రీ ప్రభాకరరావు తమ పదవికి రాజీనామా ఇవ్వవలసి వచ్చింది. ఆయన ప్రజాభిప్రాయం ఒత్తిడికి తట్టుకొలేక ఈ పని చెయవలసి వచ్చింది. శ్రీ రావు జోక్యం బొంబాయి విశ్వవిద్యాలయాన్నే కాక, రాష్ట్ర ప్రభుత్వాన్ని కూడ సంచలింపజేసింది. విశ్వవిద్యాలయం సంప్రదాయాలను, స్వతంత్ర ప్రతిపత్తిని భగ్నం చేస్తూ ప్రభుత్వము, గవర్నరు జోక్యం చేసుకొనడం ఉచితం కాదంటూ బొంబాయి విశ్వవిద్యాలయం సెనెట్ అభిశంసనం చేసింది మార్చి మూడవ వారంలో పూనా విశ్వవిద్యాలయం ఈలాటి అభిశంసననే తెలిపింది గవర్నర్ రాజీనామా చేయాలని పూనా మునిసిపల్ కార్పొరేషన్ తీర్మానించింది. తన చాన్సలర్ పదవిని దుర్వినియోగం చేసినట్లు జరిగిన ఆరోపణలు నిరాధారమని కాని, తన వైఖరి ఇది అని కాని శ్రీ కోన ప్రభాకరరావు వివరించడం మాని, పదవికి రాజీనామా యిచ్చేపు ఇటీవల ఆయన బొంబాయి విశ్వవిద్యాలయం స్నాతకోత్సవంలో ప్రసంగిస్తూ అవినీతికర పద్ధతుల వల్ల పరీక్షా విధానం పైనే ప్రజలకు విశ్వాసం పోయిందన్నారు ఆ మాటలు ఇంకా జనం కర్ణకుహరాలలో ప్రతిధ్వనిస్తుండగానే అవినీతికరమైన జోక్యం ఆరోపణలకు సమాధానం చెప్పకుండా రాజీనామా ఇవ్వడం విచిత్రమని జనం భావిస్తున్నారు ఇది వరకు ఉత్తరప్రదేశ్ గవర్నరుగా వున్న నాయకులొకరు తమ ఆశ్రితుడైన ఒక జ్యోతిర్వేత్తకు గౌరవ డిలిట్ బిరుదం ఇవ్వవలసిందని ఒత్తిడి చేయడం, వైస్ చాన్సలర్ ఈ విషయాన్ని అప్పటి ప్రధానికి ఫిర్యాదు చేయడం, ఆ గవర్నరు కూడ రాజీనామా ఇవ్వడం జరిగాయి విద్యారంగం బాగుపడాలంటే, పరిపాలకుల జోక్యం వుండరాదు విద్యాసంస్థల నిర్వాహకులు అలాటి జోక్యాన్ని ప్రతిఘటించగల గుండె దిటవుతో వుండాలి

## ఉపశ్రుతి :–

మిత్రులు శ్రీ గిట్ల జనార్దనరెడ్డిని ఇటీవల కలుసుకొన్నాను ఈయన కరీంనగర్ జిల్లా ప్రముఖ నాయకుడు, మాజీ ఎం ఎల్ సి (మంథని). ఏం సార్, మీరింత ప్రముఖులు, ఏ పదవీ రాలేదా? – అనడిగాను ఎవరో ఆయన దిండులు (తలగడలు) సవరించే వారు కారు, దండలు వేసేవారు కారు, గుండెలు కోరికే వారూ కారు. ఎలా వస్తాయి పదవులు? – అని ఆయన అభిమానులలో ఒకరు సమాధానమిచ్చారు

–తిరుమల రామచంద్ర

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor S Radhakrishna, Phones -Business 61247, 61248, Editorial · 75667*




ఓ. ఎ. వి. భైపల్లి

★ మారుతున్న ఈ సమాజంలో మంచివాడుగా గుర్తించే దెన్నడు?

● లాభం లేదయ్యా. నిన్ను మంచివాడని గుర్తించేసరికి – మళ్ళీ సమాజంలో విలువలు మారిపోయే ప్రమాదం వుంది. అంచేత – మంచివాడని అందరూ గుర్తించాలని తాపత్రయపడే బదులు మంచివాడిగా బ్రతికేస్తూండటం మంచిది కదా?

టి. ఎ. వి. ఎమ్మిగనూరు

★ ఈ చిన్న జీవితంలో ఆనందం శాతమెంత?

● 0.001% కూడా వుండక పోవచ్చు.

★ కోయిలకే భాషా జ్ఞానముంటే ఏం జరిగేది?

● వద్దు. 'కోకెత్తు కెళ్ళింది కొండగాలీ' అనో 'హవ్వ గుద్దనా?' అనో పాటలు పాడ్డం మొదలెట్టే ప్రమాదం వుంది! దాన్ని భాషాజ్ఞానం లేకుండానే వుండనివ్వండి– కూస్తుంది.

★ కామి కానివాడు మోక్షకామి కాదు అంటారు?

● నిజమే. ఈ లోకపు కష్టసుఖాలు తెలియని వాడికి మోక్షం మీద మమకారంలో అర్థం వుండదు.

★ ఒంటరి తనం నికృష్టమా?

● అని ఎవరన్నారు? అర్థం లేని మాట. కోరుకున్న ఒంటరి తనంలో హాయి వుంటుంది.

★ ఆనందమనేది శరీరానికి సంబంధమా? మానసికానికి సంబంధమా?

● రెండింటికీను.

టి. బి. బయిపల్లి

★ కొంత మంది ప్రేమ విఫలమైతే దేవదాసుల లాగే తయారవుతా రెందుకు?

● బాధ్యత తెలియక!

★ చదువుకు సంస్కారానికి మధ్య పోలిక?

● రెండూ నాణేనికి రెండు పక్కలు కాని చదువు లేకున్నా సంస్కారం వున్నవాళ్ళున్నారు. సంస్కారం లేకుండా చదువు కున్న వాళ్ళున్నారు. వీరు ప్రత్యేక నాణేలు

జి. ఎస్. చంద్రగిరి

★ కన్నెత్తితే చాలు కనకాభిషేకాలు యీ వాక్యం ఏ కవిత లోనిది? ఎవరు రాశారు? ఎక్కడ దొరుకుతుంది?

● చిట్టితల్లీ – నండూరి సుబ్బారావుగారి ఎంకిని ఎరగవా – ఆమె– కన్నెత్తితే చాలు కనకాభిషేకాలు! బెజవాడలో బుక్ షాపులలో దొరకవచ్చు. దొరక్కపోతే చెప్పు – కనీసం యీ ఒక్క పాటా రాసేనా పంపుతాను – అదే నీ ఎడ్యుకేషన్!

ఎస్. వి. వడ్లమూడి

★ మీ చేత సెన్సారు గాబడిన అతి దురదృష్టకరమైన మళయాళీ చిత్రం ఏదేనా వుందా?

● ఏ ఒక్క మెంబరూ ఏ చిత్రాన్ని చిత్రహింస పెట్టలేరయ్యా స్వామీ! అయినా మళయాళీలే సిగ్గు పడుతున్న మళయాళ చిత్రాలని ఆరు షోలూ బాక్సాఫీసు లాభాలుగా పోషిస్తున్నది తెలుగు ప్రేక్షకులేనని చెప్పుకుంటున్నారు.

● రజనీష్ ఆశ్రమంలో ఒక్క క్షణమైనా గడపని బ్రతకు ఒక బ్రతుకేనా?

● ఎప్పటి రజనీష్? కాలూనడానికి స్థలం దొరకని ఇప్పటి వారి ఆశ్రమంలో నా! కాలూనా లేకుండా వుండే అప్పటి పూణా ఆశ్రమంలో నా?!

వెంకట్. ఉరవకొండ

★ మీ ప్రశ్నావళి శీర్షిక చాలా బాగుంటుంది. ప్రయోజనకరమైన శీర్షికగా విలసిల్లుతున్నది. పత్రిక తెలుగు సాహిత్య వీధిలో ఒక జ్యోతిగా విరాజిల్లుటకు కారణం ప్రశ్నావళి అంటే – అతిశయోక్తి కాదనుకుంటాను

● కాదు. షైపర్ బోల్! మీ లేఖ చదివితే నాకో యీసప్ కథ గుర్తొస్తుంది ఒక ఏనుగు వంతెన దాటడానికి నడుస్తూందట దాని చెవిలో ఓ జోరీగ కూర్చుని – 'మనం చాలా సులభంగా వంతెన దాటాం కదూ! అందిట జోరీగ! పత్రిక మహాగజం. నేను జోరీగని కూడా కాదు సంస్థ బలం వ్యక్తుల కాపాదిస్తే ఎలా?!

★ ఆడదాని జీవితంలో అసలైన అందమైన, అవసరమైన మలుపు ఏది?

● ఏది లేదు! ప్రతి మలుపూ ఒక కొత్త బాధ్యత ఆడదానికి.

★ ప్రాచీన మహిళా సమాజం నుండి ప్రస్తుత భారతీయ మహిళా సమాజానికి మీ సలహా.

● ఏముంటుంది?! వెనక్కి చూస్తూ బ్రతకడంలో అర్థం లేదు. ముందు చూపు ముఖ్యం అని... గార్గీ మైత్రేయీ అంటూ ఉబ్బిపోతూంటారు ఆడాళ్ళు, సీతా సావిత్రీ అనసూయా అంటూ జ్ఞాపకం చేస్తూంటారు – మగవాళ్ళు.

కె. జె. ఎన్. కోసిగి

★ రాయిని ఆడది చేసిన రాముడిని కాదు, తలపై గంగను మోసిన శివుడిని కాను అయితే ఎవరై వుంటారబ్బా?

● ఏముంది చాటుమాటుగా చిన్నిల్లూ పెద్దిల్లూ రన్ చేసే మనిషి అయి వుండాలి.

సి. హెచ్. ఎన్. నిడదవోలు

★ ఈ రోజుల్లో డబ్బుకి బంగారానికి విలువ ఎక్కువైంది

● నిజమే. డబ్బు లేనివాడు డుబ్బుకి కొరగాడన్నారు □








# "నాకు నచ్చిన వ్యక్తి"

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

### వ్యాస రచన పోటీ



**మొదటి బహుమతి : పోర్టబుల్ బ్లాక్ అండ్ వైట్ టి.వి.**



**రెండవ బహుమతి మిక్సర్**



**మూడవ బహుమతి : పెద్ద సూట్‌కేస్**



**ప్రత్యేక బహుమతులు 3 హెచ్.ఎం.టి. చేతి గడియారాలు**

## నిబంధనలు

1. ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు. ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ పోటీలో పాల్గొనరాదు.

2. వ్యాసంలో మీకునచ్చిన వ్యక్తిగా ఇప్పుడు జీవించి ఉన్న వారిలో ఎవరినైనా పేర్కొనవచ్చు.

3. వ్యాసం ఒక అరఠావు (సుమారుగా 17×29 సెం.మీ) మించరాదు. కాగితానికి ఒకవైపే సిరా లేదా బాల్‌పెన్‌తో రాయాలి

4 ఈ పేజీలలో ఇచ్చిన ప్రశ్నావళి, కూపన్‌లని పూర్తి చేసి వ్యాసంతో పాటు విధిగా పంపాలి. వ్యాసం రాయనివారు కూడా ప్రశ్నావళి పూర్తిచేసి పంపవచ్చు.

5 పోటీకి పంపిన వ్యాసాలని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపటం సాధ్యంకాదు. కాబట్టి వాటితోపాటు స్వంత చిరునామాకల, స్టాంపులు అంటించిన కవర్లు జతపరచవద్దని కోరుతున్నాము.

6. గడువుతేదీ 31–5–1986 ఆ తర్వాత అందిన వ్యాసాలు పరిశీలింపబడవు.

7. ఈ పోటీలో తుది నిర్ణయం సంపాదకునిదే. పోటీలో పాల్గొనే వారంతా దానికి బద్ధులై ఉండాలి. దీని విషయమయి ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

8. పోటీకి పంపే వ్యాసాలని సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520003 అన్న చిరునామాకి పంపాలి. కవరుమీద "నాకు నచ్చిన వ్యక్తి వ్యాసరచన పోటీకి" అని స్పష్టంగా రాయాలి.

పాఠకులందరూ ఈ పోటీలో ఉత్సాహంగా పాల్గొని దీనిని జయప్రదం చేయవలసిందిగా కోరుతున్నాము

–సంపాదకుడు



# ప్రశ్నావళి

ముగింపు తేదీ : 31–5–1986

1. నాకు ఎక్కువ నచ్చిన శీర్షిక ____________________

| | | | | |
|---|---|---|---|---|
| 2. కథలు | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 3. సీరియల్ నవలలు | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 4. సినిమా శీర్షిక | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 5. న్యూఢిల్లీ లేఖ | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 6. హైదరాబాద్ నోట్‌బుక్ | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 7. బొమ్మల కథ | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 8. వారఫలాలు | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 9. ప్రశ్నావళి | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 10. డాక్టర్ సలహాలు | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 11. ధర్మపథం | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 12. కార్టూన్‌లు | చూస్తాను | ☐ | చూడను | ☐ |
| 13. కవిత | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 14. ఉత్తరాలు | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 15. సినిమా శీర్షికలో సినిమా ప్రముఖులతో ఇంటర్వ్యూలు | ఉండాలి | ☐ | ఉండనక్కరలేదు | ☐ |
| 16. వ్యాసాలు | చదువుతాను | ☐ | చదవను | ☐ |
| 17. ఆంధ్ర సచిత్ర వారపత్రికకి లేఖలు | రాస్తాను | ☐ | రాయను | ☐ |
| 18. ఆంధ్ర సచిత్ర వారపత్రిక నాకు సక్రమంగా | అందుతోంది | ☐ | అందటంలేదు | ☐ |
| 19. నేను ఆంధ్రసచిత్ర వార పత్రికని తెప్పించేది | ఏజెంటుద్వారా | ☐ | పోస్టుద్వారా | ☐ |
| 20. నేను ఆంధ్రసచిత్రవార పత్రికని ప్రతివారం షాపులో కొంటాను | అవును | ☐ | కాదు | ☐ |

(తగిన విధంగా ఆయా గడులలో ✓ గుర్తుపెట్టండి)

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

"నాకు నచ్చిన వ్యక్తి"

వ్యాస రచన పోటీ

వ్యాసం రాసిన వారి పేరు : ..............................

పూర్తి చిరునామా : ..............................

..............................

..............................

..............................

# కొత్త వయసు కోరికలు అల్లుకున్న మాలికలు ఆప్కో చేనేతలు!

యుక్తవయసు రాగానే
కొత్త వయసు
వచ్చిందనుకోవాలి కొత్త
వయసు రాగానే కోరికలు
మాలికలు అల్లుకోవాలి
ఆ వయసుని – ఆ
కోరికలను కలనేసిన
నేతతో ఆప్కో చేనేతలు.



**చేనేతలు**



ది ఆంధ్రప్రదేశ్
స్టేట్ హాండ్లూం వీవర్సు
కోఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్
హైదరాబాద్-500029

kiron/apco/85

# గ్లూకోన్-డి సూపర్‌హీరో.

ఉక్క పోస్తూ అలుపు
పుట్టించే రోజున కూడా
ఉరకలు వేసే శక్తి.




అలుపు తెచ్చే వేసవి రోజున మీ అబ్బాయికి కావలసింది గ్లూకోన్–డి: గ్లూకోజు, విటమిన్ డి, కాల్షియం ఫాస్ఫేట్సు గల తక్షణ శక్తినిచ్చే పానీయం.

గ్లూకోన్–డిని పళ్లరసం, పాలు, టీ, కాఫీ, లేదా నీళ్లలో కలిపారంటే కుటుంబం మొత్తానికి ఒక ఉల్లాస పానీయంగా తయారైపోతుంది.

100, 200, 500 గ్రాముల ప్యాకులలో లభిస్తుంది.

గ్లాక్సో వారి గ్లూకోన్–డి

## గ్లూకోన్-డి ®

సూపర్‌హీరో అమితంగా ఇష్టపడే శక్తినిచ్చే పానీయం

GLL-2389

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA
25, APRIL–1, MAY, '86

వేసవి విడిదిలా
చల్లని చీరెల నిధిలా
అందానికి, ఆనందానికి
ఈ ఉగాది నాంది...
'గాంధి టెక్స్'
కాటన్ చీరెల
సముదాయం!
స్త్రీలోకానికి
సౌందర్యాతిశయం!!



మా లేటెస్ట్ వెరైటీలు
999, 888
777, 666
ఆర్గండీ డోరియా

# గాంధి టెక్స్©
## కాటన్ శారీస్

గాంధీ శారీస్ (ప్రై.) లిమిటెడ్ వారి తయారి

H.K. INTERNATIONAL/GS/TL

గాంధి టెక్స్ కాటన్ శారీస్ అన్ని షాపులలో లభించును

ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు : విజయవాడ వస్త్రలత : అమర నాగేంద్రుడు అండ్ సన్సు, శ్రీలక్ష్మి క్లాత్ కార్పొరేషన్, గిరిజా శారీ (ట్రేడర్సు)- చీరాల : అమర వెంకట సుబ్బారావు అండ్ సన్సు, మాలెపాటి సుబ్బారాయుడు కంపెనీ, (పొదు టూరు : నల్లు (బదర్సు)